# అంతఃపురము

రైనాల్డ్సు

మొసలికంటి సంజీవరావుపంతులు

"బక్సారు యుద్ధము," "మొగలాయీదర్బారు" గ్రంథకర్త



సరస్వతీ గ్రంథమండలి

రాజమహేంద్రవరము

నిజాము రాష్ట్రమందుండు ఆంధ్రసోదరుల సౌకర్యార్థమై దక్షిణ హైద్రా [illegible] నెం. 544/566 గు గృహమందు నామపల్లి గౌరీశంకరవర్మ అండుకో, ఆంధ్ర [illegible]డిపో వారిని మా ప్రతినిధులుగా ఏర్పఱచినాము. కావున నిజాము రాష్ట్ర [illegible] కావలసిన పుస్తకములను వారికి వ్రాసి తెప్పించుకొన వచ్చును.

కృష్ణామండలము నందుండు మాచందాదారుల సౌకర్యార్థమై బెజవాడలో ఆర్. జి. పాల్ అండు కో వారిని మా ప్రతినిధులుగా యేర్పఱచినాము. కావలసిన పుస్తకములు వారికిని వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ప్రకాశకుఁడు.

# పీఠిక

'రైనాల్డ్సు' నామధేయుఁడగు ప్రసిద్ధాంగ్ల నవలాకారుఁ డాంధ్రలోకమున కపరిచితుఁడు కాఁడు. బహు గ్రంథరచనాధురంధరుండగు నీప్రతిభాశాలి కాంగ్లసారస్వతమున నేకారణముననో స్థానము లేదు.

రైనాల్డ్సుయొక్క "Loves of the Harem" అను గ్రంథమున కియ్యది అనువాదము.

తురుష్కరాజధానియగు 'కాన్‌స్టాంటు' నగరము ఘోరతర నిగూఢనరమారణమున కాలవాలమాయెను. ముప్పదిసంవత్సరములు మీఁఁజని సుంకరపురుషులు జాతి మత వివక్షణలేక, ఆకస్మికముగ, నకారణముఁగ విగతజీవులగుచుండిరి. తచ్ఛవములు బాస్ఫరసు జలములపైఁ దేలుచుండెను. వానిని బరిశీలింప, వారందఱును మెడవెనుక గొంచెము క్రిందుగఁ దగిలిన కత్తిపోటుచేఁ దెగటారిరని వ్యక్తమగుచుండెను. హంతకుఁ డెవ్వఁడో తెలియకుండెను. భయంకర దుర్మరణముల సంఖ్య అధికతరమగుచుండెను. నగరమునందు సహజ~~ము~~ హాహాకారములు చెలరేగెను.

మన కథాప్రారంభావసరమున రాజధానిస్థితి యట్లు లుండెను. 'ఖాలీలు' నామధేయుఁడగు కథానాయకుఁడు తదన్యజనాసాధ్య కార్యభారము వహించి, అత్యద్భుతకార్యము లొనరించి, కృతకృత్యుఁడై, తుదకు సార్వభౌముఁ డగును.

కథాకల్పనయందును, ప్రధానకథను బోషించుటకై యుపకథలను సముచితముగఁ గల్పించుటయందును, పాత్రప్రదర్శనమునందును, పాత్రపోషణమునందును, తదాధిక్యమునందును రైనాల్డ్సునిక్కముగ నద్వితీయుఁడు. ఈతని మించిన పాశ్చాత్యు లనేకులున్నను, కొందఱు పాఠకుల కీతఁడే అదర్శప్రాయుఁడై యున్నవాఁడు.



సంఘ భాషా దేశాభ్యుదయములకు భాషాంతరీకరణములుగూడ నావశ్యకములు. స్వతంత్రగ్రంథము లెంత యవసరమో, అన్యగ్రంథానువాదములును అంత యవసరమె. ఈసువ్యక్తవిషయము అల్పజ్ఞులకుమాత్ర మవ్యక్తము.

భాషాంతరీకరణము సులభసాధ్యము కాదు.—కవిత్వమువలె నిదియు నొకకళయని చెప్పఁదగును.—కావుననే, ఆంధ్రీకరణములంతగా రుచింపఁజాలకున్నవి. అందు, దేశభాషాగ్రంథములకంటె, నాంగ్లగ్రంథములు మఱియుఁ గష్టసాధ్యములు. దేశభాషలకు సంస్కృతము మాతృకమగుటయు, నాంగ్లము మనకుఁ గేవలము విరుద్ధమగుటయే అందులకుఁ గారణము. అల్పజ్ఞున కిదియు దుర్గ్రాహ్యమై, సర్వము సామాన్యముగఁ దోఁచుట సహజము. కావుననే విద్యార్థి విద్యాధిక, విద్యాశాఖాధికారుల మన్ననఁ గాంచిన 'బక్సారుయుద్ధము'ను తదితర గ్రంథములను రచించియు, నాంగ్లగ్రంథానువాదమొనరించుటకు గడుశంకించితిఁ. నేఁ దెనిగించిన 'మొగలాయీ దర్బారు' సంపుటములు చదివిన నామిత్రులు లవ్యాజగౌరవాభిమానపూరితచిత్తముతో నన్నుఁ బ్రోత్సహించుటచే, నీగ్రంథానువాదమునకుఁ గూడఁ బూనుకొంటిని. రసగ్రహణపారీణులగు పండితులు తప్పులను మన్నింతురుగాక.

రైనాల్డ్సు గ్రంథములలోనెల్ల నిదియే మిగులరసవంతమైనదనియు, తొలుదొల్త దీనినే తెనిగింపవలయుననియు, హిత మొనరించిన అబ్దుల్ ఎస్. వాహబుసాహెబునకును, శ్రమయనక వ్రాతప్రతిఁ జూచిన నా మిత్రులు పురిపండా అప్పలస్వామిగారికిని, ప్రసిద్ధ సరస్వతీగ్రంథమాలాధ్యక్షులగు శ్రీయుత అడ్డేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారికిని నేను గృతజ్ఞుఁడను.

విశాఖపట్టణము
1—2—38

మొసలికంటి సంజీవరావు

# ఒక్కమాట

పీఠికయందొక విషయము వ్రాయమఱచితిని. ఈ యపూర్వ నవల అనేక కథాకరము. కథానాయకుఁడగు ఖలీలుఁడు ఏడు కథలు వినిపించి, నాఁటి శ్రోతలవలెనే నేఁటి పాఠకులనుగూడ ఆనందమున నోలలాడించును. అందు, ఏడవకథ కడుదీర్ఘమై, రసవంతమై, రెండు ప్రత్యేకసంపుటము లాక్రమింపఁజాలియున్నది. ఆకారణముననే ఆకథ పూర్తిగ విడిచివైచితిని. అనవసరమని యెంచి, లూకాసు చెప్పిన చిన్నకథ గూడ విడిచితిని.

విశాఖపట్టణము
15_8_28

మొ॥ సంజీవరావు

## ఐదవకథ.

నాకథ 1483 నాఁటిది. ప్రసిద్ధపురుషుఁడగు రెండవ మహమ్మదు సుల్తాను మరణించినంతనే యాతని కుమారులిర్వురు సామ్రాజ్య సంపాదనార్థము యుద్ధసన్నద్ధులైరి. జ్యేష్ఠుఁడగు బైజీదుయుద్ధమున జయమంది సింహాసనాసీనుఁ డాయెను. రెండవ రాజకుమారుఁడగు జిజీము ఓటువడి 'రోడ్సు' నగరమునకుఁ బాఱెను. నిజసోదరుఁ డొనరించు కుతంత్రములకుఁ దాళఁజాలక, జిజీము ఆ నగరమునుండి ఇటలీ దేశమునకును, మార్గమధ్యమునఁ బలుబాము లనుభవించి యనంతరము ఫ్రాన్సుదేశమునకునుఁ బాఱి, తుదకు 'శానేజీ' యను దుర్గమున బంధితుఁడాయెను.

జిజీము రాకుమారుఁ డిరువదినాలుగేండ్ల యువకుఁడు. వాని శీతల వినీల నయనములును, కపిలవర్ణ విరాజిత దీర్ఘశిరోజములును, మనోహర మందహాసమును, విచారాక్రాంత వదనమును ఆతనిఁజూచువారి హృదయము నాకర్షింపఁజాలియుండెను. నిజదేశాచార విరుద్ధముగ గడ్డము విడనాడి క్రైస్తవ నాగరక జనోచితవస్త్రధారణ మొనరించు నా రాజకుమారుఁడు భయంకర వీరుఁడగు నూస్మాను వంశజునివలెఁ దోఁపక, 'ఫ్యారిసు' నగర నివాసియగు నొక కులీనునివలె నీటుగఁ గాన్పించుచుండెను.

మోటుజనులయొక్కయు ననాగరకులయొక్కయు మానసము గూడఁగరగింపఁజాలు గాన కవిత్వకళలు జిజీమున కత్యంత ప్రియతమములై యుండెను. రూపురేఖలవలె నాతని స్వభావముగూడ సరసముగ,సరళముగ మనోరంజకముగనుండెను. ఆతనితోడి ప్రసంగము కడు

నానందదాయకముగ నుండెను. శిల్పచిత్రలేఖనములందును నాతఁడు ప్రవీణుఁడై యుండెను. మహమ్మదీయ జనసహజాసంబద్ధమూఢవిశ్వాసముల నెఱుంగనివాఁడుకూడ నగుటచే నారాజకుమారుఁడు మఱియు ప్రశంసనీయుఁడై యుండెను.

శానేజీ దుర్గాధిపతి అపత్నీకుఁడు. ఆతనికిఁ బదునాఱేండ్ల ప్రాయపు పుత్రిక యుండెను.

'హెలీనా'యను నామధేయముగల ఆకన్నియ అత్యంత సౌందర్యవతియగుటచే నా ప్రాంతమునందలి బలాధికార సంపన్నులగు జమీందారులందఱు మోహపరవశులై యామెను వివాహమాడ నాసించి యుండిరి. అందు 'ఆల్బర్టు' అను ప్రభువు యువకుఁడు, రసజ్ఞుఁడు, అమిత ధనవంతుఁడు అనంత భూసంపన్నుఁడు నగుటచేఁదన తనయ నాతని కొసంగవలయునని హెలీనా జనకుఁడు నిశ్చయించెను. కాని, ఆమె హృదయాభిప్రాయము వేఱుగనుండెను. ఆల్బర్టుధనాధికార బల సమేతుఁడయ్యు, మధుపానాది దుర్వ్యసనలోలుఁడగుటచే హెలీనా హృదయము నాకర్షింపఁజాలకపోయెను. సకల సద్గుణ ఖనియగు నా కన్నియ అట్టి గుణరహితు నెట్లు ప్రేమించును?

మనోహరాకారుఁడు, సచ్ఛీలుఁడు, అఖిల కళాధాముఁడునగు జిజీము రాకుమారుఁడు హెలీనాను గాంచినంతనే మోహపరవశుఁ డాయెను. ఆ సుందరియు జిజీమునుగాంచి నిజహృదయ సమర్పణ మొనరించెను. ఆయువతీ యువకు లనూన రూపవైభవ విభ్రాజితులై, అగణిత సుగుణగణ విరాజమానులై, పరస్పరము తగియుండుటచే దృఢతమప్రేమానుబద్ధులగుట సహజముగదా. దుర్గాధిపతి జిజీము నత్యంత గౌరవాభిమానములతో నరయుచుండెను. రాజకుమారుఁడు బందావలెఁగాక, ప్రభుకుటుంబములోనివానివలెఁ గడుజనవుగఁ గలసి మెలసి తిరుగుచుండెను. భార్యారహితుఁడగునాదుర్గాధీశుఁడు నిజమిత్ర

సందర్శనార్థము తఱుచుగా నిటునటు బోవుచుండుటచే, నా యువతీ యువకుల ప్రణయము ప్రవర్ధిల్లుటకు వలయు నవకాశ మలవడుచుండెను.

హెలీనా రాజకుమారుల ప్రణయము నిష్కళంకమై, పవిత్రవంతమై కడు ప్రశంసనీయమై యుండెను. తమ పరస్పరానురాగము గుఱించివారు తొలుదొల్త బరస్పరము ప్రశంసించికొనలేదు. పరస్పర మృదుల వీక్షణములను, ప్రణయ పరిపూర్ణజన సహజేతర ప్రవర్తనమునందును వారి హృదయ పరివర్తనము ప్రతిబింబింతమగుచుండెను. కాని దుర్గాధిపతిమాత్ర మావిషయమెఱుంగఁడు. ప్రణయినీ ప్రణయులకు సహజగుణమై యొప్పు భయముచే వారాతని సమక్షమునఁగడు మెలఁకువగ మెలంగుచుండుటచేతనో, లేక, తన పుత్రిక అన్యమతస్థునేల ప్రేమించుననెడు నిబ్బరముచేతనో గాని, దుర్గాధిపతికి అనుమానమైన నంకురింపలేదు.

జిజీము రాకుమారుఁడరుదెంచి రెండుమాసములాయెను. ఒకనాఁడు, దుర్గాధిపతి తన తనయను రావించి యిట్టులనెను.—

“కుమారీ! మన ఆల్బర్టుప్రభువునకు నేఁడు సాయంకాలము గొప్పవిందుచేయఁదలచితిని. ఇతర జమీందారులనుగూడ నాహ్వానింతును. ఆల్బర్టునకు నిన్నియఁ దలఁచితినని యెఱిఁగియేయున్నావు. రేపుదయమే మీవివాహము వైభవముగఁ గాఁగలదు. నేఁడు నీవు సముచిత వస్త్రధారణమొనరించి సిద్ధముగ నుండవలయు.”

హెలీనా హృదయము కంపించెను. ఆకన్నియ దీనాననయై, కరములు జోడించి, మోఁకరించి దురంత దుఃఖాతిరేకమున నిట్టులనెను.—

“తండ్రీ! నిన్నువీడి పోఁజాలను. జన్మస్థలమై, ఆబాల్య విహారణరంగమై, కడుంగడు స్మరణీయమై యొప్పు నీగృహమువీడఁ జాలను.”

“బిడ్డా! అవివేకమున నిట్టులాడెదవు. వివాహమాడి నీగృహము నకుఁబోకుండ, శాశ్వతముగ నిందుండఁ జాలవు.”

"జనకా! ఆల్బర్టును వివాహమాడవలయునని యాశింపను. మాయభిరుచులు పరస్పరము కడు విరుద్ధములు.—"

"భార్యా భర్తల రుచు లనతికాలమున నొక్కటి యగును."

"తండ్రీ! ఆ ప్రభువు నాకుఁ బ్రేమాస్పదుఁడుకాఁడు." అని వెక్కి యేడ్చు తనబిడ్డను వారించి, దుర్గాధిపతి యిట్టులనెను.—

"ప్రేమించి వివాహమాడుట కేవలము కథలలోని విషయము. కాని, వివాహానంతరము ప్రేమ ప్రభవించుటయే సామాన్య విషయ మని గ్రహింపుము.—"

"తండ్రీ! ఈ ఆల్బర్టుతోడి వివాహము ప్రేమజనకము కానేరదు." మానసముద్రేకించిన కారణమున నాతెఱంగున నిశ్చలస్వరంబున హెలీనా విస్పష్టముగఁ బలుక, జనకుఁడిట్టులనెను.—

"చాలు, చాలు! ఇట్టి వృథాభయంబువలదు. కుమారీ! నేను వృద్ధుఁడనైతి. చిరకాలము మనఁజాలను. మృత్యువు ప్రాపించకమున్నె నీకుఁదగు వరునరసినఁగాని నాజన్మము సార్థకము కానేరదు. అనంత రము నిశ్చింతతో మనఁగలను. సౌందర్య ధనధైర్య సమన్వితుఁడగు ఆల్బర్టు మనకన్ని విధముల వాంఛనీయుఁడు."

"తండ్రీ! మఱలఁ బ్రార్థింతును. మనసులేని పురుషునకు నన్నుఁ గట్టబెట్టుట పాడికాదు. దాన నీపుత్రిక సౌఖ్యమునకు వెలియగుటయే గాక, నిరంతర దుఃఖార్ణవనిర్మగ్న యగును— ఆల్బర్టుపై నాకుఁబ్రేమ లేదు— నేను వాని నెన్నఁడు బ్రేమింపఁజాలను— నా హృదయము నకు విరుద్ధములగు వైవాహికసమయము లొనరింపఁజాలను.—

"కుమారీ! బాలికవగుటచే నింగిత మెఱుంగక ఏమియో పల్కెదవు. ముగ్ధయువతీ హృదయము నే నెఱుంగనిదికాదు. ఇట్టులే విప రీత భయసంభ్రమాకులంబై యుండును. నాబిడ్డ సౌఖ్య మరయు విధము నే నెఱుంగుదును. నేఁబంచు విధంబున మెలంగుదేని, అచిర

కాలమున నీవే నన్నుఁ గొనియాడెదవు. కావున, సాయంకాలపు విందునకు సిద్ధముగ నుండుము."

అట్లు పలికిన వృద్ధ జనకుఁడు వేఱొక కార్యముమీఁద వెడలెను. హెలీనా తన డెందమునఁ బొంగు విషాదము సహింపఁజాలక, మన సార నేడ్చుటకై తన మందిరమునకుఁ బోయెను.

తురుష్క రాజకుమారుఁడగు జిజీమున కొక ప్రత్యేక మందిర మమరియుండెను. తన సదుపాయముల కేకొఱఁతయు లేకున్నను, ఆతఁ డామందిరము మాత్రము వీడరాదు. ఈ ప్రతిబంధక మొక్కటియే ఆతని యస్వతంత్రావస్థకు సాక్షీభూతమై యుండెను. హెలీనా మందిర మద్దానికంటియే యుండెను. జిజీము తన మందిరపు డాబాపై విహరించుచుండెను. దురంత దుఃఖానల తప్తయగు హెలీనా యాతనిఁ గాంచినంతనే, ప్రకంపిత హృదయయై, అనిర్వచనీయో త్సాహ ప్రోత్సాహితయై అప్రయత్నముగా రాజకుమారుని చెంతకుఁ బోయెను. వారి ప్రసంగము సామాన్యముగనే ప్రారంభమాయెను. కాని, హెలీనా ఉత్సాహరహితయై, విషాదాక్రాంతవదనయై, ఆందోళితచిత్తయై యుండెనని కొంత తడవైన పిమ్మట గనిపెట్టి, రాజ కుమారుఁ డిట్టు లనెను.

"సుందరాంగీ! నీ మానస మేలకో దుఃఖానలతప్తయై తోచెడిని. కారణ మరయఁదగునా? ఏ కష్టమెఱుంగక సుఖజీవన మొనరించు నీకు ఘటిల్లిన విఘాత మేమి?"

జలజల ప్రాలు బాష్పబిందువులను బోఁద్రోచి హెలీనా యిట్టు లనెను—

"ఆర్యా! ఏమి చెప్పుదు? నా సౌఖ్యమరయు మహనీయుని వల్లనే నాకీదురవస్థ ప్రాపించెను."

"నీ జనకుఁడు కావలయు?"

"రాజా! నిక్కము. ఆల్బర్టు ప్రభువును బరిణయమాడ వలయు నని నాజనకుఁడు శాసించెను!"

పిడుగువంటి యా దుస్సహంపుఁ బలుకులు వీనులఁ బడినంతనే, జిజీము గ్రాన్పడి, నిజకరబంధిత ప్రియకాంతా హస్తము వీడకయే ఉద్విగ్న స్వరమున నిట్టు లనెను.—

"ఆల్బర్టుతో వివాహమా! వలదు! హెలీనా! వలదు—వలదు!"

హెలీనా వదనమండలము సుందర సంధ్యారుణ భాసురంబాయెను. తదావేశమునఁ దనహస్తము నక్కునఁనొత్తు రాజకుమారుని వారింప నేరక ఆ కాంత భయాతురవీక్షణయై రాజకుమారునిఁ దిలకించెను. ప్రణయప్రపూర్ణ వీక్షణముల నాతఁడును దిలకించి యిట్టులనెను.—

"హెలీనా! ఈ వివాహము వలదు. ప్రియతమా! నా జీవిత సౌఖ్యము నీపై నాధారపడియున్నది. నిన్ను వీడి మనఁజాలను. సుందరీ! నా హృదయము నీయధీనమైయున్నది. అనంతమై, అవిరళమై, అనివార్యమై, వర్ణనాతీతమై యొప్పు ప్రేమానుబంధిత హృదయముతో నిన్నుఁ బ్రేమించువాఁడను. తరుణీ! నీకతంబునఁ బ్రవర్ధిల్లిన దృఢతమ మోహమును నీవ యంతరింపఁజేసి ఈ యభాగ్యుని నిరంతర గభీర దుఃఖార్ణవ నిర్మగ్ను నొనరింపకుము. సుందరీ! ఏమందువు?"

హృదయము తడబడ, నవ్యక్త మధురస్వరంబున నా కన్నియ యిట్టులనెను.—

"రాజా! భవదీయ ప్రబలోద్విగ్న హృదయాభిప్రాయ మనివార్యము—"

"హా! ధన్యుఁడను! నీ వౌదాసీన్యము వహింపకుండుట నాభాగ్యము. అఖండ సామ్రాజ్యాధిపత్యము వహింపవలసిన నేను దురంత దౌర్భాగ్యము కారణమున భగ్నమనోరథుఁడనై నిలిచిన తావున నిలువఁ

జాలక, ఎందును దలఁదాచికొన నెలవు గానక, పడరాని బాధలు పడి తుద కీస్థలంబున కరుదెంచుట,—నిన్నుఁగాంచి ధన్యుఁడనగుట కే కావలయు!"

"రాజకుమారా! రాజ్య సంపాదనార్థము ఘోరసంగ్రామ మాచరించియే యుందువు? పరాక్రమ సమన్వితములగు నీ యుద్ధానుభవములు వినుటకు నామానసము తత్తరపడుచున్నది."

"సుందరీ! చెప్పెద నాలింపుము. యశోవంతుఁడగు మదీయ జనకుఁడు మహమ్మదు సుల్తాను కనుమూసినంతనే, వేర్వేరు రాష్ట్రములు పాలించు నాకును నా సోదరుఁడగు బైజీదునకును మా వజీరు వర్తమాన మంపెను. వజీరు మదీయ శ్రేయోభిలాషి యగుటచే నేనరుదెంచువఱకు సుల్తాను మరణము మఱుఁగుపఱుప వలయునని ఎంతయో ప్రయత్నించెను. కాని, ఈ రహస్యము నెట్టులో జనీజరీలు గ్రహించి తిరుగఁబడి, వజీరును సంహరించి బైజీదును సింహాసనాసీను నొనరించిరి. నాకొఱకు బయలుదేఱిన వార్తాహరుఁడు మార్గమధ్యమున నిహతుఁడాయెను. ఆసియాఖండమునందలి తురుష్కరాష్ట్రములకెల్ల మేటినగరమగు 'బ్రూసా' పట్టణమున కల్ప సైన్యసమేతుఁడనై నేనంతలో నరుదెంచితిని. నన్ను వారింపఁగడంగిన బైజీదు యొక్క సేనాపతిని యుద్ధమున నోడించి నా సార్వభౌమత్వము ప్రకటించికొంటిని. ఆహా! ఇది మూడువారముల ముచ్చట. అంతలో బైజీదు సుల్తాను మహాసైన్యసమన్వితుఁడై స్వయముగా నాపై దండెత్తి యరుదెంచెను. అన్నదమ్ములకు యుద్ధము వలదనియు, ఆసియా రాష్ట్రాధిపత్యము నాకు విడిచి, యూరపునందలి సామ్రాజ్యము పూర్తిగఁ దాననుభవింపవచ్చుననియు నేను మాయన్నకు వర్తమాన మంపితిని. బైజీదు నిరాకరించెను. యుద్ధమున నాతఁడే విజయుఁడగుటచే, నేనందు నిలువఁజాలక, ముందుగ 'సిరియా' కును, అనంత

రము 'కైరో' నగరమునకును బాఱితిని. నాకు వలయు సాహాయ్య మందు లభించుటచే, సామ్రాజ్య సంపాదనార్థము మగుడ యుద్ధ సన్నద్ధుఁడ నైతి. బైజీడే మగుడ స్వయముగా ననంతసేనావలయ వలయితుండై ప్రత్యక్షమాయెను. కొన్ని రంగముల జయించి కొన్ని రంగముల నోటువడి, తుదకు నాసైన్యమే నన్ను విడనాడుటచే జేయునది లేక ఆత్మసంరక్షణార్థము క్రిందటి సంవత్సరము రోడ్సు నగరమున కరుదెంచితిని. తన్నగర శాసకులగు క్రైస్తవవీరులు నాపై జాలిగొని, నాకొఱకు నైరోపా రాజన్యులందఱను యుద్ధసన్నద్ధుల నొనరింతుమని అమితాభిమాన గౌరవోదార హృదయముతోఁ బలికిరి. నేను గడు సంతసించి యుంటిని. కాని, నాసోదరుఁ డొసంగిన లంచములచే వారి మనసు విఱిగెను. వారంతట, నాయునికి తమ కపాయకరముగ నుండెనని పలికి, 'ఫ్రాన్సు' నృపాలు నాతిథ్య మపేక్షింపవలయునని చెప్పిరి. గత్యంతరము లేక, నేనట్టు లాచరించితిని. కాని, విశ్వాసఘాతుకులగు రోడ్సువీరులు నన్ను ఫ్రాన్సు రాజధానికిఁ జేర్పక, నా యనుచరులనుండి విడదీసి, మార్గమధ్యమున నిందందు నిలిపి, తుదకీదుర్గమునఁ బ్రవేశపెట్టిరి. సుందరీ! మదీయ దురంత దుఃఖభాజన చారిత్రము నెఱింగించితి—కరుణాయత్తచిత్తవై నన్నాదరింపక ఉపేక్షింతువేని, ఇదివఱకే దుర్భరవ్యథా విహ్వలాయమైన నాహృదయము వ్రక్కలగును—సుందరీ! భరింపఁజాల!—ఏమందువు!"

"ఆర్యా! నీ చరిత్ర కడుంగడు సంతాపకరము. నాహృదయము నిక్కముగఁ గరుణార్ద్రమై యున్నది."

"కరుణార్ద్రమా! అదియేడ? నేను నిన్నుఁ బ్రేమింతును;—నీవు నన్నేల ప్రేమింపరాదు?"

రుద్ధస్వరంబున హెలీనా యిట్టులనెను—

"నిన్ను ప్రేమించుటయా! ఆహా! అట్టి వచనములు వినఁజాలను. ప్రియభార్యయో, లేక, తావలచు మఱి యేనుచ్చెకంటియో నీకై గంపెడాసతో నిరీక్షించుచుండవచ్చును. మదీయ హృదయార్పణ మెట్లు లొనరింతును?"

నిజ హృదయావేగము నెట్టులో యడంచి అవనతాననుఁడై, రాజకుమారుఁ డిట్టులనెను.—

"హెలీనా! నాహృదయము పరాధీనము కాలేదు—పూర్తిగ నీ యధీనమైయున్నదని యెఱుంగుము."

"మదీయ హృదయము నీయధీనము!" అట్లు ప్రతివచనమాడు మోహనాంగి సుందరవదనము అధికలజ్జారుణరంజిత మాయెను. రాజకుమారుఁ డమందానందపారవశ్యమున నాకన్నియను దోడనే గాఢాలింగన మొనరించెను.

"సుందరీ! నాజన్మము నేఁడు సార్థకమాయెను. నేఁబట్టువడిన ముహూర్తము నిక్కముగ శుభప్రదము! నాభాగ్యవశంబుననే ఈదివ్యమందిరము నా కారాగృహ మాయెను..."

తదావేశమున నింకను ఏమియో పలుకు జిజీమును వారించి, విచారాక్రాంతవదనయై యల్లన నిట్టులనెను—

"ఆర్యా! ఈసుఖమంతయు క్షణభంగురము గదా! ఆల్బర్టుమొదలగు ప్రభువులకు నాజనకుఁ డీసాయంకాలము విందొనరించును— ఆల్బర్టుతోడి వివాహము రేపే కానున్నది."

"ఈవివాహము జరుగరాదు! జరుగరాదు!" అట్లు తదవసరోద్భూతక్రోధవివశుఁడై వడివడి నఱచు రాజకుమారుని వారించి, వికలచిత్తయై, విచారప్రకంపితస్వరంబున నాకాంత ఇట్టు లనెను.

"రాజకుమారా! వివాహము నెట్లువారింపనగును? ఆకాశసౌధములను స్వప్నసౌఖ్యములను బోలు మన యాశయ మెట్లు ఫలించు

ను? మన మతములు పరస్పరవిరుద్ధములు—మన ప్రార్థన లోకవేళ నాజనకుని మానసము కరగించుఁగాక—ఐన నేమి ప్రయోజనము? నామతము నేను వీడఁజాలను—నీ మతము నీవును వీడఁజాలవు."

తురుష్క రాజకుమారుఁడు మోహాతిరేకమునఁ దన దేశమును, రాజ్యమును, మతమును సర్వము పరిత్యజింతునని పలుక, నమందానందదీపితవదనయై హెలీనా ఇయ్యకొనెను. జిజీముతోడనే నిజబాహు పంజరబంధితకీరవాణి నవిరళముగా ముద్దాడెను. అనంతరము, తామొండొరుల నెడబాయరాదనియు, చచ్చినఁ జావవలయుగాని పరస్పరము విశ్వాసఘాతుకముగ మెలంగరాదనియు ప్రమాణము లొనరించిరి. హెలీనా యంతఁ దన మందిరమునకుఁ బోయెను.

సాయంకాల మైనంతనే ప్రసిద్ధపురుషు లందఱు శానేజీభవనమున కరుదెంచిరి. వివిధాపూర్వవస్తుసంభరితమై, అమిత వైభవసమన్వితమై ఆ మందిరము దర్శనీయమై యుండెను.

జిజీము రాజకుమారుఁడు గూడ నాహూయమానుఁడై యేతెంచి శానేజీ ప్రభువుచెంత నాసీనుఁడాయెను. ప్రభువునకు రెండవప్రక్క ఆల్బర్టు సుఖోపవిష్టుఁడాయెను. ఆతనిచెంతనే హెలీనా ఉత్సాహరహితయై వివర్ణవదనయై కూర్చుండెను. వివాహ మాడఁదలంచి తదుత్సాహాతిరేకమున నేమియోపమికు ఆల్బర్టు మధురప్రణయంపుఁ బలుకు లామె వీనులఁ బడుట లేదు. ఆతఁడు కొంత తడవైనపిమ్మట నావిషయము గమనించి, ఆ సుందరాంగి హృదయ మన్యాక్రాంతమై యుండునని వితర్కించి, తదదృష్టవంతుఁడు జిజీమే కావలయునని రయమున గ్రహించి, సహజముగ దురంతబాధితాత్ముఁడై, దుర్భరక్రోధకలుషితాంతరంగుఁడై, ప్రతిక్రియారచన సంసిద్ధుఁడై, రాజకుమారునిఁ గాంచి యిట్టులనెను—

"ప్రసిద్ధుఁడగు నూస్మానువంశజునకుఁ గుశలమేగదా. మా దేశ

మెంత యాకర్షణీయమైనను, మీదేశమునకు సరి రా...

"అయ్యా! బంధితునకుఁ గష్టసుఖములు సమానములు."

"ఆర్యా! ఐనను, ఇంతలి స్వాతంత్ర్యరహితజీవనము దుస్సహంబని భావింతును. నీవు గానాద్యనేకకళాప్రవీణుండవని విందును. ఐనను, మీకునకు సర్వసౌఖ్యమొదవఁగూర్చు వేఁట నీకు నిషిద్ధమగుటచే నీకీ జీవనము దుర్భరమైయుండును. మఱియు, మహమ్మదీయులు మనోహరనారీజనసందోహపరివృతులై హాయిగ నుందురు. అదియు నిచట గొఱంతయేగదా."

తురుష్క రాజకుమారుఁడరుణరంజితవదనుఁడయ్యు, సముచితముగా బదులాడెను. ఐనను, ఆల్బర్టు వీడక, ఇట్టులనెను—

"ఆర్యా! మధుర మందహాసవికసితవదనలగు మందయానలు నీకై యెంత పరితపించుచుందురోగదా."

జిజీము దుఃఖరాందోళిత మానసుఁడై తనసోదరితప్ప మఱియే కాంతయుఁ దనకై నిరీక్షింపదని పలికెను. ఆల్బర్టుమగుడ నిట్టులనెను.

"కాని మేము వేఱువిధంబుగ వినియుంటిమి. పాపము! పూతచరితయగు నీజననియు సౌందర్యవతియగు నీభార్యయొక్కయు ఖర్చువెచ్చములనిమిత్తము నీసోదరుఁడగు బైజీదు సుల్తాను వలయు వసతినేర్పఱచినను, రోడ్సునగరాధీశుఁడగు ఫ్రెంచివీరుఁ డెంతటి ద్రోహమొనరించెను—"

"భార్య" యనినంతనే హెలీనా విశీర్ణహృదయయై, జీవరహితవివర్ణవదనయై "సౌందర్యవతియగు భార్యయా!" అని యప్రయత్నముగా నఱచెను. దాన, జిజీము దురంతదుస్సహ క్రోధవివశుఁడై, ప్రచండానల సన్నిభుఁడై దుర్నిరీక్షుఁడై తీవ్రస్వరంబున నిట్టులనెను—

"ఓరీ క్రైస్తవ శునకమా! నిండోలగంబున నావిషయము నెత్తి యఖండ భూమండలాధిపునందనుని దుష్టవచోఘాతమున నవమాన

పఱచెదవా ? ఓరీ — !

ఆల్బర్టుకూడ సక్రోధముగా బదులాడ, జిజీము ద్విగుణీకృత క్రోధాతిరేకమున నిట్టనిలువుగ నిలుచుండి యిట్టులనెను.

“ఓరోరి! తుచ్ఛవరాహభక్షకా! మానవాధమా! పొమ్ము! పవిత్ర తురుష్కరాజవంశజుఁ డుండుస్థలంబున నీవంటి యపవిత్రుఁ డుండరాదు! సత్వరము పొమ్ము!”

వీరుఁడగు నాల్బర్టు సహింపఁజాలక, పండ్లుకొఱికి, నిజముష్టి ఘాతంబున రాజకుమారుని చెంపఁదాఁకి, మఱియు నిట్టులనెను—

“వీరుఁడా! సోదరు నెదిరింపఁజాలక, దేశదేశములు పాఱిన భీరుండవని యెఱుంగుదుము. ఈక్రైస్తవముష్టి ప్రహారణంబుననైనఁ బౌరుష మలవడునేమో చూతము”

దెబ్బతినిన జిజీము కొంతతడవు ఇతికర్తవ్యతావిమూఢుఁడై మిన్నకుండెను. అతిథిజను లందఱుఁగూడ నిశ్చేష్టితులై చిత్రముల చాడ్పున నుండిరి. మందిరము కడునిశ్శబ్దమాయెను. మహామానియగు రాజకుమారుఁ డంతలో దురంతపరిభవానల తప్తచిత్తుఁడై తటిల్లత సన్నిభంబగు కటారిం దటాలునదీసి, ఆల్బర్టుప్రభు కంఠమును తత్క్షణము ఖండించెను. అంతదనుక చేష్టరహిత శిలాప్రతిమలవలెనుండిన ప్రేక్షకులు హాహాకారంబు లొనరించిరి. హెలీనా మూర్ఛవోయెను. పరిచారికలాకన్నియను వేఱొకమందిరమునకుఁ జేర్చిరి.

తమ కట్టెదుట జరిగిన దురంతము గాంచిన ఆల్బర్టుమిత్రులు దుర్దాంతక్రోధఘూర్ణమానమానసులై ప్రతిహింసాతత్పరులై తురుష్కరాజకుమారునిఁ జుట్టిరి. వారిని వారించి శానేజీ ప్రభు విట్టులనెను.—

“మిత్రులారా! మదధీనుఁడగు జిజీమును మీరు వధింపరాదు. ఈతఁ డొనరించిన కృత్యము నిక్కముగ దారుణము, గర్హితము,

తప్పక శిక్షాపాత్రము. ఐనను, మీరు తీవ్రపడవలదు. ఈతఁ డన్య దేశస్థుఁడు; మన దేశ సాంప్రదాయముల నెఱింగిన వాఁడు కాఁడు; మంచి ప్రసిద్ధ రాజవంశజుఁడు. కావున, మన మేకార్యము తీవ్రపడి చేయరాదు. ఈ జిజీము ప్రస్తుతము పలాయన మొనరింపకుండ నిందే భద్రపఱచి, మన యున్నత న్యాయస్థానమున కంపుదము."

అతిథులు చేయునది లేక తమ తమ యిండ్లకుఁ బోయిరి. జిజీము విగతాస్త్రుఁడై నిక్కముపుఁ గారాగృహవాసివలెఁ బూర్తిగ నస్వతంత్రుఁడాయెను. ఏకాకియై నంతనే గత వృత్తాంతమంతయుఁ దలంపునకు వచ్చెను. తన యవివేక మపుడు తెల్లమాయెను. వేగిరపాటున తద్దేశాచార విరుద్ధముగ ఘోరకార్య మొనరించుటయే గాక, దాన నిజ ప్రియకాంతా వియోగము కూడఁ బ్రాపించునని యెంచి ఆతఁ డెంతయుఁ జింతించెను. ఉత్తుంగతరంగమాలికా సంకీర్ణ గభీర పారావారా మధ్యస్థక్షుద్ర నౌకపై నేకాకియై అసహాయుఁడై యుండు దురదృష్ట నావికుని చందమున నాతని యవస్థ ఉత్సాహరహితమై కడు దుస్సహమైయుండెను. జిజీము హృదయారాటమునకు వేఱొక కారణముండెను. ఆతఁడు నిక్కముగ సపత్నీకుఁడు కాఁడు. ఆల్బర్టు పలుకు లసత్యములు కావు. హెలీనానుఁ గాంచి మోహాతిరేకమున దన తొంటి వివాహము నాతఁడు మఱుఁగు పఱచెను. కాని, ఆల్బర్టు కారణమున రహస్యము బట్ట బయలాయెను. హెలీనా ఏమనును?

రాత్రి రెండు జాములాయెను. ప్రదేశమంతయు గంభీర నిశ్శబ్దాధీనమైయుండెను. జిజీము రాజకుమారుఁడు నిద్ర యెఱుంగక, చిత్తశాంతి యెఱుంగక, వివిధతీవ్రాలోచన వేధితమానసుఁడై పంజర బంధిత మృగరాజువలె నిటటు తిరుగుచుండ, నాకస్మికముగ గోడ యందలి పలక యొక్కటి చలించెను. రాజకుమారుఁడు భయసంభ్రమాకులుఁడై చూచుచుండగనే, తద్వివరమునుండి సమున్నతశరీరయగు

నొకకాంత ప్రవేశించెను— దుర్గాధిపతిపుత్రికయగు హెలీనాయే!

తోడనే జిజీము రయంబునబొతి ఆలింగన మొనరింపఁబోయెను. వానిని వారించి, హెలీనా యిట్లులనెను.—

"ఆర్యా! ఇట్టి రహస్య మార్గమున నీతెఱంగున నరుదెంచుట విపరీతముగఁ గాన్పింపవచ్చును. రాజకుమారా! వెఱ్ఱినై నీపలుకులు విశ్వసించి యమందానంద సాగరనిమగ్ననైతిని. ఇప్పుడైన నిక్క మరయుట దైవికము. దాన నా యవివేకము తెల్లమాయెను. అహా! నాహృదయ నైర్మల్యము దైవమెఱుంగు. కేవల మవ్యాజానురాగ హృదయముతో నేతెంచితినని నీవిపుడు గ్రహింతువుగదా!"

కాని, మోహాంధుఁడై అన్యమెఱుంగని రాజకుమారుఁడా పలుకులు పాటింపఁజాలక, తా మొనరించిన సమయము మఱువరాదని ఉద్విగ్నదైన్య స్వరంబున బ్రతిమాలెను. ఆకన్నియ అత్యుత్తమ మానినీసహజగాంభీర్యము వహించి, జిజీము చకితుఁడై ముగ్ధుఁడై చూచుచుండ, నిట్టులనెను.—

"రాజకుమారా! మన పూర్వచారిత్రము తలంపరాదు. నేను కృతనిశ్చయనై యున్నదానను— నాసంకల్ప మమోఘము. కాని, ప్రస్తుత విషయము గమనింపుము. నేఁడు మహాపరాధ మొనరించితివి— అందులకు మరణమే శరణ్యము— వలదు!— ఖడ్గము సారింపఁ బ్రయత్నింపకుము— నీవిపుడు నిరాయుధుఁడవని యెఱుంగవా? గమనింపుము. నీయున్నకు నీమరణమేవాంఛనీయము. తదాజ్ఞానువర్తులగు రోడ్సు వీరులకుఁగూడ నీమరణము తప్పక అపేక్షణీయము. భవదవివేక ధూర్తప్రవర్తనముననే నీవైరులకు మంచి యవకాశమొసంగితివి. రేపు నీవు మరణశిక్షకుఁ బాల్పడుదువు. ఇట్టి యకాల మరణము దుస్సహంబగుటచే నిన్నుఁదప్పింప సమకట్టి యరుదెంచితిని. ఇచ్చట కనతిదూరమున నొకచిన్న కుటీరమున్నది.

అందు నుద్భ్రాతృసమానుఁడొకఁడు రెండు జవనాశ్వములు నాయత్తపఱచి నీకై వేచియుండును. క్రైస్తవమతాధ్యక్షుఁడగు 'పోపు' యొక్క రాజ్యమునకు నిన్నాతఁడు చేర్పఁగలఁడు. కారణాంతరమున మీ 'యన్న పైఁ గినియు పోపు సుస్వాగతమొసంగుటయేగాక, నీకువలయు సాహాయ్యముగూడ నొసంగును. కావున, ఈ కారయందొక్క నిమిష మైనఁ బడయక పోవలయు, లెమ్ము!"

"హెలీనా! నేనెట్లు పోఁగలను? నా కతంబున నీవు నీజనకుని దురాగ్రహమునకు గుఱియగుదువుగదా"

"రాజకుమారా! అవిరళాశ్రుజల నిర్మగ్నమై ప్రార్థించు తన యను జనకుఁడు తప్పక మన్నించునని విశ్వసింతును.

"కాని, దయ్యములవలెఁ గావలియుండు భటులను గనుఁబ్రామి పాఱుటయెట్లు?"

"విందు సమయమునందలి మధుపాన మధికమగుటచే నాతండ్రి మేనుమఱచి నిద్రించుటఁగాంచి, ఈ ముద్రిక హరించి వచ్చితి. ఇఁక నిన్నెవ్వరు వారింపఁజాలరు. ఈ విషయము నాజనకుఁడెఱుంగు సరికి నీవు చాల దవ్వుననుందువు."

"హెలీనా! ఏమైనను, నిన్నువీడి పోఁజాలను. భయంకర మృత్యు నాలింగనమైనను సహింతుగాని, నిన్ను ఘోరవిపత్సాగరమున డించి పోఁజాలను. సుందరీ! పోఁజాలను!"

రాజకుమారుఁడాపగిది నుద్విగ్న స్వరంబునఁ బలుక, నమిత విచారకాతరస్వనమున హెలీనా ఇట్టులనెను.—

"ఆర్యా! దాన నాదురవస్థ మఱియు దుస్సహంబగును."

"హా! సుందరీ! మద్వియోగము నీకు దుస్సహమే!" అని వడి వడి నడచుచు, తదవసరోత్సాహ తమకమునఁదన కట్టెదుటనున్న సుందరిని గాఢాలింగన మొనరించెను. కాని, వివిధాలోచనలచేఁ

గ్రాఁగు నాయబలామణి తద్బాహుబంధనమునుండి రయంబునఁ దొలంగెను. ఐనను, సుస్నిగ్ధకపోలములు మనోహరసంధ్యారుణరాగమున దీపింప, ప్రవాళసన్నిభ కోమలాధరోష్ఠములు పరిచలింప, నామానిని అవనతనయనయై మిన్నకుండుటఁగాంచి, నంతనే, ఆశానిరాశాంతర భయంకరాంధకారంబునఁ బొరలాడు రాజకుమారుని మానసమున నొక్కయూహ మెఱసెను. అతఁడు తోడనే యిట్టులనెను.—

"హెలీనా! నా యథార్థచారిత్రము నీకు విదితమాయెను. కాదనఁ జాలను. నాకు నిక్కముగ భార్యకలదు. మీదేశ సాంప్రదాయముల ననుసరించి నాతోడి పొందు నీకు దుస్సహంబని యెఱుంగుదు. ఐనను— నాయవినయ ప్రవర్తనము మఱచి యొక్క మనవి చెల్లింపుము— నన్ను బంధించు పాశము దైవికముగ విచ్ఛిన్నమగునేని— అపుడు మన—"

"అపుడు కావచ్చు— ఆహా!—"

"ధన్యుఁడను! సుందరీ, ధన్యుఁడను! ఎన్నటికైన నీపొందుప్రాపించుఁగాన, ఆత్మసంరక్షణోపాయము తప్పక వాంఛింతును."

జిజీము తోడనే స్త్రీవేషము ధరించెను. వారిరువురు నారహస్యమార్గమునుండియే తద్విశాల మందిరమునుండి రయంబున వెలువడిరి. ఆమార్గమున భటులంతగ నుండరు. ఉన్నవారైనను, హెలీనా ఇంతటి మాయోపాయమునకుఁ గడంగునని యెఱుంగని కారణంబున స్త్రీవేష ధారుఁడగు జిజీమును గాంచియు దమ ప్రభుపుత్రి బందుగురాలు కావలయునని భ్రమించి ఊరకుండిరి.

వారట్లు నిరపాయముగా సింహద్వారము సమీపించిరి. నిజహృదయాపహారిణియగు హెలీనాను గొంపోవలయునని జిజీము ప్రయత్నించెనుఁ కాని, ఆక్రైస్తవమానవతి నిరాకరించెను. రాజకుమారుని వెంట

సమానాకృతిగల రెండు ముద్రికలుండెను. అందొకటి హెలీనాకొసంగి సమయమగునపుడు రెండవయుంగరము ప్రదర్శించువానివెంట రావలయునని ఆతఁడు కోరెను. ప్రభుపుత్రి సమ్మతించెను. అనంతర మాప్రణయినీ ప్రణయులు మనసార గాఢాలింగన మొనరించి ఒండొరుల సెలవు గైకొనిరి.

అరణ్యమార్గముబట్టి కొంత దవ్వరిగినంతనే, హెలీనా సోదర సముఁడా కన్నియచెప్పినట్టులే గోచరించెను. రాజకుమారుఁడట స్త్రీవేషమువీడి, ధనవంతుఁడగు హాలికుని యాకృతి దాల్చెను. కాని కొంత దవ్వరిగిన పిదప నాహతభాగ్యుఁడు పట్టువడి మగుడ బంధింపఁ బడెను.

ఆకాలముననే క్రైస్తవ నృపాలురు తురుష్క సార్వభౌమునిపై దండెత్తఁగోరి, జిజీము నరయఁ బ్రయత్నించిరి. ఆతఁడు నాయకత్వము వహించునేని, పరస్పరము గడు లాభకరముగ నుండెడిది. కాని, బైజీదు సుల్తా నొసంగు నమితధనము గుడుచు రోమ్నవీరులు తద్రహస్యము వెల్లడింపకుండిరి. విశాల సామ్రాజ్యభార ధురంధురుఁడై యఖండ భోగభాగ్యముల నోలలాడవలసిన జిజీము ఆకారణమున నాలుగైదు సంవత్సరములు స్వాతంత్ర్య విరహిత నికృష్టజీవన మొనరించెను. తుదకు, రోమ్నగరాధిపతి ధనాశాపరుఁడై జిజీమును పోపున కప్పగించెను. ఈవిషయ మెఱిఁగిన బైజీదుసుల్తాను తన తమ్ముని ఖర్చులనెల్లఁ దానె భరించుటయె గాక, నిజ సోదర స్వాతంత్ర్య మరికట్టి తన కమితోపకార మొనరించిన పోపునకు గొప్ప బహుమాన మొసంగెను.

కొంతకాలమునకు ఆపోపు మరణింప, దుర్మార్గుఁడగు "అలగ్జాండరు బోర్జియా" తదాధిపత్యము వహించెను. 1494 లో ఫ్రెంచి రాజు ప్రసిద్ధ వీరజన పరివృతుఁడై ఇటలీ దేశముపై దండెత్తెను.

పోపగు బోర్జియా వైరి నెదిరించుటకు బలము చాలక సంధి నర్థించెను. జిజీముయొక్క పిపాద చారిత్రము ఫ్రెంచి నృపాలునకుఁ దెలియవచ్చుటచే నా యుదారవంతుఁడు జాలిగొని, ఆ తురుష్క రాజకుమారునిఁ దన యధీన మొనరింపవలయునని విధించెను; పోపు సమ్మతించెను. కాని, విజయుని దిగ్విజయ మింకను బూర్తికాలేదు. ఆ కారణమున జిజీ మింకను గొంతకాల మందే నిలువవలసినవాఁ డాయెను. ఐనను, దురాత్ముఁడగు పోపువలన నాతని కెట్టి యుపాయము వొరయకుండఁ దన సైనికవిభాగము నొండు ఫ్రెంచిరాజు కాఁపుంచెను.

పాపాత్ముఁడగు పోపు అంతమాత్రమున విరమింపక, బైజీదు సుల్తాను చెంతకుఁ దనదూత నంపెను. ఫ్రెంచి రాజు దూరదేశమున నుండునపుడే ఎట్టులో జిజీమును విగతజీవు నొనరించుట కాతఁ డొడఁబడెను: సుల్తాను ఆనందపరవశుఁడై యట్టి రాక్షసకృత్య మాచరించు పోపున కమూల్య బహుమానము లొసంగెద నని వ్రాసచేసెను.

దుర్భరమగు పోపు నిర్బంధము సడలినంతనే జిజీము సంతోషించెను. ఆ సమయముననే ఈజిప్టునందుండు దన భార్య మరణించెనని తెలియవచ్చెను. దాన నాతని యానందము ద్విగుణీకృతమాయెను. నిజహృదయాపహరణ మొనరించిన ఆ నవమోహనాంగిని—హెలీనాను ఇఁక వివాహమాడి నిరవధిక ప్రేమానంద తరంగ డోలికల నిరంతర ముయ్యెల లూగవచ్చునని భావించి, నమ్మిన బంటగు హూసేనును జీరి, తన ముద్రిక నొసంగి, తత్క్షణము శానేజీ దుర్గమునకుఁ బోయి యందుండు హెలీనాను గొనిరావలయునని నియోగించెను.

ఆల్బర్టు ప్రభువును సభామధ్యమున నా తెఱంగున వధించి జిజీము పాఱి సుమారు పది సంవత్సరము లాయెను. దుర్గాధిపతి వయసు

మీఱిన కారణమున మరణించెను. శానేజీ దుర్గమును తద్ద్వీపుల భాగ్యమంతయును హెలీనా యధీనమాయెను. ఏండ్లు గడచుగొలంది నామె రూపవైభవము మఱియు మఱియు నధికమాయెను. జిజీము తన దూత నంపునరికి ఆశీలవతి పరిపూర్ణ యౌవన ప్రభావిభాసితయై, నిరుపమాన సౌందర్యముతో నలరారుచుండెను. కాని, కాంతుఁడు లేని కాంత జీవనము దుర్భరము, నిరర్థకము గదా. హెలీనాకు నిజసౌందర్య భాగ్య వైభవములతోఁ బనియేమి? నిజ హృదయాప హారు వదన సందర్శనోత్సాహము దృఢతమ విశ్వాసబద్ధమగుటచే నాకాంత యింతకాలము సజీవముగా నుండెగాని, లేదేని, దుస్సహ వియోగానలంబున మ్రగ్గవలసినదే. ఏండ్లు నడచుచుండినను, ఆస్త్రీ స్తవ మార్గ నిరుత్సాహపడక, ఆశవీడక నిరీక్షించుచుండెను.

హసేనును గాంచినంతనే హెలీనా యనిర్వాచ్యానందము ననుభవించి, తన దుర్గరక్షణభార మొక విశ్వాసనీయుఁడగు సేవకునిపైఁబెట్టి, వలయు ప్రయాణసన్నాహములు సత్వర మొనరించి, ఏకపరిచారికా సాహాయ్యయై ప్రకంపిత హృదయయై హసేను ననుగమించెను.

హెలీనా గమ్యస్థానము చేరినంతనే, రాజకుమారుఁడు వ్యాధిగ్రస్తుఁడాయెనని తెలియవచ్చెను. పిడుగువంటి యీదువార్త విని ఆమె మ్రాన్పడియు నిట్టులనెను—"ఇక, సమయమున కరుదెంచితి. సముచిత పరిచర్య నేనె సలిపి మదీయ హృదయాధినాథున కారోగ్య మలవడఁజేయుదు." హసేను మాటాడఁజాలక, ఆ నారీరత్నమును రాజకుమారుని శయ్యామందిరమునకుఁ గొంపోయెను.

కళావిహీనుఁడై, బలహీనుఁడై, శయ్యాగతుఁడై యనదవిధమునఁ బడియున్న జిజీమును గాంచినంతనే యవిరళాశ్రుధారార్ద్రకపోలయై, హెలీనా ఇట్టు చింతించెను.—"ఆహా! కాలప్రభావమున నీ నవ మోహనాకారుఁ డెంతగ మాఱిపోయెను! దురంత హృదయసంక్షో

భము, దుర్భర కారాగృహ జీవనమును ఈమహనీయుని ఏఁబది సంవత్సరములు మీఱిన వృద్ధు నొనరించెనే! హా! విధీ! ఐననేమి? ఈ వదన మెట్టులున్నను, నాకుఁ బ్రేమాస్పదము, అనంత సంతస ప్రదము!''

రోగార్తుఁడైన జిజీము ముకుళిత నయనుఁడై యుండెను. హెలీనా యాతని శిరముచెంత నాసీనయై, అధిక విచారభరితస్వాంతయై, ఆపగిది చింతింపుచుండ, రాజకుమారుఁడు కనువిచ్చెను. నిజహృదయేశ్వరీ సుందరవదన ముదయించినంతనే, జీవరహితమగు రాజకుమారుని వదనము రయమున వికాసవంతమాయెను. అనంతర మా ప్రణయినీ ప్రణయులు పరస్పరము గాఢాలింగన మొనరించిరి. దాహార్తునిపగిది జిజీము నిజాధరసుధారస మెంత గ్రోలినను హెలీనా ఈ సమయమున వారింపలేదు. చిరకాల ప్రవర్ధిత మోహావేశ మొకింత చల్లార, నిజచరణ యుగ్మముచెంత వినయ ప్రణయస్వరూపమున వ్రాలియున్న సుందరిని విస్ఫారితనయనంబుల నట్టె తిలకించుచు జిజీ మిట్టులనెను.—

"సుందరీ! ఎట్టకేలకుఁ గలసికొంటిమి! నీవు సమయభంగ మొనరింపవనియు, ఎన్నటికైన మనము కలసికొందుమనియు నిందనుఁక నాశించియుంటిని. నేఁటికి సఫలమాయెను!''

"రాజకుమారా! నేనును దదాశాబద్ధనై విశ్వాసపూరిత స్వాంతనై వేచియుంటిని. కాని! నీవు వ్యాధిగ్రస్తుఁడవైతివే! కడు బలహీనముగ నున్నవాఁడవు! ఆహా! ఎంతబాధ నొందితివో—"

ఇంకను నేమియో రుద్ధస్వరంబునఁ బల్కు నిజప్రియాంగనను వారించి రాజకుమారుఁ డిట్టులనెను.—

"హెలీనా! నే నిన్నిదినంబులు పలువెతలఁ గుందితిని—అల్లా ఎఱుంగు! బంధితునకు వెలుంగును స్వాతంత్ర్యమునువలె నీయునికి

నాకెంతయు వాంఛనీయముగ నుండెను. సుందరీ! భవదీయ వదన చంద్రయ ముదయించినంతనే నాహృదయ ముప్పొంగ నారంభించెను. ఢిందువడిన మానసమునకుఁ జెప్పరాని యానందము ఉత్సాహమును అలవడెను."

"రాజకుమారా! నే నిఁక నీ చెంతనే యుండి, సంపూర్ణారోగ్య భాగ్యవంతుఁడ వగువఱకు నీకు వలయు సర్వోపచారము లొన రింతును."

"ప్రేయసీ! నీవంటి దయార్ద్రహృదయ నాకు దాదియైయుండ, నాకీ రుగ్మత భయకారణము కానేరదు — అచిరకాలమున హాయిగ నుందును. కాని, సుందరీ! ప్రకృతము మఱవరాదు. భవదీయా గమన కారణోద్భూత సంతోషము నా దుర్బల శరీరమునకు నుత్సాహం బగును. నీ పరిచర్య ఈక్షణమునుండియు నారంభము కావలయును. సుందరీ! నాకై ప్రత్యేకముగ పోపు ప్రశస్తమగు సారాయి ఇప్పుడే పంపియుండెను. ఆ పాత్ర మయ్యదే! ఒకింత యొసంగుము."

తోడనే, హెలీనా లేచి కొంచెండొక హేమకలశము గైకొని, పోపు పంపిన మధురసమునం దొకింత పోసి, తదాస్వాదనమునం దనహృద యేశుఁడు సేదదేఱునను నాసతో నాతని కందిచ్చెను. తత్కోమల కరపల్లవంబు నల్లన ముద్దాడి, సంతోషిత స్వాంతుఁడై, ఉత్సాహ దీపితవదనుఁడై, మందహాస విరాజితాననుఁడై జిజీము మధువు గ్రోలెను.

ఎంత విపరీతము! ఎంత దారుణము! ఎంత దురదృష్టము! త్రావిన పాత్ర త్రావినంతనే నేలఁబడెను: రాజకుమారుఁడు తూలి సోఫాపైఁబడెను: నయనములు సహజచాంచల్యము దొఱంగి అట్టె నిలిచిపోయెను. పెదవులు వీడియే యుండెను గాని ఉచ్ఛ్వాస నిశ్వా సములు లేవు!

ఆ దారుణ వైపరీత్యము గాంచి హెలీనా భయభ్రాంతయు తయై రాజకుమారుని హస్తము పరికించి చూచెను—శిరము బట్టి రాచెను—మోముపై నీరము జల్లెను—హృదయము బరీక్షించెను. ఇఁక నేటి యాస! తన హృదయేశ్వరుఁడు మరణించెనని ఆ కాంత గ్రహించి దుర్భర నిరాశాంధకార నిర్మగ్నయాయెను. ఆహా! పాపాత్ముఁడగు పోపు ఎట్టి దారుణమొనరించెను! గోముఖ వ్యాఘ్రము బోలు నా క్రైస్తవ జగద్గురువు విషప్రయోగమునఁదన కిష్టము లేనివారినిఁ బరిమార్చుచుండెను. నిజ పాపప్రవర్తనమునకుఁ బ్రతిఫలముగఁ దుదకుఁ దాను నట్టులే మరణించెను. ఆతఁడంపిన మధురసము విషపూరితమని యెఱుంగక, జిజీము బేలయై త్రావి, యనంతానందసాగరమున నోలలాడవలసిన మహాసమయమున నీతెఱంగున నికృష్టముగ గతాసుఁడాయెను.

ఆ మందిరమున హెలీనా జిజీములు తప్ప మఱియెవ్వరు లేరు ఎన్ని గంటలైనను, హెలీనా యావలకు రాకుండెను. పరిచారకులు సాహసించి లోనికి రాఁజాలకుండిరి. ప్రధానపరిచారకుఁడు నిజహృదయారాటము బట్టఁజాలక, ఫలాహారావసరము మీఱినను ప్రభువు తనఁజేరకుండుటచే మఱియు భీతిల్లియుండుఁ జొచ్చెను.

జిజీము మృతకళేబరము పుష్పమాలాలంకృతమై సోఫాపై బడియుండెను. ఆ ప్రక్కనే హెలీనాయును బడియుండెను? తనహృదయాధినాథుఁడు లేని జీవనము నిరర్థకమని యెంచి, ఆతని వదనము మీఁదనే దృష్టినిల్పి, మిగిలిన విషమును రయంబునఁ ద్రావిపూతచరితయగు నామానిని నిజహృదయేశ్వరుని సత్వరము చేరఁబోయెను.

# ౨౦

## మఱియొక రేయి వింత

కథ పూర్తియగు సరికి అర్ధరాత్రమాయెను. తదవసర ప్రకృతి సౌందర్యవైభవము వర్ణనాతీతముగ నుండెను. మేఘరహితమై, కడు నిర్మలమై, అసంఖ్యాక నక్షత్ర విరాజమానమై యొప్పు నీలాకాశ సౌందర్యవైభవమున నిర్మలమగు భాస్వరను జలరాశి పాదరసము చందంబునఁ బ్రకాశించుచుండెను. పగటి వేడి మింకను బూర్తిగఁ జల్లారకున్నను గమ్మని మందమారుతములు చల్లగ వీవఁదొడంగెను. మనోహరతోరణములు కట్టిన గులాబుల కారణమున నా ప్రదేశము మధురసుగంధబంధురంబై యుండెను. విందున కమర్చిన దీపములన్నియు నారిపోయినను, అంబర దీపిక లుజ్వలముగ వెలుంగుచుండుటచే నాలోపము కానరాకుండెను.

దత్తబను పాషా కడుశ్రద్ధతో నాకథ నాలించెను. కథ ముగిసినంతనే, యామహానీయుఁ డెప్పటి యట్లు విమర్శచేయఁ దొడంగెను. ఒండొరుల చెంత నాసీనులైన గుల్నేరు లూకాసులును, జైరజా జూలియనులును ఖాలీలుని మధుర వాగ్గుంభనముల నమితోత్సాహముతో నాలించిరి. ప్రభు చెంతనే యాసీనయై యుండిన ఇస్మిల్డాసతి యొక మానవతివలె సముచితముగ నవనతనయనయై యుండియు నానవమోహనాకారు నల్లనల్లనఁ దిలకించుచుండెను. ఆమె మేలి ముసుఁగు సగము తొలంగియుండెను. తక్కుంగల యువతుల్లు అతిథులు వెడలినంతనే ముసుఁగులు పీకిరి.

జులేఖా తన మేనమామ ప్రక్కనే కూర్చుండి యుండెను. మిగిలిన యువతీయువకులవలె జులేఖా ఖాలీలు లొండొరులచెంగట సుఖో

పవిష్టులగుట కవకాశము లేక పోయెను. తురుష్క యువకునిపై మరు లుగొనియున్న ఇస్మిలిదా యందుండ, నెట్లు సాధ్యమగును?

హెలీనా జిజీముల దుర్మరణము నిక్కముగఁ గడు విషాదకరముగ నుండెను. మన యువతీయువకులు గాఢప్రణయార్ణవనిర్మగ్నులై యున్న కారణమున, హెలీనా జిజీముల విషాదచారిత్రము వారి హృదయమున నాటుకొనెను. కథా విమర్శనము యథాప్రకార మొనరించిన పిమ్మట, పాషా యిట్టులనెను—

"పోపు ప్రయోగించిన తత్క్షణ ప్రాణాపహరణ సమర్థమగు విష మెద్దియో ఆశ్చర్యకరముగ నున్నది!"

"ఆర్యా! ఆ విషయము నేఁ గొంత యెఱుంగుదును. ఆ పాపిష్ఠి పోపు వంశజులు ప్రయోగించిన విషమును 'టొఫానారసము' అని యందురు. 'టొఫానా' యను స్త్రీ యొకట నాగరకముగ సృష్టించుటచే నట్టి పేరు ప్రసిద్ధమాయెను."

అట్టు లూకాసు పలికినంతనే, పాషా కుతూహల మధికతర మాయెను—"అందలి పదార్థములేవియో తెలియునా?"

"తెలియును. అది యొక విధమగు పాషాణము. ఆ ద్రవము నీటివలె నిర్మలముగ, రుచిహీనముగను నుండును. ఆ మందు ద్రాక్షరసమునఁ గలపినచో, నారహస్యమేరికిఁ దెలియరాదు—రంగు మాఱదు; మాధుర్యము భంగబడదు. అట్టి భయంకర విషపదార్థ మును పోపు వంశజులు నిరాఘాటముగ నుపయోగించి, దయారహి తులై, క్రూరులై, తమవైరులఁ గడ తేర్చుచుండిరి. నిరుపమాన సౌందర్యవతియు, నిరంతర కామవ్యాపారనిర్మగ్నయు, పోపుయొక్క సోదరియు నగు 'లుక్రీసు' నిజమార్గావరోధ మొనరింపఁజాలు స్త్రీ పురుషులనెల్ల నట్టులే దారుణముగ వధించుచుండెను."

"ఎంత దారుణము! అయ్యది రాక్షసవంశము గావలయు!

మిత్రమా! ఆ దుష్టౌషధమా యధమాధములతో నంతరించి యుండు గదా?"

"దురదృష్టవశమున నంతరింపలేదు. ఈదుర్యోగము కడు సులభ సాధ్యమగుటచే, నంతరించి యుండదు. నే నీ విషయమునఁ దగు పరిశ్రమ సల్పియుంటిఁ గాన—"

లూకాసు వాక్యము పూర్తి కాలేదు. కారణమేమన, దన మిత్రుఁడు ఖాలీలుఁడు భావగర్భితముగఁ దనవైపుఁ దిలకించు చుండెనని యాతని కాకస్మికముగఁ దోఁచెను. అట్టి ప్రసంగ మసంగతమని యాతఁడు మందలించెనని యెంచి, లూకాసు వాక్యమధ్యమునఁ నిలిచి పోయెను. తోడనే, ఖాలీలుఁడు తనదృష్టి మఱలించి యవనతవదనుఁడాయెను. ఆకారణమున, ఖాలీలుని వీక్షణమునందే యర్థమునుండ దనియు, తా నకారణముగ భ్రాంతియుతుఁడ నైతిననియు లూకాసు భావించెను. అంతలో, పాషా యిట్లు ప్రశ్నించెను.—

"నీవేమి చెప్పుచుంటివి? నీ వొనరించిన పరిశ్రమ ఫలితమేమి?"

"ఆ పోపువంశజులు ప్రయోగించిన విషము నేఁటిరష్యాదర్బారునకు నిక్కముగఁ దెలియునని చెప్పఁగలను."

"అల్లా! రష్యారాజవంశజు లిట్టులే కడ తేరియుందురు!"

"పాషా! సందేహములేదు. రష్యాదేశచరిత్ర పరిశీలింతమేని, ఈవిషయము తెల్లమగును. పదిమంది నృపాలురలోఁ దొమ్మండ్రు బలవన్మరణము పాలైరని తెలియఁగలదు. అందు విషముచేఁ జచ్చిన వారిసంఖ్య యధికతరము. ఆ విషము నేఁజెప్పిన టొఫానా రసమే. దాని ప్రభావమెట్టిదన, తన్మూలమున మరణించు దౌర్భాగ్యుఁ డెట్టి వికారము జెందక సామాన్యముగనే యుండును. తద్రహస్య మెవ్వరికిఁ దెలియనేరదు. ఆవిష మతి స్వల్పముగ నొసంగినచో, నరుఁడు దీర్ఘరోగపీడితుని చందమునఁ గ్రమక్రమముగాఁ గృశించి మరణించును.

అధికముగ నొసంగినచో, మన హెలీనా జజీములవలె తారున మరణించును.

అంతట ఖాలీలుని వీక్షణము మగుడ లూకాసుపైఁ బడెను. తన మిత్రుఁడు నిక్కముగ మందలించుచుండెనని యాతఁ డపుడు గ్రహించెను. ఖాలీలుఁ డావగిది విముఖుఁడగుటకుఁ గారణమెద్దియో తెలియకున్నను, ఆ ప్రసంగమింక విరమింపవలయునని లూకాసు భావించెను.

ఖాలీలుని భావము గ్రహించి, రేయి చాల మీఱుటచేఁ దామింకఁ బోవలయునని జులేఖా తన మామనుఁగాంచి పలికెను. ఖాలీలుఁడు మఱియొక కథ చెప్పిన విననలయునని కుతూహలపడువాఁడయ్యు, జులేఖా పలుకులు వీనులఁబడినంతనే దల్తబనుపాషా దిగ్గునలేచెను.

ఇస్మిల్లాజులేఖాపాషాలు ముందు నడిచిరి. తక్కుంగల యువతీయువకులైదుగురు వెనుకబడిరి. దాన, గుల్నేరు లూకాసులును తైరజా జూలియనులును పరస్పరరహస్య సరససంభాషణ మొనరించుటకవకాశము చిక్కెను. ఆ వెనుకనుండిన ఖాలీలుఁడు, పాషా స్త్రీజన సహితముగా మందిరాంతర్గతుఁ డౌటఁగాంచి, లూకాసును వెనుకకు లాగి యాతని శ్రవణమున వడివడి నిట్టులనెను—"మిత్రమా! ఎట్టులో నీవు జూలియను మందిరము ప్రవేశింపుము." అనంతరము జూలియనుతోఁగూడఁ దదుచితముగఁ బలికి మఱవవలదని హెచ్చరించి, తన మిత్రు లిర్వురు దమ ప్రియకాంతలవద్ద సముచితము సెలవుగైకొనుటకు వీలగునట్లు ఖాలీలుఁ డొకింత దవ్వునకుఁ బోయెను.

తురుష్కయువకుఁడు క్రమముగాఁ దనమందిరము ప్రవేశించెను. ప్రభువు చూచుచుండగనే, లూకాసుమందిరము జూలియను, జూలియను మందిరము లూకాసును నిబ్బరముగాఁ జొచ్చిరి. మధురసము తలకెక్కిన పాషా తద్విషయము జూచియుఁ జూడఁజాలకపోయెను. యథాప్రకారము తలుపులకు బీగమువైచి, యాతఁడు తన శయ్యా

మందిరమునకుఁ బోయెను.

దత్తబనుపాషా వెడలినంతనే ఖాలీలుఁడు కుడ్యాంతర రహస్య కవాటము తెఱచి, తన మిత్రుని చెంతకుఁ బోయెను. ఆ మందిరమున నిపుడున్నవాఁడు లూకాసుగదా. రహస్యకవాటవృత్తాంతము జూలి యను ఎఱుంగుఁగాని, ఆతఁ డెఱుంగఁడు. కావున, గోడనుండి వెలు వడిన తనమిత్రునిఁ గాంచినంతనే, లూకాసు విస్మయవిభ్రమాకులుం డాయెను. తోడనే, ఖాలీలుఁ డిట్లులనెను.

"మిత్రమా! గమనింపుము—నన్ను వారింపకుము—నిశ్చలా త్ముఁడవై నేఁ జెప్పునట్లు లాచరింపుము—మనయదృష్టమంతయు నందుపై నాధారపడియున్నది—"

"మిత్రమా! నీవింతగఁ జెప్పవలయునా? నీవింత ప్రవర్తనము గాంచుచుంటిఁగదా. కావున నీవేమి పంచిన నట్టు చేయువాఁడ, నానతిమ్ము."

"నీ వివేకము శ్లాఘనీయము. నీవు సత్వర మీమార్గముబట్టి నా మందిరము జేరుము. అమీనా నాకొఱకు తప్పక రావచ్చును. నా వంతు నిన్నుఁగాంచునంతనే వృద్ధదాసి కలవరపడును. పాషా ప్రమాద వశమున నిన్నందు బంధించెనని సమాధాన మొసంగుము. అనంత రము, నిరుపమానసౌందర్యవతియగు నిస్మిల్డాసతినిఁ గూడుటకు నీచిత్త మెంతయుఁ గత్తరపడుచున్నదనియు, ఎట్టులైన—"

"మిత్రమా! ఏమంటివి? మన్మనోహారిణి గుల్నేరును మఱవఁ గలనా?"

"వలదు. ఇందు దోసగేమియులేదు. మహత్కార్యసాధనార్థ మిట్టి మిథ్యాప్రవర్తన మవసరమై యున్నది. నీప్రణయమున కెట్టి భంగము వాటిల్లనేరదు. నీహృదయ మెప్పటియట్లు భవదీయ కాంతాధీనమై యుండుటఁగాక; ఇయ్యది కేవలము బాహ్యప్రవర్త

నము. అమీనామాటలకు లోఁబడ దేని, ధనమొసంగుము. ప్రభు పత్నీశయ్యామందిర మాతెఱంగునఁ బ్రవేశించి, సముచితముగ సంచరింపుము. ఆమె యేమార్గముజూపిన నామార్గమునుండియే నిర్భయముగా రమ్ము. మార్గమధ్యమున నఘోరాకారుఁడగు సిద్దీ కావలియుండునేని, అప్రమత్తుఁడవుగమ్ము. వాఁడు నీవెనుకఁబడకుండ కడు భద్రముగ మెలంగుము. సిద్దీ నీకుఁ ద్రోవజూపఁగోరును గమనించితివా! వాఁడు నీముందు నడవవలయును."

అందుల కొడఁబడి, లూకాసు ఇట్లు ప్రశ్నించెను.

"కాని, మిత్రమా! ఉద్యానవనమునందలి నా ప్రసంగమంత బాగుగ నుండకపోవచ్చును, కాని, నీకంతటివైమనస్యమేల ?"

"ప్రసంగ మట్టిదగుటచేతనే. ఇఁక, నీవాలసింపక, నామందిరమునకుఁ బొమ్ము. మఱియొకటి! శస్త్రము మాత్రము వీడకుము."

లూకాసు ఖాలీలుని మందిరము జొచ్చినంతనే, బీగము తిరిగిన సవ్వడి వెలువడెను; తద్వారము వివృతమాయెను. అమీనా ప్రత్యక్షమాయెను. కాని, ఖాలీలునికై యేతెంచినతార్పుకత్తెకు లూకాసు గోచరించుటచే, నామె నివ్వెరపడి, తోడనే నిగ్రహించుకొని, యిట్టులనెను.

"ఆర్యా! క్షమింపుము—పొరపాటు—"

అట్టు లేమియో పలుకఁబోవు దాసిని వారించి, లూకాసు ఇట్టులనెను.

"పొరపా టేమియులేదు; పొరపాటే యైనను, నాకు లాభప్రదము గావలయు."

"అల్లా రక్షించుగాత ! నీయభిప్రాయ మేమి ?"

"అమీనా! చెప్పెద, గమనింపుము. ఈ స్వర్గధామమున మున్ముందుఁ గాలిడినవాఁడ నేనుగదా. మనోహరసౌందర్యవతియగు

నీదొరసానితోఁ బరిచయ మొనరించుటకుగదా, నీవు నన్ను నగర మధ్యమున నరసి, యిందుఁ జేర్చితివి. అంతలో నా దురదృష్టవశమున శాదరక్షులు ప్రత్యక్షమాయెను—ఎఱుంగుదుగదా ?"

"ఎఱుంగనా ? భయకంపితనై చచ్చితిననుకొంటిని—" అట్లు పలుకుచు సాభిప్రాయముగాఁగాంచు వృద్ధదాసిం గాంచి, లూకాసు ఇట్టులనెను.

"నిన్నపుడు తగినవిధమున బహూకరింపఁ జాలనైతిని." అతఁడంత నాలుగుకాసు లామెచేతఁబెట్టి, మగుడ నిట్టులనెను—"ఇది యొక చిన్న రుసుము. నేను గృతకృత్యుఁడ నగుదునేని—నామనోరథము సిద్ధించునేని, అప్పు డుచితబహుమాన మందఁగలవు. ఆహా! ఇస్మిల్డాసతి ఎంతసౌందర్యవతి! ఆ సుధాకరానన తాల్చిన మేలిముసుఁగు నా భాగ్యవశమున నొకింత తొలంగెను—"

"కాని, నీవు గుల్నేరును బ్రేమింతువుగదా ?

"ఆ కన్నియ నాభార్య యగుగాక. ఐననేమి ? అంతమాత్రమున, పరనారీపరాఙ్ముఖుఁడనై సన్యాసివలె నుండవలయునా ?"

"ఆహా! పురుషుల స్వభావమెల్లెడల నిట్టులే యుండుగదా. కాని నిన్ను నాదొరసాని కెట్లుపరిచయ మొనరింపఁగలను ?"

"నీవే యెఱుంగవలయు. నీకట్టిసామర్థ్యము గలదు. ఎట్టులో నన్ను నీరాణి సమక్షమునకుఁ గొంపొమ్ము. ఆమెపైఁగల మోహమే నాకు ధైర్యము గఱపి, ఆమోహనాంగి యొకవేళ నాగ్రహధురీణయైనను ప్రసన్నురాలగునట్లు చేయఁజాలును."

అమీనా విచారింపఁ దొడంగెను. చేఁజిక్కిన సువర్ణముకంటె నధికతరలాభ మచిరకాలమున రాఁగలదు. కాని, అట్టి వ్యాపారమామెకుఁ బూర్తిగ నిష్టములేకుండెను. ఆతొట్రుపాటు గుర్తించి, లూకాసు మఱియుఁ దీవ్రపడెను. ఆతఁ డేమనునోయని, సంధాన

కర్త్రి పాషాసంగతి స్మరణకుఁ దెచ్చెను. లూకాసు ఇట్లు బదులాడెను—

“అమీనా! నీ వీమందిరమునకు రా గతంబెద్దియో—నాకేల, కాని, పాషా తనభార్యా మందిరమున లేఁడనిమాత్రము చెప్పఁగలను.”

“ఔఁ గాక. పాషా యేక్షణమైనను రానచ్చును. ఈదేశ సాంప్రదాయము నీ వెఱింగియుండవు.”

“అపాయమని వెనుదీయువాఁడఁ గాను. అమీనా! పిఱికిపంద సుందర నారీజనమందహాసమునకుఁ బాత్రుఁడుగాఁడు. మఱియు, అపాయమునుండి నిరపాయముగాఁ దాను వెలువడుటయేగాక, నిజమనోహరునిఁగూడ నేర్పుమెయి తప్పింపఁజాలని స్త్రీ యొక స్త్రీ కాదు. కాన, ఇఁకఁ గాలయాపన మొనరింపక నన్ను గొనిపొమ్ము.”

అంత నాదాసి ఇట్టుల స్పష్టముగ గొణఁగెను.

“బాగు! తప్పేమి? ఈసమయమున కాతఁడు గాకున్న, నీతఁడాయె. కాని, అంతకంతకుఁ జిక్కగుచున్న ఈ వ్యాపారముననే ప్రమాద ముప్పతిల్లునోయని మాత్రము భయమగును.”

అంతట, లూకాసు విసువు నభినయించి ఇట్లు ప్రశ్నించెను—

“అమీనా! ఏమనుకొనుచున్నావు? కాలహరణమగు—”

“ఆర్యా! నీ వితరణముం గొనియాడుచున్నదానను” అని యుక్తియుక్తముగఁ బలికి, మగుడ నిట్టు లనెను— “ఆర్యా! నీ మాట కాదనఁజాలను. పోదము రమ్ము.”

వారిరువు గదినుండి వెలువడినంతనే, అమీనా భద్రముగఁ దాళము వైచి ముందుగ నడచెను, లూకా సామెను వెంబడించెను. ప్రదేశమంతయు గడు నిశ్శబ్దముగ నుండెను. అమీనా లూకాసులు నిరపాయముగా దొరసాని శయ్యాగారము డాసిరి. పాషా పాదరక్షలచ్చట

గానరామి, అయినా నిర్భయముగాఁ దలుపు తెఱచి, నిజానుచర సహితముగా నందుఁ బ్రవేశించెను. తత్ప్రథమమందిరమున నిలిచి, దాసి యిట్టులనెను—"అయ్యా! అల్లదె మా దొరసాని శయ్యామందిరము. నీ వాక్చాతుర్యమున నామె నెట్లు సమాధానపఱచి కైవశ మొనరించుకొందువో!—సత్వరము పొమ్ము!"

లూకాసు తోడనే రెండవమందిరముగూడ గడచి, ప్రభుపత్నీ సముఖమునకుఁ బోయెను. మృదుల మోహనహంసతూలికాతల్పమున నొయ్యారముగ వ్రాలి, నిజహృదయాపహరణ క్రియాదక్షుఁడగు తురుష్కమన్మథునికై తత్తరపడుచుండ వేఱొకఁడు గోచరించుటచే, నా మదవతి సహజముగ విస్మయాగ్రహపరవశయై కడు జీకాకుపడెను. కాని, లూకాసు మాత్రము నిరసింపఁదగిన వాఁడా? వాని సమున్నతాకారము, దీర్ఘబాహువులు, పేరురము, సుందరగంభీరాననమును దప్పక దర్శనీయములు. కాన, నాస్వైరిణి మఱియొకసారి లూకాసును గాంచి తదాలోచనాధీనమానసయై యుండ, నాతఁడు తద్భావపరివర్తనము గుర్తించి, సమీపించి, మనోహర నిశ్చలస్వరంబున నిట్టులనెను—

"సుందరీమణీ! కేవలము ప్రమాదవశమున నిన్నుఁ గాంచు నపూర్వమహాభాగ్య మలవడెను; ధన్యుఁడను!"

ఆ ప్రౌఢ కాంత యంత కృత్రిమనిరాదరణస్వరంబున నిట్టులనెను. "ఆర్యా! ఈ తెఱంగున శుద్ధాంతమునఁ జొరబడుట సాహసమని యెఱుంగవా? కాని, ప్రమాదమంటివే! ఏమది!" వర్ణనాతీతమగు నా సుందరాంగుని సుందరనయనద్వయముపై నాధీరవీక్షణములు నిలిచిపోయెను. గ్రీకుయువకుఁ డిట్టులనెను—"కాంతామణీ! యథార్థ మెఱింగించెద, క్షమింపుము. ద్రాక్షారసపాన మొకింత యధికతరమగుటచే దత్తబనుపాపా—"

"ప్రవక్తయగు మహ్మాదు నిషేధించెను!"—వినీలశ్మశ్రురాజి కారణమున మఱియు మఱియు దీపించు నా మోహనాంగుని సుందర దంతపు దొంతరలం గాంచినంతనే యా కామిని చకితహృదయై మోహవికారోద్భూతనిశ్వాసయై మగుడ నిట్టులనెను.— కాని, మనము దుర్బలమానవులముగదా."

"నిక్కముగ దుర్బలులము! కాదేని, నేనీ మారవికారమునకుం జిక్కువాఁడఁ గాను."

"కాని, ప్రమాదవశమున నంటివే! అదేమిరో సత్వరము బలుకుము."

"మధురసము తలకెక్కిన దత్తబను పాషా, ఖాలీలుఁడు వారింపఁ గడంగినను సరకుసేయక, మఱొక్కరి మందిరమున నింకొకరిని బంధించెను. నేఁ జెప్పు ప్రమాద మయ్యది. కాని, తత్ప్రమాదమే నాకీ మహాలాభ మొడగూర్చెగదా."

"ఖాలీలుఁడు వారింపఁ గడంగెనా?" అని యథాలాపముగా నిస్సిగ్గా ప్రశ్నించెను. కాని, నిక్కముగ నా కామిని 'అనిర్వాచ్యానంద ప్రకంపితహృదయ యాయెను. కారణ మేమున, ఆమె చిత్తమింకను సుందరతురుష్క యువజనాధీనమై యుండెను. తనపైఁ గల మక్కువకతంబుననే పాషాను వారించి ఖలీలుఁడు నిజమందిరాంతరంబున నుండఁ బ్రయత్నించెనని యెంచి ఆమె కడు ముదమందెను. లూకాసు మగుడ నిట్టులనెను.—

"సుందరీమణీ! నిజము. ఒకని మందిరమున నింకొకనిఁ బెట్టుచుంటివని ఖాలీలుఁడు విస్పష్టముగఁ బలికెను. కాని, అసలే మతి మాలిన ప్రభువు వాదించినచోఁ గ్రుద్ధుఁడగునని యెంచి, నేనును నా మిత్రుఁడుం గలసి ఖాలీలుఁడు మాటాడకుండ చేసితిమి.

ప్రభుపత్ని వీక్షణమధుకరములు గ్రీకు మనోహరవదనపంకేరు

హము వీడి రాఁజాలకుండెను. అనంతర మేమాయెనని ఆమె ప్రశ్నింపలూకాసిట్లులనెను.—

"నేను ఖాలీలుని మందిరము జొచ్చి శయ్యపై నాసీనుఁడనైనంతనే తలుపు తెఱచి అమీనా ప్రవేశించెను. అం దెవ్వరుండరని దాసి ఎఱింగియుండను. కాని, కాంతామణీ! క్షమింపుము. నీ పరిచారికను గాంచినంతనే నా హృదయమునందొక యూహ జనించెను. నే నిందనుక గుల్నేరును ప్రేమించి యుంటినని విశ్వసించితి. అది వట్టిభ్రమ యని ఇపుడు తెలుసుకొంటిని. నీలమేఘ విముక్తసుధాకరబింబముం బోలిన ఆచ్ఛాదన వసనసిర్గతభవదీయసుందరానన మనోహరారామ సీమఁగాంచినంతనే, నా హృదయము నీ యధీనమాయెను. మఱియు, భవదీయ మనోహరవదనసందర్శనార్థమే గదా, కొన్ని దినముల క్రిందట నేనీ మందిరమునకు రప్పింపఁబడితిని! కావున, అమీనా గోచరించినంతనే, దైవికముగఁ జిక్కిన సదవకాశమును వృథా సేయరాదని నిశ్చయించితిని.—"

"నిన్నిందుఁ బ్రవేశపెట్టవలయునని అమీనాను బ్రతిమాలితివి కాఁబోలు?"

"తరుణీమణీ! నిజము. కాని, నాపైఁ గినిసిన గినియుము—నీదాసిని మాత్రము మన్నింపుము. నా లాలింపులకును బెదరింపులకును దాళఁజాలక నాకుఁదోడ్పడెను."

ప్రభుపత్ని వెంటనే బదులాడక, లోలోనఁ జింతించెను. ఆమె వీక్షణము లుండుండి గ్రీకుయువకుని మనోహరాకారముపైఁ బర్వెచుచుండెను. దుర్బలస్త్రీజన సహజస్వాతిశయాహంకారములు ఆమె మానసమున రేకెత్తెను. గుల్నేరు వలచిన లూకాసు, ఆమె సౌందర్యము గాంచి, తొంటివలపు మఱచి మోహపరవశుఁడై, కృపణుఁడై, ప్రభుపత్ని కట్టెదుట నుండెను! ఆమె హృదయ మెట్లు కంపింప

5

కుండును?—"పౌరుషవంతుఁడా! నీపలుకులన్నియు నిక్కములగునా? నన్ను నిక్కముగఁ బ్రేమింతువా?"

గ్రీకుయువకుఁ డనురాగపూరితవీక్షణుఁడై సరసముగ నిట్లు బదు లాడెను.

"భవదీయభాసురవదన సుధాకరబింబము గాంచుటయన, ప్రేమించుటయే. హా! తరుణీ! మనమారామకుటీరమున ఖాళీలుని చుట్టు సుఖాసీనులమై కథాశ్రవణాతురులమై యుండుతఱి నీదు కుటిలముఖ వసనము తొలంగకుండెనేని, నాహృదయమున కిట్టి యారాటము లేకుండెడిది—నాగుల్నేరే నాహృదయాభిరాజ్ఞి యని యింకను భ్రమించి సంతసించుచుండెడివాఁడను. నీవంటి యపూర్వసౌందర్య సముజ్జ్వలాంగిని భార్యగా వడసిన దత్తబనుపాషా నిక్కముగ నదృష్ట వంతుఁడు! ధన్యతముఁడు!"

తదాలాపము లాలించి ప్రభుపత్ని సంతుష్టాంతరంగయై తన చెంగట నాసీనుఁడుగావలయునని లూకాసునకు సన్నయొనరించెను. కాని, మోహంపుఁదల్పమున నొయ్యారముగ వ్రాలియున్న ఆమచ్చెకంటి సముజ్జ్వలసౌందర్యవైభవంబున కోహటించువానివలె నాగ్రీకు అవనతవదనుఁడై ఆసౌందర్యరాశి కొకింతదవ్వున నాసీనుఁడాయెను. విటులాతెఱంగున నటించుటయు, దానస్వైరిణు లుప్పొంగుటయు సహజము. అంత నాయిందుముఖి నిజసుందరకరాబ్జమునందీయ, నా యువకుఁడు లేనియుత్సాహము దెచ్చికొని మోహాతురంబున ముద్దాడి తోడనే రయంబున దత్తరంబున విడిచిపుచ్చెను, నిజాతులిత సౌందర్య వైభవవీక్షణావసరదిగ్భ్రమము కారణమున నాయువకుఁ డట్లులాచరించెననియు, తానొక మందహాసమొనరించునంతనే నాభీరుఁడు ధైర్యధుర్యుఁడై రయంబున నిజభుజవల్లరీపంజరబంధితుం డగుననియు ప్రభు భార్య భావించి కడుంగడు ముదమందెను. కాని, లూకాసు అవస్థ

కడువిపరీతముగ కేవలము వర్ణాతీతముగ నుండెను. ఆతని చిత్తము గుల్నేరుకాంతాధీనమై యుండెను. ప్రభుపత్నిపై మోహములేదు. తనునట్టి దుర్వ్యవసాయమునకు నియోగించిన ఖలీలుని యభిప్రాయ మేమో యాతఁ డెఱుంగఁడు. ఐనను, మిత్రవచోబద్ధుఁడై లూకాసు నాటకమాడుచుండెను. ప్రభురాణి ఇట్లు ప్రశ్నించెను—

"ఖాలీలుఁడు నాగుఱించి యేమైనఁ బ్రసంగించెనా?"

"ప్రసంగించెను. మొదట నిన్నుఁగాంచినపుడు నీసుందరాననము వసనాచ్ఛాదితమైయుండినను, భవదీయ దివ్యాకృతిఁగాంచియే నా మిత్రుఁడు విగతధైర్యుఁడాయెను. అనంతరము తదభివర్ణనమునకు దొరఁకొనెను. కథాశ్రవణావసరమున నావలె నాతఁడును నీయపూర్వ సుందరాననము తప్పక కాంచియేయుండును. ఆతఁడు నిక్కముగ నీపాదసేవాపరాయణుఁడే!"

"ఖాలీలుఁడు మాపరస్పరసమావేశము గుఱించి వెల్లడిచేయలేదు" అని లోలోన సంతసించి, మధురమందహాసవిరాజితవదనయై ఇస్మిల్డా ఇట్టులనెను—

"ఆర్యా! స్వాతిశయము మా జాతిలక్షణము గదా—కావున నీవన్యథా తలంపవలదు—నీమిత్రుఁడగు జూలియను నన్నుగుఱించి ప్రశంసించెనా?"

"వాఁడును ఖలీలునివలెనే నీదు సౌందర్యముగ్గడించెను. కాని, మోహనాంగీ! నామిత్రులమాటకేమి?—నేనే నీహృదయమునకు నచ్చినవాఁడనని పల్కి నన్ను ధన్యాత్మునొనరింపవా?"

లజ్జారుణావనతవీక్షణయై, ప్రభుపత్ని ఇట్టులనెను. "సుంద రాంగా! నీకీసందియమేల? అమీనా తొలుదొల్త నిన్నేగదా కాంచి మదీయారామగృహంబునకుఁ గొనితెచ్చెను! దురదృష్టవశమున నాస మయమున విఘాతము సంభవించెను. ఐననేమి? భవదీయమనోహర

రూపవైభవము గుఱించి యొనరించిన అమీనా యభివర్ణనము నా మానసమున నాటియున్నది. నాపుత్రికామందిరమున నిన్నుఁగాంచి నంతనే, నాపరిచారికవర్ణన మతిశయోక్తి కాదని రయంబున గుర్తిం చితిని. ఎట్లు ప్రేమింపకుందును? మఱియు, నీపై మోహము లేదేని నాయంతిపుర మీతెఱంగునఁజొచ్చిన నిన్ను సైరింతునా! కావున, నీకట్టి భయమువలదు. జూలియను ఖాలీలులతో నాకుఁ బనిలేదు. నాకిపుడు నీవే ప్రేమాస్పదుఁడవు—సర్వము నీవే—''

లూకాసుతోడనే మోఁకరించి, ఆ మోహనాంగి కోమలకరపల్ల వంబును మగుడ ముద్దాడి, వెనుకటివలెనే వీడి, మఱింత దవ్వునకుఁ బోయి, జాజ్వల్యమాన సౌందర్య విహ్వలహృదయుఁడై నట్టి విస్మయ విశాలానిమిషనేత్రుఁడై యట్టె నిలిచిపోయెను. ప్రభుకాంత మఱియు మఱియు సంతసించెను. క్షణక్షణప్రవర్ధమానమగు మోహాతిరేకమున రయంబునఁ బైకొని ఆనవమోహనాకారుని నిజబాహుపంజరమున బంధింపవలయునని తలంచియు నాతని యధైర్యసంభ్రమంబులంగాంచి వెనుదీసి, ఒకింత ధైర్యము గఱపనెంచి, యువజనహృదయము నీరగు నట్టి సుందరనీలవీక్షణంబులఁ బఱపి, ఆమె అత్యంత మృదుమధురకల స్వనంబున నిట్లులనెను—

సుందరాంగా! కేవలము క్షణికమగు కామవికారము కానోపు నీదు మోహమున కలరి ఊఁకొందునేని, నీవేమందువో?"

తదవసరోచితోత్సాహస్వరమున లూకాసు సముచితభాషణంబుల బదులాడెను. అంత నావగలాడి వర్తులమై, సుందరమై, హిమసన్ని భమై దీపించు నిజభుజకాండము ప్రదర్శించుటకునై తనకంచుకాంత మునందలి బంగరు జలతారు నల్లనబరీక్షించుచు నిట్టులనెను—

"కాని, అబలలమగు మమ్ము బురుషులు కఠినవిమర్శన మొన రింతురు."

సుందరాంగీ? నేనట్టివాఁడఁగానని విశ్వసింపుము.''—తన ప్రవర్తనము లూకాసునకే వింతగఁ గాన్పించెను. తనుపశ్చిమతప్రవచో నిగళబద్ధుఁడైన యాత్రికుఁ మనసులేని సరసమున కొడఁబడినను, మోహపరవశుఁడైన రసికవరునివలె సముచిత సరససంభాషణాధురీణుఁడై యాప్రౌఢాంగనను గన్నుఁబ్రామెను! ఆమె ఇట్టులనెను:—

సుందరాంగా! నీకు సహస్రవందనము లర్పింతును. నీయౌదార్యము కడుశ్లాఘనీయము. దాన నాహృదయభారము తొలంగెను. ఇల్లాలునయ్యు, హృదయదౌర్బల్యంబున మోహపరవశనై నిన్నుఁ బ్రేమింతునేని, నన్ను నిరసింపవుగదా ?"

"నిరసనమా! ఎట్లు నిరసింపఁగలను ? కాని—సుందరీ! ఈప్రదేశమున నేయపాయము సంభవింపదు—"

"ఆహా! చెప్పఁజాలను. మాదేశమున స్త్రీ స్వాతంత్ర్యము సున్న. మగఁడు సర్వాధికారి; ఆలు తదధికారబద్ధయై యున్నది. కావున, ఏముహూర్తమునసైన రానగును. ఐనను, మన కపాయము వారయకుండు నుపాయము గలదు. అల్లదె, మొగమలు తెర—ఆవెనుక నున్న ద్వారము దాటినచో, పాపా ధనాగార ముండును. ఆపత్కాలమున నామార్గము శరణ్యము—కాని, మోహనాంగా! ఈసుఖసమయమున మనచిత్తము భయాధీనము కానేల? ఏవిచార మెఱుంగక, హాయిగ నుందము."

ప్రభుపత్ని యట్లుపలికి, మోహాతురంబున దనచెంతకు రమ్మని లూకాసునకు సన్నయొనరించెను. ఇఁక, మనోహరయువజనబాహుపంజరబంధితయై అనిర్వాచ్యానందసౌఖ్యార్ణవతరంగడోలికల నుయ్యాల లూఁగఁదలంచిన యామదవతికి అంతలో నడుగుల సవ్వడి దడదడ వినవచ్చెను. మోమెత్తి చూచినంతనే, విపరీత భయవికారవదనయై, ఉన్మాదిని చండమున బిఱబిఱనగుదెంచు సమీనా గోచరించెను!

ఇస్మిల్లా లూకాసులు భయభ్రాంతులై దిగ్గునలేచిరి. ప్రభుభార్య రయంబునఁ దెలివొంది, నిజపరిచారికా సందేశము గుర్తించి, తన సరసుని శ్రవణమున వడివడి నిట్లనెను—"ఆర్యా! అపాయోల్లంఘనోపాయము ముందుగనే తెల్పుట మేలాయెను.—ప్రభువరుదెంచువాఁడు.—తత్క్షణ మీమార్గమునఁ బొమ్ము—ఆలసింపకుము—మఱియొకసారి సుఖింపనగును!"

అట్లుపలికి ఆకాంత, తెర తెఱచి, తదంతరరహస్యకవాటము చయ్యన సడలించెను. అందు లూకాసు రయంబునఁ బ్రవేశించెను. తోడనే, ప్రభుపత్ని తలుపువైచి, కాండపటము సరిదిద్ది, ఏతెంచు మగనికి యథాస్వాగతమొసంగుటకై నిశ్చలవదనము దాల్చెను. ఆముహూర్తముననే పాషా యామందిరమునఁ గాలిడెను.

## ౨౧

### తాళము

రహస్యమార్గాంతర్గతుఁడైన లూకాసు మిత్రహితోపదేశానుసారముగఁ దోడనే శస్త్రధరుఁ డాయెను. ఎట్టి యుపాయ ముప్పతిల్లునో యని ఆతఁడు సహస్రనయనములతో నిటునటు దిలకించుచు గడుంగడు నప్రమత్తుఁడై యుండెను. ముచకుఁ జిరపరిచితమగు లోహదీపమందు వెలుంగుచుండెను. కాని, ఖాలీలుఁ డట్టి విపరీతకార్యమునకుఁ దనమిత్రుని నేల నియోగింపవలయును? లూకాసున కేమియు దోఁపకుండెను.

గ్రీకుయువకుఁ డప్రమత్తుఁడై భద్రముగ నడచి సిద్ధిగది సమీపించెను. నీలజీమూతసన్నిభుఁడగు నాదీర్ఘకాయుఁడు చిత్తుగఁ ద్రావి

ఘుర్ఘురధ్వాన మొనరించుచు మైమఱచి నిద్రించుచుండెను. ఒక్క జాముక్రిందటనే వాఁడే తెఱంగున దొంగవలె నిర్జనారామమందిరముఁ జొచ్చి రుచిరాహారంబులను మధురసమును దస్కరించెనో, వెనుకటి పరికరణమునఁ గాంచియే యుంటిమి.

సిద్దీ నిద్రించుటచే నే ప్రమాదము లేకపోయెను. తత్ప్రాంత మతిక్రమించి లూకాసు సోపానములవంక దిలకించుచుండ, ఖాలీలుఁడు గోచరించి యాతని డాసెను. సిద్దీ నిద్రాపరుఁ డాయెనని యెఱింగినంతనే, కార్యము సులభతరమాయెనని సంతసించి, తన ఖడ్గము సారించి, నిజానుచరసమేతుఁడై ఖాలీలుఁడు వానిచెంతకు బోయెను.

సిద్దీని తీవ్రముగ దట్టుచు కుదుపుచు ఖాలీలుఁడు మేల్కొల్పెను. వాఁడు తోడనే త్రుళ్ళి మేల్కాంచెను. కనువిచ్చినంతనే ఖాలీలుని భయంకరమూర్తియు, భయంకరతరసునిశితకరవాలమును గోచరించుటచే వాఁడు దురంతభయాధీనమున గడగడలాడెను. ఖాలీలుఁడు కఠినముగ నిట్టులనెను.—

"ఓరి, సేవకాధమా! నీవు నా యధీనమైతివని యెఱుంగుదు గదా—మాయామర్మములు విడిచి నీకథ పూర్తిగఁ దెలుపవలసిన యవసర మిదుదెంచెః—పరిస్థితు లనుకూలింపమి, నేనిందనుక వేచి యుంటిని—"

దుర్భరభయవికారవదనుఁడై, సిద్దీ యిట్టులనెను.—

"ఆర్యా! నీవెవ్వండవు? చూచుటకు బాలుఁడవయ్యు—నన్ను గాంచిన మొదటి నిముసముననే నాపై నధికారమువహించి శాసింప నారంభించితివి!—నీకుఁగలప్రభావ మేమియో తెలియకున్నది—"

"ఓరీ! నేను మూర్తీభవించిన క్రోధమని యెఱుంగుము! అవసరమగు నవసరముల దయాదాక్షిణ్యములకుఁ గొఱఁతయుండదనికూడ గ్రహింపుము." సిద్దీ భయాతురంబున సమ్మతింప, నాతురుష్కయువ

కుఁడు తోఁటి కఠినస్వనమున నిట్టు లాజ్ఞాపించెను—"లెమ్ము! నీఖడ్గము నిందుంచి ముందునడువుము—నేఁజెప్పునట్లు చెప్పునంతనే యొనరింపవలయు!"

ఖాలీలుఁడు మానవాతీతాధికారధురంధరుండై శాసించుచుండి నట్లు తోఁచెను. పాషాసేవకుఁడు చెప్పరాని భయసంభ్రమంబులచేఁ దిప్పువడి, కట్టెదుటనున్న యధికారమూర్తిని దేఱిచూడఁజాలక అధోముఖుఁడై అల్లనఁ దిలకించుచు, ఆతని మిత్రునిఁగాంచి మఱియు వెఱగందుచు లేచినంతనే, ఖాలీలుఁ డా శిలాసోపానములఁజూపి నడుమని కఠినముగ నాజ్ఞాపించెను.

మిత్రద్వయము పిఱుందనగు దేఱ, సిద్దీ మెట్లు డిగ్గి, నేలయందడఁగి యున్న దారుకవాటము సమీపించెను. వాఁడు తత్క్షణము భయవిహ్వలుఁడాయెను. తురుష్కవీరుని యభిప్రాయము వానికి స్ఫురించెను. మందిరాంతరారామమున కందుండి యొక మార్గముండెనని గతప్రకరణమున నరసియుంటిమిగదా. తత్కవాటము కుడ్యపదార్థముతోఁ గలసిపోవునట్లు కడునిపుణముగ నిర్మితమై యమరియుండుటచే ఖాలీలుఁ డింతకుఁబూర్వ మరయఁజాలకపోయెను. కాని, విమయు మెఱింగినకారణమున నాతఁ డీసమయమునఁ దద్ద్వారమును సులువుగనే గుర్తించెను. అంత నాతఁడు సిద్దీనిఁగాంచి, ఆద్వారపుఁదాళముసంగుమని అధికారపూరితస్వరంబునఁ గోరెను. భయాతిరేకమున నోడలంతయుం జెమ్మటకగ్రిమ్మ, వాఁ డిట్టులనెను.—

"అయ్యా! బీగ మిదిగో. కాని, పాషా ప్రశ్నించునేని, ఏమందును?"

"పోయె నని చెప్పుము. నీవు భయపడకుము—ఈగంటయందే నేను పాషాతో మాటాడవలసియుండును—"

"ఏమైనను, నాపనిసరి. అయ్యా! పాషా స్వభావము నే నెఱుం

గుదు. ప్రళయానిల సన్నిభమగు నా మహనీయుని దురాగ్రహమునకు ఇంధనమునై నేను మ్రగ్గవలసినదే!”

దుర్బలునిపగిది గంపించు నా దీర్ఘకాయుని కరమునందలి తాళము గైకొని, ఖాలీలుఁ డిట్టులనెను—

“సేవకా! నిన్ను రక్షింపఁగలను. నీ వాభయము వీడియుండుము. ఏ కారణముచేనైన నా సంకల్ప మీ సమయమున భగ్నమైనను, నేను మఱికొంత కాలము వేచియుండవలసినను, నీ తాళము నా చేత నుండుటచే నీవలన నా కెట్టి యపాయము వాటిల్ల నేరదు. నీవు తప్పక మదాజ్ఞానువర్తివై యుండుము.”

“అయ్యా! నే నిప్పటికే నీ యాజ్ఞకు బద్ధుఁడనై యుంటిని. నన్ను నీ వకారణముగఁ గడుఁదూలనాడినను, రహస్యభంగ మొనరింపలేదు—”

“చాలు! నేఁ జెప్పువఱకు నట్టులే మెలంగుము. ఇఁక నీ తలుపు తెఱువుము!”

అట్టు లాజ్ఞాపించు ఖాలీలుఁ డీ సమయమున దుర్నిరీక్షుఁడై ఆతని కంఠ మీ సమయమున నధికతర గంభీరాధికారపూరితమై యుండెను. వీక్షణములు తీక్షణతరంబుగ నుండెను. సీదీ భయ మధికతమ మాయెను: వాని మేనెల్ల వడంకఁ జొచ్చెను. కట్టెదుటనున్న భయంకరాధికారమూర్తిని నిరాకరింపనేరక, తాళ మొసంగుటకు ధైర్యము చాలక మ్రాన్పడియున్న సేవకునిఁ గాంచి, ఖాలీలుఁడు తీవ్రతరంబుగ నిట్టులనెను—

“ఓరి, సేవకా? ఈ రహస్యకవాటము రయంబునఁ దీయుము!—కార్య మొనరింపక అట్టు లేల నిలిచెదవు?—ఓరీ! మఱియొకసారి చెప్పెద—ఇంకను ఆలసింతువేని, మదీయ ఖడ్గధారకు గుఱియై శాపున మరణింతువు!”

సిద్దీ యింక నుపేక్షింపఁజాలక, పాపావలసఁ దనకుఁ బ్రాణా పాయము వాటిల్లకుండ రక్షింపవలయునని దైన్యముగఁ బ్రార్థించి, ఖాలీలు నాజ్ఞ నౌదలఁ దాల్చి, కార్యమునకుఁ బూనెను.

గోడయం దమరియున్న ద్వారముచెంత నొకఇనుపసీల యుండెను. సిద్దీ బలముగ నొక్కినంతనే అయ్యది ఒక యంగుళము గోడలోనికి దిగిపోయెను. వాఁ డంతట భూమ్యాంతర రహస్యదారు కవాటము చెంతకుఁ బోయి ఒకవంక నొక్కినంతనే, యవ్వలికొన లేచెను. ఆహా! ఎంత విపరీతము! ఆ ముహూర్తముననే, ఇస్మిల్లా మంది రాంతర రహస్యద్వారము తెఱచినసవ్వడి ఆయెను. బానిసీఁడు తోడనే పిడుగుపడినభాతి బెగడువడి, మందస్వరముననే 'పాపా!' యని అఱచెను. సవ్వడియేగాక ఈ గంభీరాలాపములు విస్పష్టముగ వెలువడెను. "ప్రేయసీ! ఈ స్వప్న మనర్థదాయక మని తోఁచెడిని. నా ధనాగారము సురక్షితముగ నుండునా! తత్క్షణము పోయి చూడ వలయు——"

సిద్దీ ప్రాణము లెగిరిపోవుచుండెను. వాని శ్రవణమున ఖాలీలుఁ డిట్లులనెను. "భీతిల్లకుము. వీని నెప్పటియట్టు లమర్చి వేయుము—— నీ ప్రాణము నా యధీనముసుమా!——విశ్వాసఘాత మాచరింప కుము——భయము వలదు!"

"అయ్యా! తాళము!" అని వాఁడు మరణావసర విహ్వాలస్వర మున నడిగెను.

"పోయెనని చెప్పుము. అపాయము ఘటిల్లకుండ నేను రక్షింపఁ గలను."

లూకాసు ఖాలీలు లా క్షణము నిశ్శబ్దముగ మాయమైరి. సిద్దీ ప్రాణము పిడికిటఁబట్టి, కదలిన తలుపును శీలను యథాప్రకార మమర్చునంతలో, నిస్మిల్లా పలుకు లీపగిది విననాయెను——"నాథా!

వృథా యలజడి యేల? కల కింత వెఱపా? నీ సేవకుఁడు దయ్యమువలె నిరంతరము గాఁపుండ, ఎట్టిభయము! రమ్ము! మదు రోజతల్పుండవై హాయిగ నిద్రింపుము!"

"వలదు, వలదు! కలలు కల్లయని తృణీకరింపరాదు. స్వప్నములు భావిశుభాసూచకములు. నీ విందే యుండుము—వచ్చిన రమ్ము: నీ వనునట్లు నా సేవకుడు నిక్కముగ స్వామిభక్తి పరాయణుఁడై, విశ్వసనీయుఁడై, అప్రమత్తుఁడై కాఁపుండెనో, లేదో తత్క్షణ మరయ వలయు."

తత్సంభాషణమున పాషా నిమగ్నుఁడై, అంతవఱకు నాతలుపు పూర్తిగ దెఱవఁడాయెఁ గాని, తెఱచినచో సిద్దీపను పాటు వ్యక్తమై యుండెడిది. కాని, వాని యదృష్టవశమున నాద్వారము వివృతమగు సరికి, కార్యము పూర్తిఆయెను. నిజభార్యాసమేతుఁడై పాషా యంత నా మెట్లుడిగ్గ దొడంగెను. తలుపు తెఱచినంతనే ప్రభుపత్నియొక్క తీక్షణ వీక్షణంబున నాసీమయంతయుఁ బరిశీలించెను. ఆమె హృదయ మెటులుండెనో పాఠకులు గ్రహించియే యుందురు. ఒక్క నిమిషము క్రిందనేగదా, లూకాసు ఆమందిరమునుండియే-ఆమార్గమునుండియే యరుదెంచెను!

ప్రభ్వీప్రభువులను గాంచినంతనే, సిద్దీ అమితభయవినయ సంభ్రమాకులుఁడై ఎదురేగి, సముచిత దూరంబున యథాక్రమముగా సాష్టాంగ మాచరించెను. పాషా యిట్టులనెను—

"మస్రూరా! లెమ్ము. జాగరూకుఁడవై యుంటివి- సంతసించితిమి అరె! ఖడ్గము కానరాదేమి! కాఁపరి నిరంతరము ఖడ్గధారియై యుండవలదా? తొల్లి భయంకర మహాసర్పములు ధనాగారములను గాఁచుచుండెనని వినియుందుము—అయ్యవి నిరంత విషధరము లగుటయే గదా వాని ప్రాశస్త్యము! అట్టులే నీవును అనుక్షణమాయుధ హస్తుఁడవై యున్న

గానిఁ నీవలన ప్రయోజనమేమి?"

సిద్దీ మగుడ సాష్టాంగమొనరించి కడు దైన్యముగ నిట్టులనెను.—

"మహాప్రభూ! రక్షింపుము! ఖడ్గమాయరయందు మఱచితిని.—ఆకోణమున నిద్రింతును—ప్రమాదవశమున—"

"ప్రమాదమా! సేవకాధమా! ఏమంటివి? ఇట్టి ప్రమాదము లెన్నా యెనో!"

"అధిపా! ఇట్టి ప్రమాదమెన్నఁడు సంభవింపలేదు— ఇదే తొలిసారి—ప్రభూ! క్షమింపుము—రక్షింపుము!"

సేవకా! ప్రభువు దయామయుఁడు—నిన్ను క్షమియించును లే."

ఇస్మిల్లా ఆతీరున వానికి ధైర్యము గఱపి, సముచిత సరసంపుఁ జేష్టలఁ దన నాథుని క్రోధ ముడుపుటకుఁ గూడఁ బ్రయత్నించెను. పాషా యిట్టులనెను.—

"వీని ఖడ్గము నిజముగ నందున్నదో లేదో చూతముగాక.— అల్లా! ఓరి, పసరమా! ఇదియేమి? ఈ రుచిరాహారము లెక్కడివి?— సారాయి కూడనా! తెలిసె— వీడరాని యీనిగూఢ ధనాగారము వీడి, చొరరాని నాయుపవనము జొచ్చి, నీవంటి సేవకాధముఁడు చూడనైన జూడరాని ప్రశస్తభోజ్య పదార్థముల నపహరించితివిగా!"

సిద్దీ యవస్థ ఎటులుండునో పాఠకులే గ్రహింపవలయును. దీనాతి దీనావనుఁడై ప్రభుపత్ని నొక్కసారి తిలకించి, మగుడ పాషా పాదములచెంత వ్రాలెను. తురుష్కప్రభువు దందహ్యమాన మానసుఁడై అభినవజల ధరధ్వానమున నిట్లు గర్జించెను.—

"అధమాధమా! నీ యపరాధము స్పష్టము! అందులకు శిక్ష నీకుఁ దెలియుఁగదా—అనుభవింతువుగాక!"

దత్తరను పాషా అత్యుగ్రుఁడై, దుర్నిరీక్షుఁడై యుండెను. ఆస్థలంబుననే యుండిన ఇస్మిల్లా యవస్థ కడుంగడు దుర్భరముగ వర్ణనా

తీతముగ నుండెను. నాథుని శాంతి పఱచు టెంతయు నవసరముగ నుండెను. కావున నామె నిజహృదయారాటము మఱుగు పఱచి మధుర మందహాసరాజిత వదనయై మంజుల వీణారవంబున నిట్టులనెను.—

"ప్రాణనాథా! ఈ మనుష్యు డంతగ ద్రోహి కాఁడని భావింతును. సమాధాన మొసంగుట కవకాశ మొసంగుఁడు. ఒకవేళ, వాని కనుదిన మాహారము తెచ్చెడు సమీనా జాలిగొని ఈ రమ్యాహారము గూడ నేఁడు కొని తెచ్చెనేమో.—"

"అట్టులగునేని అమీనాయును దత్ఫలమనుభవించుగాక!"

"ప్రాణేశ్వరా! నిజము చెప్పవలయును గదా— ఈ స్వామిభక్తున కప్పుడప్పుడు నేనే మధురస మంపుచుంటి.—"

"ఐన, నీవును అపరాధ మొనరించితివి! కాని, నీ యౌదార్యము అబలాజన సహజదౌర్బల్యము వ్యక్తపఱచుచున్నది. కాని, తన యంతర మెఱుంగక ఇట్టి పదార్థములు పరిగ్రహించువాఁడే ప్రధానాపరాధి. ఐనను, నీవు చెప్పుచుంటివి కాన, వానికి మరణము తప్పెను. కాని, వానినెల్లి బానిసబజారున కంపి, విక్రయింతును— ప్రభువిశ్వాసపాత్రుఁడైన యీ దుర్దినము దలంచి ఆజన్మాంతము దుఃఖితుడగుగాక. దురాత్మా! లెమ్ము! విశ్వాసఘాతుకుఁడవై నీకొసంగిన తాళము దుర్వినియోగ మొనర్చితివి! ఆ బీగ మిటు తెమ్ము; లెమ్ము!"

కాని, ఆ సేవకుఁడు బాధిర్యబాధితుఁడో యన, లేవఁడాయెను. అంతవఱకు భూమికి కొంచె మెత్తుగనుండిన శిరము ఆ చల్లని కటికి తాల నోరయునట్లు వ్రాలి, చచ్చినపగిది వాఁడట్టులే పడియుండెను.

"ఓరీ! మాటాడ వేమి? సత్వరము తాళ మిమ్ము!"

ప్రభు వట్లు గర్జించినను, వాఁడట్టులే పడియుండెను. అంత

నిస్సిద్దా ఇట్టులనెను.—

"పరిచారకా! వినఁబడదా, ఏమి? ప్రభువునకు బీగ మిచ్చి వేయుము—నిన్ను దప్పక మన్నించుచును—నేఁగూడఁ దోడ్పడెదను."

అంత నమిత మందస్వరంబున సిద్దీ యిట్టులనెను—"మహాధిపా! తాళము—తాళము పోయెను—"

తురుష్కప్రభువు తోడనే భయంకరరౌద్రమూర్తియై, రక్తారుణ రాగదీపితవదనుఁడై ప్రజ్వలితానల సన్నిభనయనుఁడై తదావేశమున భూతాడనమొనరించి యిట్లుగర్జించెను—

"ఇవి యేటిమాటలు? ఓరోరి, సేవకాధమా! ఏమంటివి! ఔరా! నాతో వీఁడు ఎక్కసక్కెము లాడునాఏమి! అధమాధమా! మాటాడవేమి? ఆరామమునకుఁ జూపు రహస్యకవాట తాళ మేమాయె?"

మృతప్రాయుఁడగు నా సిద్దీనోటినుండి మాట వెలువడుటయే బహు కష్టముగనుండెను. వాఁడెట్టులో ప్రాణములు బిగియబట్టి హీనాతిహీనస్వరంబున 'పోయె'నని మగుడఁ బలికెను.

పాపా ఇంకనుఁ దాళఁగలఁడా? ఆగ్రహము దుర్భరంబగుడు, నాతఁడు మండిపడి మగుడ నిట్లు గర్జించెను—

"పోయెనా! తాళము పోయెనే! కాంతా! చూచితిగదా!— ఇట్టి దురాత్ముని నీవు సైరింపుమంటివి! ఎంత మోసము! ఎంత ప్రమాదము! ఇట్టి దుష్టవిశ్వాసఘాతుకునెగదా, మన మింతకాలము విశ్వసించియుంటిమి!"

కాని ప్రభుపత్ని ఏమనఁజాలును? ఆమె యవస్థమాత్రము తిన్నగ నుండెనా? తదవస్థ ప్రకటింపరాని దగుటచే మఱియు దుర్భరమై, దుస్సహమై, హృదయవిదారణకరమై యుండుటచే, నా యభాగిని ప్రత్యుత్తర మొసంగఁబోయియు విఫలయాయెను. పాపా మగుడ

నిట్లు గర్జించెను—

"దుష్టా! తాళమేమాయె? ఎందుఁబోయెను? కవాటము భద్రముగ బంధింపఁబడియున్నదా?"

"చిత్తము, దేవా!" వాఁడింక నట్టులే పడియుండెను.

"అట్లయినచో, నా తాళ మింటే యుండవలయు. ఎందో దాచి మఱచియుందువు. కాదేని, సారాయికై పున నోడలెఱుంగక ఎచ్చటేని పాఱవైచి యుందువు."

"దేవా! ఎల్లెడల బరిశోధించితిని. నేనా తాళమునకై వెదకుచుండగనే, దేవరవా రరుదెంచిరి."

"చాల వింతగ నున్నది. ఏమియు గ్రాహ్యము కాకున్నది. ఏమైనను నీవు ప్రమత్తుండవగుట తథ్యము. ఏమో! అంతయు నొక మోసము కారాదా? సేవకా! లేచి, నీగదిలోనికి సత్వరము నడువుము!"

వివిధాలోచనా బాధితుఁడై యట్టు లాజ్ఞాపించి, పాషా విద్యుత్ప్రభావిభాసిత కరవాలము నొరనుండి తీసెను. ఇస్మిల్దా యమిత భయాధీనయై కెవ్వున నఱచి తాఁజూచుచుండగ వానిఁ జంపరాదని ప్రార్థించెను.

"కాంతా! భయము వలదు. నాయభిమత మదిగాదు"—అని హెచ్చరించి, చెంతనున్న సిద్దీ దీర్ఘకరవాలముంగూడఁ జేఁబూని, పాషా మగుడ నిట్టులనెను—"మస్రూరా! నీ యాయు వీగంటతో సరి! గంటయననేల—ఈ నిమిషముతో సరి! నేనిదె పోయి తద్భయంకర కార్యరచనా సమర్థులగు కింకరులను జీరువాఁడ!"

మస్రూరామాట యటుండ, ప్రభుభార్య యవస్థ వర్ణనాతీతముగ నుండెను. భయంకరానల దహనాయమాన కాంతారమువలె నామె హృదయము భగ్గుభగ్గున మండిపోవుచుండెను. ఐనను, తద్విపరీత

భయావసరోచిత గాంభీర్యముదాల్చి, వినమ్రమై మోఁకరించి ఆమె యిట్టులనెను.—

"మహనీయా! భవదీయ హృదయానువర్తిని నగు నా పలుకులు గమనింపుము. ఈ సేవకుని తల మధుపానముచేఁ గైపెక్కియుండుట సువ్యక్తము గదా. వాఁడు కృతస్మారకుఁ డగువఱకు గడువొసంగుము. ఒక్కజాము చాలు—తగు సమాధాన మొసంగునేమో చూతము."

"ప్రేయసీ! లెస్స బల్కితివి. సేవకా! వింటివా! ఒక జాము సావకాశ మిచ్చితి—నేమగుడ నేతెంచుసరికి తగు సమాధాన మొసంగిన, నదృష్టవంతుఁడవు—లేదేని, భయంకరచాపపాశ ఖండితకంఠుఁడవై చత్తువు—నీ పాపిష్ఠి మృతకళేబరము బాస్ఫరసు జలచరంబుల కాహారంబగు! తరుణీ, రమ్మ!"

అట్లుపలికి, సవ్యాపసవ్యహస్తముల కృపాణములు దీపింప, దత్తబను పాషాతోడనే వెడలెను. ఎట్టి యుపాయము వారయకుండ తాఁజూచెదనని సిద్ధిగ్రహించునట్లు భావగర్భితముగ నొక్కవీక్షణము విద్యుత్కిరణమువలె వానిపైఁబఱపి, ప్రభుపత్ని యాతని ననుగమించెను. పాషా యాద్వారము తోడనే దిట్టముగ బంధించి, ఇట్టులనెను.— "శయ్యాగతుఁడఁగాకముందె, నాధనము సురక్షితముగ నున్నదో, లేదో చూడవలయు."

ఇఁక లూకాసు ఖాలీలుల సమాచార మరయ వలయును. పాషా యరుదెంచు సవ్వడి ఆలించినంతనే, వారు మాయమైరిగదా. నిజమందిరకుడ్యాంతరరహస్య కవాటముడాసి మిత్రులచట నిలిచియుండిరి. ఆమెట్ల వరుస వంకరతిరిగిన కారణమున వారు పాషాకుఁ గానరారు. పాషా మొదలగువారుకూడ లూకాసు ఖాలీలుల కగోచరులైనను, వారి సంభాషణము స్పష్టముగ వినఁబడెను. తన తురుష్కమిత్రుని

ప్రవర్తనముం గలంచి లూకాసు మఱియు మఱియు విస్మితుండాయెను. ఖాలీలుండే సమాధాన మొసంగలేక, చైతన్య రహిత శిలా ప్రతిమ వలె నిలిచి, సిద్దీ పాషా ఇస్మిల్డాల సంభాషణ మాకర్ణించు కార్యమున నిమగ్నుండాయెను. సవ్వడి యేమైనను, పాషా గుర్తించును. దాన, నెంతేని యనర్థము వాటిల్లును. కాని, లూకాసుకూడ వివేకవంతుండగుటచే, నమిత సంభ్రమసంభరిత స్వాంతుండయ్యు నిశ్శబ్దముగ నుండెను.

తత్క్షణము తన ధనాగారము పరీక్షింప వలయునని పాషా యనిన పలుకులు వీనులం బడినంతనే, ఖాలీలుండు వడివడి మెట్లమలపుడాసి ఆతని చర్యానరయం బ్రయత్నించెను. పాషా నేలయందలి మరతలుపు సమీపించి, తత్సమీపారామద్వారము యథాస్థానమున సురక్షితముగ నుండెనో లేదో యని ముందుగం బరీక్షించెను. సిద్దీపలుకు లంతవఱకు సత్యములె దాన నా ప్రభువు సంతసించి, అప్రక్కనున్న ఇనుపచీల నొక్కెను. కంటి కగోచరముగు పరస్పర సంబంధముంటచేం గావలయు, దన్నికట భూస్థాపితదాప కవాటము చలించెను. పాషా యా తలుపెత్తి, వంగివంగి తదేకధ్యానముతో నందేమియో చూడం నొడంగెను. ఆముహూర్తముననే చెప్పరాని విపరీత దృశ్యమొండు ఖాలీలునకు గోచరించెను.

ఇస్మిల్డా పాషా వెనువెంటనే యుండెను. దీపపుంగిరణంబు లామె వదనముపై స్పష్టముగం బడుచుండెను. తదానన వీక్షణాభిరతుండగు తురుష్కయువకున కాకార్యము దాన సుకరమాయెను. ధీర యువజన హృదయాకర్షణ చణనిరుపమాన మధుర శీతల సౌందర్య విరాజితయగు నావాల్గంటి తత్క్షణమున ఘోరతరవికారాకార రాక్షసి చందంబునం దోంచెను. సాధుహరిణ వేషధారిణియగు వ్యాఘ్రి తఱిజూచి నిజ భయంకరాకృతి ధరించు భాతి నాయువతి వైఖరి కాన్పించెను.

ఆ విపరీతపుఁగాంత పెనురక్కసివోలె దారుణ సంకల్పధురీణయై బాహువులుజాపి, వంగివంగి భూరంధ్రపరిశీలన కార్యనిమగ్నుఁడై యున్న తన నాథుని రయమ్మున నయ్యగాధమున బడఁద్రోయు దానివలె నుంకించెను. పాషాయవస్థ ఏమి కావలయు? మనోహారిణి యని విశ్వసించిన కామిని నిజప్రాణాపహారిణి యగునని ఆతఁడేమి యెఱుంగు? కాని, సాక్షాత్కృత మృత్యువుంబోలిన యాబోటి దుష్ట సంకల్పము గాంచినంతనే, ఖాలీలుఁడు తదవసర దుర్భరావేశమున రయంబునఁబోయి వారింప నుద్దేశించెను. కాని, అదృష్ట వశమున, పరీక్షపూర్తియగుటచే, నందనుక వంగిన పాషా లేచుచు నిట్లులనె.— "అల్లాదయామయుఁడు— వందనీయుఁడు— ధనము సురక్షితముగ నున్నది!"

సుందరియగు నిస్మిల్లా ఎటులు దారుణాకృతి దాల్చెనో, అట్టులే మగుడ దొంటి నిశ్చల ప్రసన్నవదనము దత్క్షణము తాల్చెను. ఖాలీలుఁడు ప్రచలిత హృదయుఁడాయెను. మలపున కవ్వలనున్న లూకాసు మాత్ర మేమియు నెఱుంగఁడు.

దత్తబను పాషా యంతనారహస్య కవాటమును భూస్థలి నెప్పటి యట్లు పొందుపఱచి, ఇట్టులనెను.— "జీవితేశ్వరీ! మదీయహృదయారామసీమ ప్రవర్ధిత మనోహర సంపుల్లకుసుమరత్నమా! భవదీయ శయ్యాగారమునకు, బోదము, రమ్ము— నీవనినట్లు భవదురు వక్షోజతల్పుండనై హాయిగ నిద్రింతును."

దైవమా! ఎంత విపరీతము! నాథుని ప్రాణము గబళింపఁజూచు రక్కసియా, జీవితేశ్వరి! తన కాదుష్టాత్మ కతంబునఁ బ్రాపింపవలసిన ప్రాణోపద్రవమావంతేని పాషాకుఁదెలిసెనేని, తెలియకున్నను అనుమానమైనను స్ఫురించెనేని, తత్క్షణ మామెను బాస్వరసు జలరాశి గర్భంబున గుభాలునఁ ద్రోయించి యుండెడివాఁడు. కాని, తద

పాయమునెఱుంగని పాపా నిశ్చల సంతోషిత స్వాంతుఁడై, భార్యా సమేతుఁడై యాస్థలమునుండి తొలగెను.

తోడనే, ఖాలీలుఁడు తన మిత్రునిడాసి ప్రశ్నింపఁదా నమినాను గాంచుటయు, ప్రభుపత్నీ క్రీడామందిరము జొచ్చుటయు, తదంతర మాయా ప్రణయగాథయును, పాపాయురుదెంచుటచేఁదా నామందిర మునుండి వెలువడుటయును లూకాసు తెలియఁ బఱచెను. అనంతర మాతఁడిట్లు ప్రశ్నించెను.—

"మిత్రమా! ఇఁక నీకథ వినవలయు. నీచర్యలు నిగూఢములై, విస్మయజనకములై, అగమ్యములై, యున్నవి—"

"మిత్రమా! కొంతకాలము వేచియుండవలయు. నిర్మలహృదయ ముతో నీవింతవ్యాపారములందుఁ బాల్గొనుచుంటినని మాత్రము విశ్వసించి యుండుము. తగిన యదను చిరకాలమున రాఁగలదు. నీకపుడు సర్వము సువ్యక్తమగును."

ఖాలీలు, డాపగిది వినిశ్చిత స్వరంబునఁ బలుక, లూకాసు సముచిత ముగ నిట్లలనెను.—

"మిత్రమా! సహజోదార స్వభావుండవు, యుక్తాయుక్త వివే చనా సమర్థుండవు— నీకెదురాడ వాఁడఁగాను. ఆర్యా! భవదీయ కృపాతిశయముచేగాదే, నేను సజీవుఁడనై యుంట! భయంకర మృత్యు గహ్వరమునుండి రక్షించిన నీయుంగరము ప్రభావమెన్నందును మఱపు నకు రాదుగదా—"

ఆ తెఱంగునఁ దన కృతజ్ఞత వెలిబుచ్చు తన మిత్రునితో నభి మానపురస్సరముగాఁ బరస్పరకరపీడన మొనరించి, తనసమాచారము జూలియసునకుఁగూడ నెఱిఁగింప వలదని హెచ్చరించి, ఖాలీలుఁడాతని మందిరమున కాతనిం బుచ్చెను.

తుఱుష్కవీరుఁ డనంతరము తన మందిరకుడ్యాంతరరహస్యమార్గ

ము గప్పివైచెను. కాని, ఆతఁడు తన మందిరమునకుఁ బోక, మఁగుడ వెనుదిరిగి ఆసోపానములవెంబడి నడచి, సిద్దీ వెడలియుండిన యారామ ద్వారము చెంతకుఁబోయెను. అందెవ్వరును లేరు: ప్రదేశము కడు నిశ్శబ్దముగ నుండెను: తాళము తనచెంతనుండుటచే నాకవాటము సులువుగాఁదెఱచి యల్లనఁ బరికించెను. తెల్లవాఱుచుండెను. ఆవిశాల ప్రదేశమునం దెవ్వరును లేరు. కావున నాతఁడు ద్వారమునుండి వెలువడి, కొంత దవ్వరగి, వెనుకటిసాయంకాలమునఁ దన పరిచారకుఁడగు సాదకుఁ డొసంగిన మందసము తెఱచెను. అందుఁ జిన్న పొన్నకాయలంతటి ఉండలా ఉండెను. అందొక గుండు తన కరంబునఁబూని, బాహుబలము గొలంది విసరెను. అయ్యది తుపాకినుండి దూఁకు లోహగోళమువలె జివ్వునఁబాఱి, తోఁపుకొన యందలి వృక్షపంక్తి నతిక్రమించి భూగతమైనంతనే శబ్దమాయెను. ఆధ్వని యంత అధికముగ లేకుండుటచేతను, ఆస్థలము కొంతదవ్వున నుండుట చేతను, పాషా మందిరమునందలి వారెవరును వినలేదు. ధూమపటల మొకింత చెలఁరేగి క్రమముగా మాయమాయెను.

ఖాలీలుఁ డావంకనే చూచుచుండ, నచ్చటి సాంద్రతరగుల్మముల చాటునుండి ముప్వురు మనుజులు మెల్లమెల్లగ గోచరించిరి. అందు మొదటివాఁడు మనకుఁ జిరపరిచితుఁడగు సదకుఁడు. వారి వెనుక మఱి యిరువురు నల్లని సేవకులుండిరి. వారంతయు ఖాలీలుని సమీపించి యత్యంతవినయమ్మునఁ బ్రణమిల్లిరి.

ఆసేవకులతోఁబాటు మఁగుడ ఖాలీలుఁ డా రహస్యమార్గమునఁ బ్రవేశించి, సిద్దీ బంధితుఁడైయుండిన కోణపుఁ దలుపు తెఱచి, వాని నుద్దేశించి యిట్టులనెను.—

"మత్రషూ! అపాయమునుండినిన్నురక్షింతునని చెప్పియుంటిగదా. ఇం దిట్టులే యుందువేని మరణము ధ్రువము. ఇస్మిల్లా ఎంతటి చతుర

మతియైననుఁ పాషా క్రోధముడుగునది కాదు. కావున, నిన్నొక సుర క్షితప్రదేశమునకుఁ జేర్పఁదలంచితి—ఈముువ్వురు నాసేవకులు— నీవు తత్క్షణము వీరివెంటఁ బొమ్ము!"

సిద్దీ అనుమానసంభ్రమభయాధీనమానసుఁడై, నిరుత్తరుఁడై చూచుండ, ఖలీలుఁడు మగుడ నిట్లులనెను.—

"స్నేహూ! వెఱపుడుగుము. నేను వంచకుఁడఁగానని యెఱుంగఁ జాలవా? నిన్నుఁ బొలియుంచుటయే నాయభిప్రాయమగునేని వంచన యేల? సాయుధులమగు నల్వురము నిరాయుధుఁడవగు నిన్నీ క్షణమునఁ బొలియింపజాలమా? కావున, అనవసరకాలయాపన మొనరింపక వీరి వెంటఁ బొమ్ము. నీవు బందీవై యుందువు—ఆ విషయమిపుడే వ్యక్తీకరింతును. ఐనను, ప్రాణభయము మాత్రము లేదు— సమయమగునపుడు నే నడుగు ప్రశ్నలకు సమాధాన మీయవలదు- పొమ్ము!"

సిద్దీ మందుఁడుగాఁడు. ఖలీలుఁ డుదారవంతుఁడని యాతఁ డెఱుంగును. ఏమైనను, పాషా గృహంబున నుండిన, మరణము తథ్యము. ఖలీలుని ప్రవర్తన మనుమానాస్పదముగనే యుండినను, మృత్యుమందిరము వీడుట వివేకముగదా. కావున వాఁడు సమ్మతించెను. తోడనే, వారందఱు నావలకుఁ బోయిరి. కొంత దవ్వరగి, సదకుని శ్రవణంబున నేమియో పలికి ఖలీలుఁడు రయంబున వెనుదిరిగి మగుడ దన్మందిరాంతర్గతుఁ డాయెను. అతఁ డాతలుపు భద్రముగ వైచి, తన మందిరము జొచ్చి, తత్క్షణము శయ్యాగతుఁ డాయెను.

పై విషయము జరిగిన యొక గంటకు ఇస్మిల్లా శయ్యనుండి లేచెను. ఆ మాయాలాడి ఎట్లు నిద్రింపఁగలదు ? పాషా గాఢనిద్రాపరుఁడై యుండెను. అతఁ డంతలో మేల్కొనువాఁడు గాఁడని యెఱింగినదగు

టచే నా కాంత తల్పము డిగ్గి మొగమలు తెర సడలించి, తత్సమీప సోపానములను వడివడి గడచి, తన నాథుఁడు సిద్దీని బంధించిన గది చెంతకుఁ బోయెను. తురుష్కప్రభువు వైచిన గడియ దిట్టముగ నట్టులే యుండెను. భారవంతమగు నాదండము మెల్లగ దీసి, తలుపు తెఱచి హృదయావేగ మొకింత యడంచి, హీనస్వరమున వడివడి నిట్టులనెను.—

"మత్ప్రియసేవకా! మస్రూ! రమ్ము! నన్ను మితవిశ్వాశముతోఁ గొల్చిన నిన్ను విడనాడుదునా? సత్వరము రమ్ము!"

మస్రూపైకి రాఁడాయెను—వచ్చు సవ్వడియైనఁ గాదాయెను! ఎట్టులగును? కాని, ప్రభుభార్య ఏమియు నెఱుంగదుగదా. కాన, వాఁడు నిద్రించియుండునని యెంచి ఆ కాంతయందు జొచ్చెను. ఆమె విస్మయ మెట్లు వర్ణింపనగును! సిద్దీ కానరాఁడు! వాఁ డేమా యెను! వానినందు పాషా బంధించుట ఆమె కన్నులార గాంచి యుండెను. గడియ యథాస్థానమున నమరియుండెను. ఐనను, సిద్దీ కానరాఁడేమి? ఒకవేళ, దన పరిచారిక అమీనా వానిని దప్పించి యుండునా? ఎట్టులు? ఆ విషయ మామెకుఁ దెలియుట కవకాశము లేదే! మఱియు, నామె అందే తెంచుటయు నసంభవము! ఏమన, దన మందిరమునందలి మార్గముగాక మఱియొక్కటియే యుండెను. అయ్యది ఖాలీలుని మందిరమునందలి రహస్యద్వారము. కావున, నటు పోవుటయు నసంభవము. విచారించి చూడ, నా కాంత కీ యూహాస్ఫురించెను. తన పరిచారికవద్ద తాళము గలదుగదా— తత్సాహాయ్యమున నారామమునుండి యందుఁ బ్రవేశించి సిద్దీని విడిచి యుండనగును. కాని, అదియు నసాధ్యము. సిద్దీ యాకస్మికముగాఁ బట్టువడి బంధింపఁబడెను—ఆవిషయము అమీనాకెట్లు తెలియును? తెలియుట అసాధ్యము. ఐన, వాఁడేమాయెను; ఏమియుఁ

దోఁపకుండెను.

ఏకారణము గానరాని కారణమున నిస్మిల్డా చిత్తమునింత భయాధీనమాయెను. ఘోరాకారములగు భూతములు దుష్టమానవుల నమాంతమెత్తికొని పోవునని ప్రభ్వి యప్పుడప్పు డాలించుచుండెను. ఆగాథ లిపుడు స్మరణకువచ్చెను. ఆహా! ఎంత ప్రమాదము! ఆదయ్యము తనకపుడు ప్రత్యక్షమగునేమోయని ఆకామిని ప్రకంపిత హృదయయై, ప్రస్వేదార్ద్రశరీరయై, ప్రచలితనయనయై అందెల్లఁ గలయఁ జూచెను. దుర్భరహృదయావేగము సహింపఁజాలక, దుస్సహాశిరోవేదమునకుఁ దాళఁజాలక, నిలుచుటకైన నోపికచాలక, అచటిగోడ నామె యాశ్రయించెను. తదుత్తర నిమేషముననే మగుడ ధైర్యధుర్యయై చింతింప నమీనాయే కావలయునని ఇస్మిల్డా భావించెను. ఆమె తోడనే ఆతలుపుమూసి, గడియ గూడ నెప్పటియట్లువైచి, ఇట్లు చింతించెను.——
"అమీనాయే సిద్దీనిఁ దప్పించి యుండునేని, ఎరికి నేయపాయము రాకుండ సముచిత సమాధాన మొసంగుటకుఁ గూడ సిద్ధముగ నుండును."

తోడనేఁ ఇస్మిల్డా తన శయ్యాగారమునకు మగిడి, యథాప్రకారము తన మగనిప్రక్క నల్లనమేను జేర్చెను. వివిధ తీవ్రాలోచనానలతప్తమగు నామె చిత్తమునకు నిద్దురమాత్రము రాకుండెను. అట్లు కొంతకాల మగుడు, పాషా మేల్కాంచి, ఉదయకాల్య కరణీయములు తీఱునంతనే తాను మస్రూను గాంతుననియు, వాఁడు తగిన సమాధాన మొసంగఁడేని తత్ఫలము గుడుచుననియు పలికి వెడలెను.

పాషా నిష్క్రమమామె హృదయభారము దొలంగించెను. తత్క్షణమామె అమీనాను రావించెను. పరిచారిక గోచరించినంతనే "నీవు సిద్దీని జెఱనుండి తప్పించితివా?" యని తీవ్రాలునఁ బ్రశ్నించెను.

అమీనా ఆ ప్రశ్న వినినంతనే భ్రమాన్పడెను. విషయ మేమియు

నెఱుంగని దాసి యట్లు మాఱ్పడుట సహజముగదా. ఇస్మిలిడా బిగ్గరగనే యిట్టులనుకొనెను.—

"ఆహా! నా యూహాయే నిజముగాఁ బోలు! భూతమే కావలయు- ఆ 'యెబ్లిసు' అను చపలలోని భూత మొకండు—."

తన దొరసాని ఆకస్మికముగా నేదారుణకారణమునో మతిభ్రమణము గాంచి యుండునని యెంచి, దాసి సాభిప్రాయముగా నిట్టులనెను.—"దేవి! ఏ మంటివి? నీ యభిప్రాయ మేమి? నిశ్చలచిత్తవుగమ్ము. *

ఇస్మిల్డా తోడనే జరిగిన దారుణవిపరీతోదంతము దెలియఁబఱచెను: దురంతభయసంభ్రమాకులంబున నమీనా ఆలించెను. ప్రభ్వికంటె దాసికి దయ్యములపై భయవిశ్వాసములు మెండు. పెక్కండ్రు దురదృష్టవంతులు నిరాశావేశమున భూతనాయకునకు వశులై, తమ ఆత్మలను గోల్పోవుట కొడఁబడి ప్రకృతాపాయమునుండి తప్పించుకొందురని వినిన కథ లిపుడు తలంపునకు వచ్చెను. అట్టులే, మరణాపాయమునకుఁ బాల్పడిన సిద్దీయును భూతరాజును ప్రసన్ను నొనరించుకొని, ఎరికిఁ గానరాకుండ బాఁటియుండునని ఆమె విశ్వసించెను.—

"దేవీ! తొల్లి 'సులేమాను' అను ప్రసిద్ధపురుషపుంగవుండు చాల భూతములను బట్టి తామ్రఘటములందు బంధించి, సముద్రగర్భమున నుంచెనట. ఆ భూతములు తా మొనరించిన దౌష్ట్యముల ననుసరించి తగు కాల మట్టులు బంధితములై యుండును. మన దురదృష్టవశమున కొన్నింటి భూతముల శిక్షానుభవము పూర్తిఆయెను. అట్టి పిశాచభాండములు సముద్రోదరము నుండి పైకి లేచును. అయ్యవి క్రమముగా నిర్జనద్వీపములం జేరి యచట శిలాభగ్నములగును. భూతములకు దోడనే స్వేచ్ఛ యలవడును. దేవీ! చెప్పుటకు నోరాడదుగాని అట్టి భయంకరభూత మొకటి యరుదెంచి యుండును—సిద్దీ దాని

యధీనమై యుండును—భూతమేల కొంపోవలయునో—తలంపఁ జాలను— తలంచినంతమాత్రమున శరీర మాపాదమస్తకము వడంకుచున్నది.—"

భయవిహ్వలమై పరిచారిక నోటినుండి మాటవెలువడుట బహు కష్టసాధ్యముగనుండెను. కాని, వివిధాలోచనా బాధితయగు ప్రభుపత్ని తదాలాపము లాలించుటలేదు. భూతాదులను గేవలము విశ్వసింపని ప్రౌఢజ్ఞ కాకున్నను, అపార లౌకిక జ్ఞానము గలదగుటచే నామె అమీనావలె నా విపరీతము భూతప్రధానమని విశ్వసింపఁ జాలక కడుంగడు జింతింపఁ దొడంగెను. చిత్తమునం దనేకాలోచనలు వడివడి బాఱుచుండెను. ఆలోచించు గొలంది ఆమె మానసము దహించుకొని పోవుచుండెను. కావున, నమీనా యసంబద్ధాలాపము లామె వీనులఁ జొరలేదు. ఎంత యాలోచించినను సిద్దీ యంతర్హితుండగుట కెద్దియేని కారణముండ వలయుననియే తోఁప దొడంగెను. కాని, ఆకారణమెద్ది? కర్త ఎవ్వఁడు? అదియే దుర్గ్రాహ్యమై, తత్కారణమునఁ గడుంగడు బాధాకరమై యుండెను.

అమీనా యింకను భూతముల గాథలను దలఁచి తలఁచి ఏమేమియో ప్రలాపించుచుండెను. వృథాలోచనములతోఁ గాలహరణమొనరింపఁజాలని ఇస్మిల్లా దాసిని వారించి ఇట్టులనెను.

"అమీనా! నీపిచ్చి మాటలఁ జాలించి నాకు వస్త్రధారణ మొనరింపుము— పాపా ఇప్పుడే అరుదెంచు వాఁడు—ఈరహస్యమింక దాగనేరదుగదా—మనమప్రమత్తతతో సిద్ధముగ నుండవలయు—నీవు వెలవెలవాఱక నిశ్చలముగ నుండవలయు సుమా—"

"దేవీ! ముందీవైపరీత్యము గుఱించి నీయభిప్రాయ మేమియో తెల్పుము—నా యూహయే సమంజసముగదా?—"

అట్లు వదరు దాసిపై భావగర్భిత తీక్షణ వీక్షణము బఱపిఁ ప్రభు

పత్ని ఇట్టులనెను.—

"అమీనా! అట్టులైన, ధన్యులమే— దండించి యథార్థము జెప్పింపఁజాలు దిట్టరులకుఁ జిక్కకుండ వాఁడు నీవనునటులు నిక్కముగ భూతాధీనుఁడే యగునేని అదృష్ట— హా! పాషా యరుదెంచు వాఁడు! భద్రము!"

పాషా నిజముగనే ప్రవేశించెను. కృష్ణాంగులగు బానిస లిర్వురా వెంటనుండిరి. ఆతఁడిట్టు లనెను—

"ప్రాణప్రియా! నావెంట నరుదెంతువా? రేయి నీవు కాంచి యుండుటచే—"

ఆతని వారించి, తన మగని వంచింపఁజాలు సహజమోహన వీక్షణంబు బరపి, ఆమె యిట్టులనెను.—

"నిజము, నాథా! మసూరియొనరించినతప్పిదములఁగాంచియుం దును. వాఁడుసారాయి మైకముచే నుచిత సమాధాన మొసంగఁజాలక పోయెనేమోయని జాలివహించి, కొంత గడువొసంగ మంటిని. వాఁ డొకవేళదగిన సమాధాన మీయఁడేని, తగిన ఫలమనుభవించుగాక. వివేకవంతుఁడవుఁ న్యాయపరైక తత్పరుఁడవుఁ ఉచితదండన విధింతువు గాక— నేనొక్క పలుకైన నాడుదానఁగాను."

తన భార్య ఆతెఱంగునఁ బ్రశంసించినంతనే, ప్రభువు మానస ముప్పొంగెను.—

"ప్రేయసీ! పోదము, రమ్ము. అమీనా! యుక్తాయుక్తము లెఱింగినదానవు— నీవును రాఁదగును,— తన యన్నముదిను సేవకుల యెడల మీ ప్రభువెట్లు మెలంగునో చూతువుగాక. మసూరా సంతృప్తికరమగు సమాధాన మొసంగునేని, తప్పక మన్నింతునని నేనిదె బాసచేయువాఁడను. కానిఁ నా తాళము కానరాకుండుటకుఁ గారణ మేమియో చెప్పఁడేని, వాని కంఠముతోడనే చాపపాశాలంకృత

మగును!"

ప్రభుసేవకుఁడు నిక్కముగ నొక భయంకరపాశము దాల్చి యుండెను. పాషా సాభిప్రాయముగా నటు దిలకించి, తోడనే మొగ మలు తెర వంకఁబోయెను. అదియొక సాధారణ కృత్యమువలె నమినా మెలంగఁగోరి నిశ్చల చిత్తయై తానే యాతెర తెఱచి, ప్రభువునకు మార్గము చేసెను. మనసు మఱుఁగుపఱచి మెలంగు మిథ్యాప్రవర్తన మున నసాధారణధీశాలియగు నిస్మిల్లావదనము గాంతురేని, ఆమె దుర్భరహృదయ సంక్షోభము నెవ్వరు నరయఁ జాలరు.

పాషా యారహస్యద్వారము నతిక్రమించి, దర్పమొప్ప నడుచుచు సగర్వముగ నిట్టులనెను.— "నేనొనరించిన సమయము మఱవలేదు. దయార్ద్రచిత్తుఁడనై, న్యాయతత్పరుఁడనై గూడ నుండ, జాలుదు. భగవంతుని కృపాతిశయముచే నింతవఱకు నేనెవ్వరిని హింసించి యెఱుంగను— అనుచిత దాక్షిణ్యముగూడ వహించియెఱుంగను. నేనెల్లపుడు లోకోత్తర మధ్యపథం బనుగమింతును—కావుననే, నేను జనసందోహ శ్లాఘాపాత్రుఁడనైతి!"

"ప్రాణేశ్వరా! సందేహమేమి? వివేకోదార న్యాయగుణంబులకు నీవు కేవల మావర్శప్రాయుఁడవని లోకమంతయు నుతించును.

అట్లు పలుకు తన భార్యనుగాంచి పాషా మందహాస మొనరించెను. సిద్దీని బంధించిన చెఱ యంతలో సమీపించుటచే నాతఁడట నిలిచి యాజ్ఞాపింప, నొక సేవకుఁడు బిఱానఁబోయి, ఆ కారగడియ దీసి, తలుపుద్రోసెను. సిద్దీయవ్వలకు రాకుండుటచే, పాషా యిట్లు సంబోధించెను.—

"మన్సూా! వెలికి రమ్మా! నీప్రభునకేమి సమాధాన మిత్తువో చెప్పుము."

"ఔను. ఆలసింపకుము! ఈసారి నన్నెంత దైన్యముగఁ జూచినను

నిరర్థకముసుమా!"

ఇస్మిల్డా యట్లు హెచ్చరింప, అమీనా మెల్లగ— వారందఱకు వినఁబడునట్టులే— నిట్టులనెను.— "విశ్వాసహీనుఁడు! రాఁడేమి? వచ్చి, పూజ్యుఁడగు ప్రభుపాదములపైఁ బడఁడేమి?"

"ఏమీ! ఈ సేవకాధముఁడు— ఈశ్వానము— రాఁడేమి? ఎంతటి మొండితనము! ఇంత నిర్లక్ష్యమా! నన్నింతగ బరాభవించునే! మఱియొక క్షణ మాలసించునేని, ఏమి చేయింతునో చూడుడు! ఆరే, మస్రూ! తత్క్షణము రావలయు!"

క్రుద్ధుఁడై పాషా యట్లు గర్జించినను, సిద్దీ బయల్పడఁడాయెను! ఎట్లు బయల్పడును? వాఁడందుండినగదా, బయల్పడుట! అజ్ఞుఁడగు పాషా ఎంత ఆగ్రహించినను, ఎంత గర్జించినను, ఎంత ఆజ్ఞాపించినను, ప్రయోజనమేమి? ఇఁక నాతఁడు సహింపజాలక, తన కింకరుల నుద్దేశించి, రయంబునఁ బాఱి యాదురాత్ము నీడ్చికొని రావలయునని సక్రోధముగ నాజ్ఞాపించెను.

సేవకులు శరవేగమునఁ బోయిరి. కాని, వారు సత్వరము సిద్దీని ముందు కీడ్చుటకుమాఱుగ విమూఢవిస్మయాతిరేకమున డిల్లవడి యుండుటగాంచి, పాషా కృపాణధారియై రయంబున నందుఁ జొచ్చెను ఆతఁడును వారివలెనే విపరీత సంభ్రమాకులుండాయెను. పాపమా ప్రభువట్టి ఆఱిచ్చపాటెన్నఁడెఱుంగఁడు. తదవస్థ కడువిపరీతముగ, అభూతముగ, కడుంగడు హాస్యాస్పదముగ, కేవలము వర్ణనాతీతముగ నుండెను. నిజకరవాలము చేతినుండిజాఱ, ఆకర్ణాంత విశాలాయిత వక్త్రుఁడై, విశాలతర నయనుఁడై, శూన్యవీక్షణుఁడై దత్తబను పాషా వాగ్బంధితుఁడై యుంటఁగాంచి, ఇస్మిల్డా అమీనాలు ఏమియు నెఱుంగనివారివోలె దారును జయ్యనందుఁజొరఁబడిరి. తదవసరోచిత దురంత విస్మయసూచకముగా నిస్మిల్డా ఇట్టులఱచెను.— "ఆహా!

ఇయ్యది భూతప్రభావము కావలయు!"

దేవికిఁదగు దాసియగు సమీనా "ఆ! దుష్టభూతము!" అని తాళము వైచెను.

"కాదు— మహాద్రోహము!" అని పాషా భయంకరజలధరము భాతి గర్జించి, జారిన కైదువు తటాలునఁజేఁబూని, రోషభీషణాకారుఁడై గహ్వరమునుండి వెలువడు వ్యాఘ్రమువలె బయటకు వచ్చెను. ఆతని భుజాదండము నల్లనఁబట్టి వెనువెంట వడివడినడచుచు నిస్త్రీల్గా ఇట్టులనెను. "ప్రాణనాథా! ఏమంటివి? ద్రోహమా! ఎవ్వరు? ఎవరిని అనుమానింతువు? ఏమని యనుమానింతువు?"

ఆప్రశ్నములు వీనులఁ బడినంతనే పాషా కృతస్మారకుఁడై, చటుకున నిలిచి, సంభ్రమావేశమున మందుని పగిది దిలకించుచు నిట్టులనుకొనెను.— "దైవమా! ఎవ్వరో నరించియుందురో ఏమియుఁదోఁప కున్నది!"

పాషా మఱి మాటాడలేదు. తోడనేఁ ఆ మెట్లు డిగ్గి, ఆరామ ద్వారము భద్రముగ బంధీకృతమై యుంటఁగాంచి సంతసించి, ఈ రహస్య మన్యులకుఁ దెలియరాగని సేవకులను హెచ్చరించి పాషా పంపివైచెను. గాంభీరాననయై చెంతనుండిన పత్ని నాథుని వదనము నరయుచునే యుండెను. తాను భయానుమానబాధితయై యుండవలసిన యవసరము లేదని ఆమె గ్రహించెను. మఱియు నే యనుమానమున కవసరములేని విధంబున పాషాయే ఇట్టు లనెను.—"మత్ప్రియపత్నీ! ఈయుదంతము దుర్గ్రాహ్యమై, కడు బాధాకరముగ నున్నది. కాని, మన ధనము సురక్షితముగ నున్నదో లేదో అరయుదము రమ్ము."

పాషా తోడనే మఱితలుపు సడలించి అవనతశరీరుఁడై తద్గుహాంతర్భాగములం దిలకింపఁ దొడంగెను. అట్టి మహాముహూర్తమునసే తన నాథునందుఁ బడఁద్రోసి ఆజారిణి హాయిగనుండ నాసించినను,

సాధ్యముగాకపోయెను. ఒక్కనిముసము క్రిందటనే ఆస్థలంబునుండి వెడలిన బానిస లిర్వురును ప్రభ్వీప్రభువులను గాంచియుండిరి. కావున, పాపా ఆకస్మికముగ నంతరించునేని, ఆతని కాంత అనుమానము నకుఁ దప్పక పాల్పడును. ఆకారణముననే, ఇస్మిల్డా దురాలోచనా యత్తచిత్తయయ్యు, సాహసింపఁజాలక, మిన్నకుండెను. మఱియు, ఆసేవకు లిరువురే ఆమె యధీనులు గారని మన మెఱుంగవలయును.

"మన నిక్షేపము సురక్షితము!" అట్లుపలుకు పాపా లేచి తద్రహస్యకవాటము యథావిధంబున నమర్చి బిగ్గఱగనే ఇట్టు లను కొనెను—"మస్రూ ఇట్లు మాయమగుట కొక్కటే కారణము కావలయును. ఈయువకులు—ముఖ్యముగా నిరువురు—విడిసియున్న మందిరకుడ్యములు రహస్యకవాట నిర్మితములై—"

ఆ పలుకులు వీనులం బడినంతనే ప్రభుపత్ని మిన్నకుండఁజాలక పోయెను. ప్రభువు తద్విషయపరిశీలనమునకుఁ గడంగినచోఁ దన గుట్టు బట్టబయలగునను భయము హృదయమును దహింప, నాకామిని నాథుని వారించి రయంబున నిట్టు లనెను.—"మఱియు, నాథా! మస్రూను విడిచిపుచ్చుట వారి కేటిప్రయోజనము?"

"నిజము; ఈయువకులందఱును సత్పురుషులు, ధైర్యశాలులు, ఉదారమనస్కులు—"

"సందేహమేమి! ప్రభూ! కావున, గతవైపరీత్యముగుఱించియిఁక సంస్మరింపవలదని ప్రార్థించుదాన; తదాలోచనంబున బాధనొందక, పూర్తిగ మఱచిపొండు."

కాని, దత్తబనుపాపా ఇతికర్తవ్యతావిమూఢునివోలెఁ గాన్పిం చెను; ఏమన, జరిగిన యుదంత మాతని విచారవిహ్వలస్వాంతు నొన రించెను. అంత, ప్రభుపత్ని యుక్తిప్రాగల్భ్యములు ద్విగుణమై దశాధిక మాయెను. ఆకామిని సహజమందహాసమంజులాలాపాది సరసంపుఁ

జెద్యములం గూడ బ్రయోగించి ఆధీరు నధీరస్వాంతు నొనరించెను. తత్తీవ్రాలోచనాభరం బుడుగు వినోదంబున బ్రొద్దుపుచ్చవలయునని ఆమె హితము గఱపెను. ఎట్టులైనను తురుష్కయువకునితో రయంబున మాటాడనెంచి ఆబోటి ఖాలిలాదియువకులుగూడ బాల్గొనఁగల వినోదములనే సూచించెను. తుద కామె నౌకావిహారము బేర్కొనెను. తన మందిరమునఁ దానుండగనే సంభవమైన విపరీతరహస్యము భేదింప సమకట్టియు, తానేమిచేయవలయునో నిర్ణయింపనేరక, పాషా సమ్మతించెను.

పాషా యంతట దనకెంతయు విశ్వసనీయుఁడగు సేవకుని ధనాగారమునఁ గాఁపుంచి నిజభార్యాసహితముగా నాప్రదేశము వీడెను. మస్రూ స్థానమునఁ గావలియున్న భటుఁడు ఇస్మిల్లా యధీనుఁడు గాఁడని పాఠకులు గమనింతురుగాక.

## ౨౨

### జలవిహారము

జలవిహారమునకు వలయు సన్నాహములు చయ్యన నాయత్తమాయెను. బంధీకృత యువజనమందిరములు యథావిధమునఁ దెఱచుటకై పాషా వడివడిఁబోయెను. దుర్గ్రాహ్యమగు నిజసేవ కాంతర్ధానము గుఱించి చింతింపుచు వేఱు ప్రపంచమెఱుఁగని మేటి ప్రభువు జూలియను లూకాసు లోకరి మందిరమున నింకొకరుండుట గుర్తింపఁజాలకపోయెను.

ఆసనాగారము జేరినంతనే, పాషా యిట్టులనెను.—“ మిత్రులారా! భాస్వరసుజలవిహారణార్థము మేము బయలుదేఱి నున్నారము.

మీరును రావలయు. మీయునికివలన మద్గృహము కళంకితము గాకుండ నింత కాలమెట్లు మెలంగితిమో, ఇప్పుడు నట్టులే మెలంగ వలయు, మీతో బహిరంగముగ బాంధవ్యము నెఱపువఱకు నిట్టి మిథ్యాప్రవర్తనము తప్పదు గదా. మాతోం బాటు మీరును నౌకారోహణ మొనరింతురేని, మనవలెనే వినోదార్థము జలరాశిపై విహారము సల్పు నాయూజనులందఱు నవహసింతురు. కావున, మీరు పాణిద్వారంబున వెలువడి, ఒక్కింత దవ్వుగఁబోయి, తీరమున వేచి యుండుఁడు. మే మచిరకాలమున నరుదెంచి మిమ్ము నావపైఁ జేర్పఁ గలము. ఒరులపుడు చూచినను, నష్టము లేదు."

ఖాలీలాదులు సమ్మతింపఁ పాషా నిష్క్రమించెను. ఉదయభోజన మారగించి మిత్రులు మువ్వురు పాణిద్వారమునుండియే మందిరము వీడి, ఖాలీలుఁడు విసరిన గుండుపడిన స్థలమునకు నడుమ నున్న క్షేత్రము ప్రవేశించిరి. తోడనే, తురుష్కయువకుఁ డిట్టులనెను.—

"మిత్రులారా! నాకు రెండు నిముసములు గడువొసంగుఁడు. నన్నేమియుఁ బ్రశ్నింపవలదు. నాచర్య లొకప్పుడు నిగూఢములై యుండునని యెఱుంగుదురు గదా—ఐనను, నాయూహ సత్ఫలంబు ననే పోవుననియు మీ రెఱుంగుదురు. మీరు మెల్లగ సాగుఁడు, మీరు పాషా నౌకారూఢులగు స్థలంబు జేరకమున్నె కలసికొందును."

ఖాలీలు, స్వభావము నెఱింగి విధేయులై వర్తించుట కలవడిన గ్రీకు యువకులు సహజముగా సమ్మతించి మందగమనంబునఁ బోసాగిరి. ఖాలీలుఁ డచటనే నిలిచి, తన మిత్రులు దృష్టి పాతమునకు వెలియై నంతనే తత్సమీపవనము రయమున జొచ్చి వడిగాఁ బోయెను. ఆసమయమున నాతోఁపు కొనయందలి వృక్షపంక్తియందుఁ గల కల శబ్దమాయెను—ఎవ్వరో తక్కుచునడచిన సవడియైకూడనాయెను. తత్క్షణ మొకవ్యక్తియు గోచరించెను. ఆవ్యక్తి ఖాలీలుని పరిచారకుఁ డగు

సదకుఁడే!

తన సేవకుఁడేలకో దైన్యముగనుండెనని ఖలీలుఁడు చూచినంతనే గుర్తించెను. సదకుఁడు తన స్వామిని గాంచినంతనే యథోచిత వినయపూరిత ప్రణామ మాచరించెను. వాని వదన మింకనూ అట్టులే డిల్లవడి భయాక్రాంతమై యుండెను —

"సదకా! దుర్వార్తాపూర్వహుఁడవై యరుదెంచితివా యేమి? మదీయజనకుఁడు—సోదరులు—"

దుర్భరాందోళన విహ్వలాయమాన మానసుఁడై యాపగిది వడివడి ప్రశ్నించు ఖలీలుని వారించి సదకుఁ డిట్టులనెను.—

"దేవా! వారలంకఱు క్షేమమె. కాని—"

"ఏమో సత్వర మెఱిఁగింపుము! ఇంత యాలస్యమేల? కలవర మేల? విషయ మపథ్యముగ నుండిన నుండుగాక—అంతమాత్రమున నిన్నెన్నడైన హింసించి యుంటినా?"

"దయామయా!" అని యమందవినయాభిమానపూరిత స్వరంబున సంబోధించి, మోఁకరించి, సదకుఁ డిట్టులనెను.—

ప్రభువతంశమా! నీవు సదాదయామయుండవు. ఐనను, నీవు సహింపనేరని వైపరీత్యము సంభవమాయెను—దేవా—ఆసిద్దీ—?

"మఖ్రూ! ఆఁ—వాఁడాదుర్గమున బంధితుఁడై యుండలేదా?"

పరిచారకుఁడు నోరు విచ్చి మాటాడజాలకఁ ఇట్లు గొణఁగెను.—

"దేవా! అట్టులైన, నాకింత భయంబేల? వాఁడు తప్పించుకొనెను."

ఆగ్రహాధికమున వదనమెఱ్ఱబాఱ తురుష్కయువకుఁ డిట్టులనెను.

"ఓరీ సేవకా! ఇందులకు నీప్రమత్తతయే కారణమగునేని—"

"దేవా! రక్షింపుము! అల్లా యెఱుంగు—ఇందు నానేర మేమియు లేదు. కరుణాసముద్రుండగు ప్రభునాజ్ఞ నాప్రాణములైన

లెక్కసేయక నిర్వర్తింతు గాని, అన్యథాప్రవర్తింపఁ గలనా? "

"సదకా! నీవు నిక్కముగ ప్రభు విశ్వాసార్హుఁడవు—నే నెఱుం గుదు. లెమ్ము. ఈ వైపరీత్య మెట్టు లాయెనో సవిస్తరముగఁ దెల్పుము."

"దేవా! నేనును నాతోడి బానిసలును మప్రూను జుట్టి పోవు చుంటిమి. వాఁడు దృఢపాశబద్ధుఁడై యుండెనని యెంచి మే మెల్ల రము నిర్భయముగ నుంటిమి. కొంత దవ్వరిగిన యనంతర మాకస్మి కముగ వాఁ డాపగ్గములను పుటుక్కునఁ ద్రెంపివైచి, ప్రమాదవశ మున నాపథంబునఁ బడియున్న పెనుబడియం జేఁబూనెను. ఆముహూ ర్తముననే, మాకరవాలములు సారించితిమి. కాని, మాప్రయత్నము వ్యర్థమాయెను. ఆసైతాను సహస్రభూతబలాఢ్యునివోలె విజృం భించి మాపైఁబడెను. క్షణమాత్ర కాలమున నాసహచరులందఱు దురంత దండ తాడనంబుల మూర్ఛిల్లిరి. నేనును క్రూరమగు నీదెబ్బ తినక తప్పినదికాదు."

అట్లు పలుకు సదకుఁడు తన కపాలమునఁ గుడి కణతపైఁ దగిలిన ఘోరఘాతముంజూపెను. మిగిలిన సేవకు లేమైరని ప్రశ్నింప, వాఁడు మగుడ నిట్లు పలికెను.—

"మూర్ఛిల్లిన మేమందరము దెప్పిరిల్లినంతనే రాజధానికిఁబోయి, నగర రక్షకాధికారులకా విషయముదెలిపి,తోడనే, మేము వర్ణించిన సిద్దీ యెచ్చట గోచరించినను బట్టుటకై చారులను నలుదిక్కుల సత్వ రమంప వలయునని చెప్పితిమి. ఆ కార్యమట్టులగుడు, మఱేమైన నవ సరముండునని నీకడకరుదెంచితిమి. దేవా! ఏమి సెలవు?"

సేవకా! ప్రమత్తుండవై యుంటివని నిన్ను నిందింపకున్నను, పంద వని యనకుండుట మాత్రము అసాధ్యముగనున్నది. ఏమి! నిశితకర వాల ధారులగు నల్వురు కేవలమొక దండమాత్ర సాహాయ్యున

కొడుటయా? కేవలమభూతముగ నున్నది. ఇంత మాత్రమున నాగ్ర హింపనుగాని, మీ రెంతటి యకార్య మొనరించితిరో యెఱుంగను. మస్రూ పట్టువడుట ఎంత యవసరమో నీకుఁ దెలియదు. వానిపై మహత్తరకార్య భారమెంతయు నాధారపడియున్నది. నేడు గాదేని, వానినెల్లిగాంచి ప్రశ్నించి అరయఁగల విశేషముల నరసి కార్యము నకుఁ గడంగ వలయునని ఆశించి యుంటి. కాని, మీకతంబున నెంతేని యాలస్యమగు——"

తీవ్రాలోచనాబాధితుం డగు ఖాలీలుఁడు వాక్యము పూరింపక మిన్నకుండ, నదకుఁ డిట్లు ప్రశ్నించెను——"దేవా! ఇపుడేమి చేయ వలయునో ఆనతిండు."

"ఆసిద్దీనిఁ గాంచవలయు నగరరక్షక వర్గమున కెఱింగించితినంటివి. కాని, వాఁడు నగరము జొరకుండ నెందేని పోయెనేమో?"

"దేవా! నే నీవిషయమున జాగరూకుఁడనై యుంటిని. వానిం బట్టి యుంచుటకు నెద్దియేని మహత్తరకారణముండునని యెంచి, నగరమునందే గాక తత్పరిసరములం గూడ శోధింపవలయునని నియో గించితిని. ఆముహూర్తముననే చారు లశ్వారూఢులై నలువంకల బోయిరి."

"నీ వొనరించిన నేరమున కిది యొకింత పరిహారము; కాన, నిన్ను క్షమించితి. కాని, ఈకార్య మతిరహస్యముగ నుండవలయు నని చెప్పితివా?"

"చెప్పితి, దేవా, ఈకార్యభారము వహించిన వారు కదీస్కారుని భటులు కారు. ప్రత్యేక దళమును నియోగించితి."

"మంచిది. నీప్రవర్తన మీయెడ శ్లాఘాపాత్రము. మస్రూను బంధించుటెంతయు నావశ్యకము. నా కీసమాచారము రేయి తెలియ వలయు" ఆతఁడు తోడనే మగుడ నిట్టులనెను. "మందు లంగడికిఁ

బోయి, ఇందున్న వస్తువులం గొనుము. నీవీ రేయి మగుడరావలయు.''

ఖాలీలుఁడొసంగిన చీటినందుకొని వాఁడు సవినయముగఁ బ్రణమిల్లెను. తురుష్కయువకుఁడు తత్క్షణ మాప్రదేశమునుండి మఱలి, తన గ్రీకు మిత్రులను గలయుటకై శీఘ్రగమనమునఁ బోసాగెను. సకుటుంబముగ దల్తబనుపే పాషా యాసీనుఁడైన నౌక యాతనికి గోచరమాయెను. చేజిక్కిన మస్రూ ఆపగిది జేఁదప్పుటచే నాతని వదనము చీకాకువడి యుండెను. కాని, గ్రీకులు సమీపస్థులగుచుండుటచే నిజహృదయాందోళన మడంచి, ఖాలీలుఁడు ప్రసన్నవదనుఁ డాయెను. మఱియొక నిమిషమునఁదన మిత్రుల నాతఁడు గలసికొనెను. ఆ ముహూర్తమునసే పాషా తరణి మనోహరంబుగఁదిరిగి వారిని డాసెను.

సువర్ణమయమై మనోహరమైయుప్ప పచ్చని పట్టుచాందిని క్రింద పాషా మొదలగు వారాసీనులై మొగములు కెక్కియల నానియుండిరి. ఇస్మిల్లా, తైరజా, గుల్నేరు జులేఖాల వదనములు వసనాచ్ఛాదితములై అన్యుల కగోచరములై యుండెను. కడుమనోహరముగ నలంకృతమైన యానౌకను దృఢగాత్రులగు బానిస లార్వురు నడుపుచుండిరి. నావ నిలిచినంతనే, ఖాలీలాదులు తమకై యమరిన స్థలంబుల నాసీనులైరి. కావున, ఆయువకులు తమతమ యువతులతో ముచ్చటించు నవకాశము లేకపోయెను.

పాషా నౌక చల్లగఁ బోసాగెను. అట్టినౌక లనేకములందందు నడుచుచుండెను. కొన్నిటినుండి మనోహర గానసుధారసము వెలువడుచుండెను. దల్తబను పాషా నిక్కంపు మహమ్మదీయ తత్వజ్ఞునివలె, నిజపరిచారకాంతర్ధానకారణోద్భూత సంక్షోభము నీ సమయమునఁ బూర్తిగ మరచి, నిశ్చలముగ నుండెను. తన మగడా విషయములం దలంపక నిశ్చలాత్ముఁడై యుండుట ఇస్మిల్లాకు నెంతయు వాంఛనీయము. కాన నాపడఁతి తన నాథునితో ననేక సరససంభాషణం

బులు సలుపదొడంగెను.

నౌక యొకగంట యానమొనరించి అవ్వలితీరము సమీపించెను. ఆప్రదేశము మిగుల మనోహరమై వర్ణనాతీతముగనుండెను. మున్నెన్నఁడు గాంచని ఖాలీలాది యువకు లమందానంద దీపిత వదనులై ప్రశంసించిరి. పాషా ప్రసన్నచిత్తుఁడగుటచే నౌకాతీరమునకు మఱియు దగ్గఱగఁ బోవలయునని ఆజ్ఞాపించెను. ఖాలీలాదులు మఱియు ముదమందిరి. ఆ దృశ్యము నిరుపమాన సౌందర్య వైభవసమన్వితమై యుండెను. నానావిధ వృక్షనిలయములగు నారామములు వాలుగ నీటివఱకు విస్తరిల్లి నయనపర్వ మొనరించుచుండెను. భోగపరాయణులగు మహమ్మదీయ ప్రభువుల కేర్పడిన ఆరామగృహములు, క్రీడామందిరములు, వినోదమండపములును నిరుపమాన సౌందర్య వైభవముతో నలరారుచుండెను ఆ దృశ్యము నిక్కముగ రమణీయముగనుండెను. మనోహర హరితవర్ణరాజితములగు తరుపత్రములు సముజ్వలసూర్యాతపము కతంబున సుందరతర గాఢతరరాగమున నొప్పారెను. తదంతరఫలములు సువర్ణమాణిక్యములవలె మెరయుచుండెను. చంద్రకాంత శిలానిర్మిత జలస్తంభములు స్ఫటికజలంబుల మనోహరముగ నెగజిమ్ముచుండెను. మఱియు, ప్రకాశమాన శిలామార్గంబులు, నవవికసితకుసుమగుళుచ్ఛ విరాజితారామములు, ప్రకాశమాన ధవళసౌధములు, తన్మందిరవిరచితసుందర చిత్తరములు, తచ్ఛిఖరాలంకృత స్వర్ణ మయబాల చంద్రులును దర్శనీయములై వర్ణనాతీతములై యుండెను.

పాషానౌక యంతనొక చిన్ననదీ ముఖంబునఁబడి, నానావిధ వృక్షసంకీర్ణములగునారామములుపెక్కింటిని జుట్టిచుట్టితజ్జలములుప్రభవించు ప్రదేశము సమీపింపఁ జొచ్చెను. ఆచుట్టును రుమేలియా దేశపు వనములు దట్టముగఁ బెరిగి యుండెను. ఏఁబది గజములు వెడ

ల్పుగల ఆప్రవాహము క్రమముగా మఱియు మఱియు సన్నగిలెను. ఇరు కెలంకులనుండు సమున్నత సుందరభవనములగాంచి, అనిర్వాచనీయ ప్రకృతి సౌందర్యమున కలరి, నారంగాది ఫలవృక్ష నిలయమై శీతల తరమై యొప్పుతావున దర్తుబను పాషా తన పడవ నాపించెను. పడవవాండ్రు తోడనే నేలకుడిగ్గి యానౌకను ఆసమీప వృక్షమునకుఁ గట్టిరి. అనంతరమా సేవకులు వివిధరుచిర ఫలాహారములను ప్రభువు ముంగల బెట్టిరి.

కాంతలును ఖాలీలాదియువకులునుగూడ చల్లని పర్బతు తొలు దొల్త ద్రావఁబోయిరి. పాషాయటుగాక ప్రసిద్ధమగు ఫ్రెంచి మధువు సేవించి సేద దీఱెను.

ఖాలీలుఁడు పర్బతు త్రావఁబోవు సమయమున మోమెత్తి పరికింప, నెదుటంగల పొదలచాటున నెద్దియో సవ్వడి ఆయెను. విస్మయాతిరేకమున నాతఁడు 'హా' యని, పానపాత్రము నట్టె పోఁద్రోచి నౌకనుండి తత్క్షణము లంఘించి, ఆ పొదలయందుఁ బడి అదృశ్యుఁడాయెను. ఏమియు నెఱుంగని పాషా మొదలగువారు సంభ్రమాశ్చర్య మగ్నమానసులై పరస్పర ముఖవిలోకన మొనరించిరి.

ఆ తెఱంగున మాయమైన ఖలీలుఁడు కృపాణధారియై అనిమిష నయనుఁడై వడివడి నందందుఁ బరిభ్రమింపఁ దొడంగెను. అతఁడు వెదుకబోయిన పదార్థము చిక్కినట్లు కానరాదు. అతని వదనము గాంతుమేని, ఆగ్రహాధీనమై తీక్ష్ణముగ నుండెను. అన్వేషణా కార్య నిమగ్నుఁడైన ఖాలీలుఁ డాకస్మికముగా నొక వింతరంగము బ్రవేశించెను.

అచటి ప్రదేశములలో నొండు సాంద్రతరు గుల్మలతాపరివృతమై యుండెను. తదంత రారామము రెండువందల గజములు వెడల్పు గలిగి యుండెను. వివిధగాఢతరవర్ణములతో నలరారు పూలచెట్లు

చక్కగ వరుసలు తీర్చియుండెను. చంద్రకాంత జలయంత్రంబుల నుండి వెలువడు నవిరళ విమలతోయములు మనోహరముగ నృత్యము సల్పుచుండెను. పక్షిజాతిలోనెల్ల సుందరతమంబులగు మయూరములు వివిధవర్ణ విరాజితములై వైభవనిలయములై యొప్పు పింఛములు విప్పి సగర్వముగఁ దిరుగాడుచుండెను. శుకరాజములు లెక్కకు మీఱి వృక్షశాఖల నలంకరించియుండెను. కాని, ఇయ్యవి తదారామమున కెంత భూషణప్రాయముగ నున్నను, నీరసముగనే యుండెను. ఏమన, మనోహర రూపవైభవ సముజ్వల నారీజనులాసీమనడుమ గూడియుండిరి. కొందఱు మోహనాంగు లొయ్యారముగ సోఫాలపై సుఖాసీనలై యుండిరి. కొందరు కోమలాంగులు జలస్తంభము జుట్టును మెఱుఁగుఁ దీగలవలె దిరుగాడుచుండిరి. అందఱును జవరాండ్రు; అద్భుత సౌందర్య విరాజితలు. పురుషు లరుదెంతురను భయంబెఱుంగక, ఆమచ్చెకంటులు తమ మేలిముసుంగుల ద్రోసివైచి మేఘనిర్ముక్త పూర్ణసుధాకర బింబములవలె దీపించుచుండిరి. వారి యసాధారణ వేషము గాంచునంతనే, వారొక అమితాధికార ధనవంతుని యంతఃపుర కామినీ జనంబులు గావలయునని తప్పక తెలియును.

అట్టి తావున ఖలీలుఁ డాకస్మికముగ దోఁచినంతనే, ఆ జవరాండ్రు సంభ్రమ పరవశలై నిజవదనాచ్ఛాదన మొనరించుట మఱచి నిమేషరహితసురాంగనలవోలె నట్టె వీక్షింపఁదొడంగిరి. కొంత తడవైన వెనుక తదుద్రేకము చల్లారినను, ఆ మోహనాంగులు తమ వీక్షణములు మఱలింపరైరి; సుందరాననంబులు మఱుగుపఱుపరైరి. ఏమన తురుష్కయువకుఁ డసామాన్య సౌందర్యవంతుఁడు గదా: తమ వదనము లట్టి నవమోహనాకారుని నయనములకు గుఱియగుట వారి కెంతయు సహజామోదకరంబుగనే యుండెను.

వారిని గాంచినంతనే ఖాలీలుఁడు సహజముగ వెఱగంది, ఒక్క నిముసమట్లు నిలిచిపోయెను. అంతలో నొక తట్టు దట్టంపు బొదల చాటున సవ్వడిఅయెను. ఆతఁడు తోడనే తెలివొంది, నిజకరవాలము మెఱుపువలె మెఱయ మెఱుపువలెనే అదృశ్యుఁడాయెను. భయ సంభ్రమాకులంబున నా యంగనలు కెవ్వన నఱచిరి. సునిశితకృపాణము దాల్చిన ఆ వీరుఁడట్లు వాయువేగమున బరుగిడుట చూడ, నెద్దియేని భయంకరకార్య మొండు దలపెట్టినట్లు స్పష్టమాయెను. వారి భయంబున కయ్యదె కారణము.

ఖలీలుఁ డెవ్వనినో వెన్నాడుచుండెనని పాఠకులు గ్రహించి యుందురు. చాపనిర్ముక్తబాణమువలె నాతఁడు పరుగిడుచుండెను. ఆ ప్రదేశము బాస్వరసు వంక వాలి యుండెను. ఖలీలుఁడు మస్రూ వెంటఁ బాఱుచుండెను. ఆతఁడు నౌకపై నిష్టజనపరివృతుఁడై విందారగింప నుండు సమయమున వాని భయంకరాకృతియే పొదల సందునఁ దోఁచెను. కావుననే, ఖాలీలుఁడా మధురపానీయము విసరివైచి తన మిత్రులఁ జూడనైనఁ జూడక వాయుగమనమున వెన్నాడఁ దొడంగెను.

మస్రూ బహుసూలకాయుఁడయ్యు నతి లాఘవముగఁ బరుగిడు చుండెను. కాని ఖలీలుడు శీఘ్రతరంబుగఁ బరుగిడుచుండెను. ఆవీరుని చరణములు భూమిపైఁ బడుట కానరాకుండెను. క్రమముగా నాతఁడు మస్రూను సమీపించుచుండెను. వారి నడుమనుండు దూరముక్షణ క్షణము క్షయమగుచుండెను. కాని, ఆ దురాత్ముఁడు బాస్వరసు వంకకే పోవుచుండెను. వాఁడు ఖలీలుని ఖడ్గధారకు జిక్కఁడేని ఆయ గాధజలంబులం బడును గాఁబోలు ?

“ఓరీ దుష్టసేవకా! నిలు, నిలు ! లేదేని, మదీయ కరవాలమునఁ దెగనఱికెద !”

ఖాలీలుఁడట్లు కఠినముగఁ బలికినను, వాఁడు సరకుసేయక పాఱి

పాతి నీరముడాసి యందు గుభాలునఁ బడెను! ఇఁక ఖలీలుఁడేమి చేయవలయును? ఆతఁడు తోడనే నిలిచి, తానును జలంబులఁ జొచ్చి వానిని వెన్నాడవలయునని నిశ్చయించి, ఆయుధము బాఱవైచి, నీట మునిఁగిన సిద్దీ యెచట తేలునోయని అనిమిషనయనుఁడై వీక్షింపఁ దొడంగెను. కాని, క్షణములు నిముసములాయెను; నిముసములొక్కొకటి కడచుచుండెను. సిద్దీ మాత్రము కానరాకుండెను—"సిద్దీ ఏమాయె? కలఁగిన జలములు తొంటి నిశ్చలత వహించెను! చాల నిమిషములాయెనే! కాదు— ఈదురాత్ముఁడు నీట దుముకు సమయమున తజ్జలాంతర శిలాఘటిత శిరస్కుఁడై మరణించియుండును: మునింగి, పైకెగయఁ జాలక చచ్చియుండును."

ఖాలీలుఁడట్లు చింతింపుచుఁ తదేకధ్యానమునఁ దీరమున నిలిచియుండెను. అట్లు పది నిమిషములాయెను. సిద్దీ కానరాకుండెను. ఆ జలభాగమున నొక్క అలయైనను, మఱెట్టిచలనమైనను లేక నిశ్చలముగనే యుండెను. కాన వాఁడు సజీవుఁడై, జలములోని మృత్యువుతోఁ బోరాడుచుండెనని భావించుటకైనను అవకాశము లేకుండెను.

ఖాలీలుఁ డాకారణమున, పాఱవైచిన ఖడ్గము మగుడఁ జేఁబూని మెల్లగ నడువఁ దొడంగెను. ఆతఁడు మోమెత్తి చూచినంతనే ఆయుధపాణులగు నిరువదిమంది తనపై వడివడి నరుదెంచుట కాన్పించెను. ఒక్కఁడుదప్ప మిగిలిన వారందఱు సేవకులవలె బానిసలవలె నుండిరి. ఆ పురుషుఁడు వారి ప్రభువు గావలయు. వాని సహజసుస్థిర గాంభీర్యమట్టులేయుండెను. వాని వదనము దుర్భరాగ్రహానలతప్తమై, అరుణమై, దుర్నిరీక్ష్యమై యుండెను. కారణమేమన, నిజకామినీ జన విహారారామము జొర సాహసించిన మన వీరుని భయంకరముగ శిక్షింపవలయునని యాతఁడు దుర్భరక్రోధ ఘూర్ణితమానసుఁడై యరుదెంచుచుండెను.

ఐనను, ఖలీలుఁడు సహజ నిశ్చల గాంభీర్యధుర్యుఁడై వారిని డాయఁ బోయెను. ఖడ్గమొరయందే యుండెను. వారలు సమీపింప, దౌర్జన్య నిరసన సూచకముగాఁ జేయిద్రిప్పి, నిశ్చలస్వరమున ఖాలీలుఁడు విస్పష్టముగ నిట్టులనెను—"అనాలోచనముగా నపరాధ మొనరించితిని—సమాధానమొసంగెదను. నేను మాటాడు మహనీయు లెవ్వరో యెఱుంగఁ గోరెదను."

అట్లు పలుకు ఖాలీలుని మేటి గాంభీర్యముగాంచి, ఆ ప్రభువు చకితుఁడై నిలచిపోయెను. ఆతని యనుచరులుగూడ నట్టులే నిలిచిరి. అతఁ డిట్లు పలికెను.—

"నేను రామీపాషానని యెఱుంగుము. ఇఁక నీ సమాధానమేమియో చెప్పుము—ఏమిచెప్పినను నిరర్థకమె..."

"ప్రభువరా! నీనామము సుప్రసిద్ధము. మేటి రాజనీతిజ్ఞుఁడవనియు, దృఢతమస్వామి భక్తిపరాయణుఁడవనియు బేరొంది యుంటివి. ప్రభూ! మానౌక అల్లదె. మిత్రులతోఁ బాటు ఆస్థలమున నిలిచి పరస్పర సంభాషణం బొనరింపుచు విందు లారగింప నుంటిమి, ఆసమయమున, విడువడిన దుష్టకంటకుఁ డాకస్మికముగ నాకంటఁబడెను. తోడనే వానిని వెన్నాడఁ దొడంగి, ప్రమాదవశమున భవదీయ కాంతాజనంబులుండు తావుజొచ్చితిని. కాని, నేనందు నిలుచుటకు గాని వారి సౌందర్యము గాంచుటకుగాని అవకాశమే లేకపోయెను. ఆ దురాత్ముని వెనువెంటనే రయమునఁ బాఱితిని. వాఁడా జలంబులఁబడి మరణించెను.

"నీ యుదంతము సత్యముకానోపు. నీవొక సిద్దీని వెన్నాడుట మేము కాంచియుంటిమి. ఐనను, నీ యాగమనమంత మాత్రమున సమంజసము కానేరదు. యువకుఁడా! నీవెవరవు? పాషా యట్లుపలుక, ఖలీలుఁ డిట్టులనెను.—

"పాషా; నీశ్రవణమున నొక్క పలుకాడెద. దాన ప్రశ్నో త్తరావసరము తీఱును."

తురుష్కయువకుని సరసగాంభీర్యము మనోధైర్యము ఆత్మవిశ్వాసమునుగాంచి విస్మితుఁడై పాషా ఆతని చెంతకుఁ బోయెను. అనుచరులు నిలచిన తావున నట్టె నిలచి యుండిరి.

ఖాలీలుఁడంత నేమియో చెప్పి, తత్క్షణమాజ్ఞా పూర్వకముగా వ్రేలెత్తి యధరమున నుంచెను. తన మిత్రుడగు లూకాసును, ప్రియకాంతాజనకుఁడగు కదీస్కారునింగూడమృత్యుముఖమునుండి తప్పించి రక్షింపఁజాలిన వింతయుంగర మాకరంబునె దీపించుచుండెను. ఖాలీలుఁడేమనెనోగాని, ఆపలుకులు వీనుల బడినంతనే రామిపాషా మ్రాన్పడెను. వానిని విశ్వసింపఁ జాలక ఆ ప్రభువు క్రుద్ధుడై ఖలీలు నేవగించి పరుషము లాడఁబోయెను. కాని, అనంతమహిమోపేతమగు నా యుంగరమా ముహూర్తమున దృగ్గోచరమాయెను. తోడనే, పాషా వైఖరి మాఱిపోయెను. అనుమానాగ్రహాసహ్యాగుణములు తత్క్షణమంతరించెను. యువకుఁడు పలుకునది యధార్థమని తెల్లమాయెను. ఖాలీలుఁడంత నధికారపూరిత స్వరమున వడివడి నిట్టులనెను.

"ఏమియు బలుకరాదు—ఒక్కమాటయైనను వలదు. నీ సేవకులతోఁ బాటు వెడలుము—భవదీయ సుందరీజనులు విడిసియున్న ప్రదేశము జొచ్చినందులకుగా నే నొసంగు క్షమాపణ పరిగ్రహింపుము—రెండవ విషయము గుఱించి మాత్రము మౌనము వహించి యుండుము."

ఖలీలుఁడు తోడనే తన దారిం బోయెను. ఆ సమయమున దత్తబను పాషా పలుకు లీ పగిది వినవాయెను.—

"మన మిత్రుఁడు ఖాలీలుఁ డట్టి విపరీతాతురంబునఁ బాఱుటకుఁ గతంబేమై యుండునో"

తరుసమూహములమఱుంగున నుండిన ఖలీలుఁడే యిట్టులనెను.—

"పాషా! ఆతఁడే సమాధాన మొసంగఁగలఁడు!"

ఆతఁడా క్షణమె సాక్షాత్కరించి నౌకారూఢుఁ డాయెను. పాషా యిట్లు ప్రశ్నించెను.—

"మిత్రమా! నీ సమాధాన మేమి? మాతోఁబాటు విందారగింపక, ఆకస్మికముగఁ బాఱనేల?

"ఆర్యా! నుఱేమియుగాదు. ఆ సమయమున ఘోరకృష్ణసర్పము గాన్పించెను. దానిం బొలియింప సమకట్టి రయంబునఁ బోతిని."

ఆ పలుకు లాలించిన ఇస్మిల్డా, తైరజా, గుల్నేరులు భయాతిరేకమునఁ గెవ్వున నఱచిరి. జులేఖా హృదయము మాత్రమా తెఱంగున విహ్వాలింపలేదు. తన ప్రియుని చూపులును స్వరమునుఅసాధారణముగానుండెనని ఆ కాంత గ్రహించి ఆతని పలుకు లట్టులే విశ్వసింపఁదగినవి కావనియు భావగర్భితముగ నుండెననియు నెఱింగి మిన్నకుండెను. పాషా సాశ్చర్యముగ నిట్టులనెను.—

"కృష్ణసర్పమా! నేను ఆకుపచ్చని పాములను, పసుపుఁ బాములను జూచియుంటిగాని నల్లని వానిని గాంచి యెఱుంగను—ఎన్నడు విని యెఱుంగను."

"పాషా! అన్ని రంగుల పాములును ఉండును."

"కాని, నీకా కృష్ణసర్పము చిక్కెనా?"

"పాషా! బాస్వరసు వఱకు నేనా యురగమును వెన్నాడితిని. కాని, ఆ విషధరము నీట మునిఁగి నన్నుఁ దప్పించుకొనెను."

ప్రభుపత్ని యంత భయకంపితయై ఇట్టులనెను.—"ఆర్యా! ఆ దీర్ఘపన్నగము నీపైఁ దిరిగిన, ఏ మొనరించియుందువు?"

"అట్లు కావలయుననియే వాంఛించితి. నేనా క్షణమా క్రూరసత్వమును మదీయ నిశితకరవాలమున ఖండించి యుందును."

"ఆ పాము నల్లగ దీర్ఘముగ భయంకరముగ నుండెనా?" అని ఇస్మిల్డా మగుడ ప్రశ్నింప, ఖాలీలుఁ డిట్టులనెను.—

"అంతటి సర్పము నెన్నఁడు గాంచి యెఱుంగను. కాని, ఇట్టి ప్రసంగము వనితాజనంబులున్నయెడఁ జేయఁదగినది కాదు. కావున మఱియొక విషయము ముచ్చటింతము."

ప్రభుపత్ని యంతటఁ దన నాథునిఁ గాంచి యిట్లులనెను.— ఈ తావు కడు భయంకరము. ఇట్టి విషోరగము లిందెన్ని యుండునో ఎఱుంగరాదు. అయ్యవి మనపై నుఱుకకమున్నె స్థలాంతరమునకుఁ బోదము— నాథా! అనుగ్రహింపుము."

తోడనే దత్తబనుపాషా ఆజ్ఞాపింప, నౌక మెల్లగఁ బోసాగెను. పాషా యపుడు మగుడ మధురసము ద్రావి యిట్టులనెను—"ఆర్యా! ఖలీలు మిత్రమా! అసమానకథాకల్పనాసమర్థుండవు—నీవు ఎన్ని కథలు చెప్పినను వినవలయుననియే కుతూహల మగుచున్నది. నీవు సాధుశీలుఁడవు, ఉదారవంతుఁడవు—ఐనను, అడుగుటకు మోమాటముగ నున్నది. ఈ కాంతలును మదభిప్రాయబద్ధులని చెప్పఁగలను. నీ మిత్రులును—"

"కాంతల తరపున నేఁ జెప్పెద—ఖలీలు మహనీయుని కథ సంతోషముగా నాలింతుము."

ప్రభుపత్ని యట్లు పలుక, లూకాసు కూడ నట్టులనెను.

వారి నందఱ నానందింపఁజేయుటకు దాను సంసిద్ధుఁడనని ఖాలీలుఁడు పలికి చిత్రచరిత్ర కథన మొనరింపదొడంగెను.

శ్రీ వేంకటగ్రంథాలయము,
తేనాలి.

శ్రీ వేంకటగ్రంథాలయము
తెనాలి

# ౨౩

## ఆ జి వ క థ

ఈ కథ పదునేడవ శతాబ్దాంతము నాఁటిది. గ్రీసు దేశముచెంత "స్కారో" యను దీవి గలదు. ఒకనాఁడు సూర్యాస్తమయ సమయమున నొక నావ తీరమునకుఁ గొంతదూరమున నిలిచియుండెను. గట్టునకుఁ బోయిన ఒకానొక చిన్న నౌక రాకకై ఆ నావ నిరీక్షించుచుండినటు లుండెను. గ్రీకుయువకుఁ డొకఁడు నౌకపై నొక చేయివైచి రెండవకరంబున నొక సుందరీమణి కోమలహస్తము బట్టియుండెను. పురుషుని ప్రాయ మిరువదియైదు సంవత్సరము లుండును. బాలిక ప్రాయము పందొమ్మిది వర్షములు మీఱి యుండదు. ఆ కాంతపరిపూర్ణ లావణ్యతారుణ్యరేఖావిలసితయై, వర్ణనాతీతసౌందర్యముతో నలరారుచుండెను. ఆమెయు గ్రీసుదేశస్థురాలే. యువకుఁ డిట్టులనెను.

"ఐరిణీ! నీ కింత వంతయేల? నా హృదయ మెఱింగియు నన్నను మానింతువా? సుందరీ! నేఁ బోవు ప్రదేశములందు నిన్ను మించు మోహనాంగు లుండురనియా?—"

"మనిలా! నా కనుమాన మావంతయు లేదు. సముద్రయానము భయావహము, అపాయకరము. నీ వట్టి ప్రయాణ మొనరింపనుండ నా హృదయము కలంగకుండునా."

"సుందరీ! నీకా భయము వలదు. నా యనుభవ మపారము. తుపాను సమయమున గూడ సాగరవిహార మొనరించిన నేర్పు కాఁడను. సముద్రనైసర్గికము నాకుఁ గరతలామలకము. కావున, నా కపాయము వాటిలనేరదు."

మనిలుఁడటులు సగర్వముగఁబలుక, ఐరిణి ఇట్టులనెను —

"ఆర్యా! సుస్థిరబలధైర్య సమన్వితుఁడవగు నీవు భయమెఱుంగక పోవచ్చును. కాని, నాఁటి విషయము నాకు మఱపునకురాదు. నీ నౌక శిలాభగ్నమగుటయు, లేఁబ్రాయంపు బాలికనునేను పఱుగునఁబోయి భయకంపితనై పెద్దవారలను జీరుటయు—"

"ఆముహూర్తము నాకుఁ జిరస్మరణీయము. నాదోనె ఆపగిదిపగులుట చేతనేగదా నిన్నుగాంచు భాగ్యమబ్బెను!"

ఆ పలుకులు వీనులఁబడినంతనే, నాకాంత వ్రీడాభరమ్మున సుందర సంధ్యారుణ రంజితవదనయై ఉచితభాషణంబులఁదన ప్రియుని కృతజ్ఞతోదార స్వభావము నగ్గడించి మగుడ నిట్టులనెను— "మన పరస్పరానురాగమే నాకీ సమయమున దుఃఖమొదవించుచున్నది. నేనీద్వీపము శాసించుపాలకుని సోదరపుత్రిక నగుటచే నాప్రాయంపుఁ గన్నియ లందఱు నన్నుగాంచి నే నమితభాగ్యశాలి ననియు, మా దేశీయులలో నొకమేటి మహనీయునిభార్య గాఁగలననియు నిరంతర మాడుచుందురు. కాని, నా హృదయము సముత్తుంగ తరంగ విహారి యగు ఈసాహసాంకు నధీనమాయెననియు, నొకచిన్న వాయువు రేఁగినను, ఒక్కొక్క భంగము విఱిగినను నాహృదయాధి నాథుక్షేమము నకై వడంకుచుందుననియు వారెఱుంగరు."

మనిలుఁడంత మధురమోహన స్వరమ్మున నిట్లు పలికెను.—

"ప్రేయసీ! ఈవర్తకపర్యటనముతో నమిత ధనవంతుఁడఁగాఁగలను.

నేనపుడు నీజనకునిడాసి, నాభాగ్యముజూపి వినమ్రుఁడనై యర్థించెదను. నావంశము దలంపక నిన్ను భార్యగానొసంగునని విశ్వసింతును."

ఐరిణివదన మాశాదీపితమాయెను.— "మనిలా! మఱెన్నఁడు భయంకర సముద్రము జొరకుందువుగదా? ఆర్యా! ఈ సముద్రమున

నొక క్రూరాత్ముఁడు నిరంతరము విహరించుచుననియు, నిశాసమయము మున మా దేశముపై బడి, గృహంబులు కొల్లగొట్టి ప్రాయంపుస్త్రీ పురుషులను బలిమిమై గొంపోయి, దేశాంతరముల బానిసలుగా విక్రయించువాఁడనియు వినియుందుముగదా. వానివలన నీకే ప్రమాదము సంభవించునోయని వెఱచుదాన."

"సుందరీ! అట్టిభయ మనవసరము. వాఁడు మాయంతటి బలవంతుఁడు కాఁడు. కావున, భయముడిగి, సుందర తరళనయనములు బాష్పరహిత మొనరించి, నిశ్చలచిత్తవై గృహమున కేగుము. అచిర కాలమున దిరిగి రాఁగలను. సూర్యాస్త మయావసరమున నీతీరమున నీలదీపము దృగ్గోచరమగునంతనే భవదీయ పాదసేవాపరాయణుఁడు నీకొఱకు నిరీక్షించువాఁడని గ్రహించి కృపాయత్త చిత్తవై యరుదెమ్ము. ప్రేయసీ! ఇఁకఁబొమ్ము!"

"మనిలా! దైవము తోడగుఁగాక! పోయిరమ్ము. నిన్నుఁగాంచు వఱకు నాచిత్తమునకు శాంతియుండదు."

అంత నా గ్రీకు నావికుఁడు నిజభుజ బంధిత సుందరిని ముద్దాడి రయంబున నౌకారూఢుఁడై నిర్గమించెను. ఐరిణి దురంత విచారాక్రాంతచిత్తయై నిజగృహాభిముఖి యాయెను.

ఒకనెల గడచినంతనే నీటిదొంగలు మఱల నెచటనో దిగి దోపిడి చేసిరని తెలియవచ్చెను. స్కాయోద్వీపపాలకునకుఁ బ్రాణసంకటముగ నుండెను. ఆదీవి తురుష్క సామ్రాజ్యాంతర్భాగమగుటచే, నాసార్వభౌముఁడేమనునోయని పాలకుఁడు భయవిహ్వలుఁడాయెను. పాలకుఁడు గ్రీకు దేశస్థుఁడును మతమున గ్రైస్తవుఁడునై యుండుటయేగాక కొందఱు స్వీయమతస్థులే ఆతనిపైఁగ త్రికట్టి యపకార మొనరింప నుండిరి. కావునఁదన దేశమునుండి చోరభయము బాఱద్రోలుట కడుంగడు నవసరమాయెను. తురుష్కరక్షకనావ లా సముద్రమున

నుండియు, నా ద్వీపాధికారికి వలయు సాహాయ్య మొనరింపక తటస్థముగ నుండెను. మేఘమునుండి వెలువడుపిడుగువలె సముద్రమునుండి దిగివచ్చు నా గజదొంగను బట్టుట యసాధ్యమగుటచే పాలకుని భయమధికతరమాయెను.

పాలకుం డట్టి దురవస్థకుం బాల్పడి విచారగ్రస్తుండై యుండ, నొక నావికుం డరుదెంచి యతని విచార ముడిపెను. సర్వజనభయంకరులగు నీటిదొంగలలో వాం డొకండు. వాండును గ్రీకుదేశస్థుండె. తన నాయకుని దురాచారములకు రోంతజెంది, ఇంక సత్పథంబునం గాలవిలంబన మొనరింపనెంచి ఇటు పాఱివచ్చితినని వాండు సవినయముగ దెల్పెను. పాలకుండు సంతుష్టాంతరంగుం డాయెను. సమయముజూచి తన నాయకుని బట్టియిత్తుననికూడ వాండు పలుకుటచే నా పాలకుని సంతస మధికతరమాయెను. ఆ క్రూరదానవుం డింక బట్టువడుననియు, దేశము నిష్కంటకమగుననియు, ప్రజలు భయముడిగి సుఖముగ నుందురనియు, సామ్రాజ్యాధికారులవలని భయంబుదక్కి తా నిక మననగుననియు నెంచి గ్రీకుపాలకుండు హాయిగ నుండెను. తమ యుద్యమము సఫలమగునంతనే ఐదువేల నాణెములు వానికి బహుమాన మొసంగుదునని పాలకుం డుత్సాహతమకమున బాసచేసెను.

ఆఱుదినములు గడచినయనంతర మా నావికుం డరుదెంచి, పాలకునకు సవినయముగం బ్రణమిల్లి, ఇట్లు విన్నవించెను—

“ప్రభూ! ఆ దురాత్ముండు మగుడ నీదీవిపైం బడనున్నవాండు. ఈసారి వాండు పశ్చిమతీరమున డిగంగలండు. ఆ నావ యథాప్రకారము దవ్వున నిలుచును. వాండు తన యనుచరులతోం బాటు నాకస్మికముగా నరుదెంచి చేయగల భీభత్స మొనరించును. నాకుం దెలియు సమాచారము మీ కెఱుకపఱచితిని. భద్రముగనుండుడు.”

పాలకుం డమితానందభరితుండై, దొంగలనాయకుని బట్టుటకు

బహుళప్రయత్నము లొనరించెను. వలయుసైనికులను రావించి ఆప్రదేశమున గాంపుంచెను. అచటి జనుల ధనకనకవస్తువాహనంబులను వేటొక దుర్గమున భద్రపఱచెను. ఆ విధమున గ్రీకుపాలకుఁడు సర్వప్రయత్నము లొనరించి, ప్రజాకంటకుఁడగు నా దురాత్ముఁ డీసమయమునఁ దనకు జిక్కకతప్పదనియెంచి, ఆశోత్సాహములతో నిరీక్షించుచుండెను.

ఆ నాఁడు ఐరిణి తన మందిరమున నాసీనయై, విచారాక్రాంత చిత్తయై సముద్రమువంకఁ గాంచుచుండెను. ఆ ముద్దియ తనప్రియుని రాకకై యెదురుచూచుచుండెనని మీరు గ్రహించియుందురు. సూర్యోదయమైనంతనే యొకానొక నావ నయనగోచరమాయెను: ఆ జలచర మిటు నటు బోక, ఒక్కతావుననె నిలిచియుండెను. ఆహా! ఐరిణీహృదయరంజకుఁ డందుండునా? సముద్రమునఁ బెక్కు నావలు యానము సల్పుచుండును ఇది యొకటి కావచ్చును. ఐరిణి ఏమియు నెఱుంగనేరక, ఆశానిరాశలనడుమఁబడి దుర్భరబాధితాత్మయై అట్టె వీక్షింపఁదొడంగెను. అంత సాయంకాల మగుడు, అమందానందప్రదంబగు నీలదీపము దృగ్గోచరమాయెను; ఐరిణీ హృదయము వికసించెను. ఆ కాంత యంత దిగ్గునలేచి శీఘ్రతర గమనమున దీరమునకుఁ బోయెను. అచిరకాలమున నాసుందరి నిజ మనోహర దృఢబాహుపంజరబంధితశరీరయై, అనిర్వచనీయ సౌఖ్యార్ణవ నిర్మగ్న ఆయెను.

ఆ యువతీయువకులు పరస్పరసరససంభాషణంబుల మునింగి ప్రపంచము మఱచి హాయిగ నుండిరి. గ్రీకునాయకుఁడంత దాను మగుడ బ్రయాణ మొనరింపవలయునని మెల్లగఁ దెలుప, ఐరిణి బెగడొందెను. ప్రియుఁ డిట్టులనెను—“ప్రేయసీ! నా పర్యటనము పూర్తికాలేదు; రెండుమూడు వారములలోఁ బూర్తి యగును.

నే నపుడు ధనవంతుఁడనై విపులవైభవ సమన్వితుఁడనై నీజనకుననుజ్ఞ వడసి నిన్ను భార్యగాఁ గొనుభాగ్యము గాంతును. అంతవఱకు నీవు ధైర్యమూనియుండుము."

నాయకుని పలుకులు బాగుగనే యుండెను, కాని, ఆతని స్వరమే లకో సాధారణనిశ్చలత చోటుఁగొని, నిష్ఠుర తరంబుగనుండెను. వాని కరపీడనము గూడ దుర్భరంబాయెను. చీఁకటి కారణమున వాని వద నము కానరాకుండెనుగానిఁ అదియు దదను గుణముగనే యుండెనని భావించి, భయమొంది, ఐరిణి ప్రశ్నింపఁ గా కామినీ మనోహరుఁడు సముత్తరమొసంగి, మధుర ప్రణయంపుఁ బలుకుల నామె యుల్లము రంజింపఁజేసిఁ సుధారస పూరితాధరము పుద్దాడి గాఢాలింగన మొన రించెను. ఐరిణి పరవశాత్మయై బాహ్యప్రపంచము మఱచెను. ఆమె ప్రియుఁడంతలోఁ దాసిఁకఁ బోవలయునని పలికెను. ఆ కాంత తోడనే తెలివొంది భీతచిత్తయై, రెండుదినములైన నుండవలయునని ప్రకంపిత స్వరమున బ్రతిమాలెను. అంతమాత్రమున ప్రయోజన మేమని నాయకుఁడు ప్రశ్నింప, నాకన్నియ అమితోత్సాహముగ నిట్టు లనియె:—

"ఆర్యా! ప్రయోజన మున్నది. ప్రజాకంటకుఁడగు నామేటి చోరాధముఁ డీసారి తప్పక పట్టువడును. రేపురాత్రి వానిమద మడంగును."

"అట్టులనా?"

"అవును. నాజనకుఁ డొనరించిన ప్రయత్నమతి ప్రశంసనీయము. నీవు దూరముగ నున్నను సముద్రయాన మొనరించుసమయమున నీకారక్కసుఁడే యపాయ మొసఁగింపఁడుగదాయని సంతసించు దానను. వాని నావయు మాయధీనమగును."

"కాని, నీజనకుఁడు తలపెట్టిన కార్యము జయప్రదముగా సాగును

గదా! ప్రమాదమున కవకాశము. లేదుగదా!"

అంత నాకన్నియ తదవసరోత్సాహమునఁ దన పినతండ్రి పన్నిన వ్యూహము సవిస్తరముగఁ దన ప్రియునకెఱుకపఱచెను. అతఁడు గూడ సంతసించి పాఱివచ్చిన దొంగ యెచటనుండెనని ప్రశ్నింప, వాఁడు తన గృహంబుననే యుండెననియు కార్యసాఫల్యమగు నంతనే విశేషబహుమానము వడయఁ గలఁడనియు నామె పలికెను. మనిలుఁ డిట్లులనెను.—

"ప్రేయసీ! ఈవార్త నాకెంతయు మోదావహము. గ్రీకులందఱు నేకకంఠమున నీజనకునిఁ గొనియాడుదురు. కాని, ఐరిణీ! చాలసేపా యెను. ఇఁక బోవలయును."

"పోవలయునా! మనోహరా! ఆమాట వీడవుగదా. ఆహా! పరస్ప రానురాగ బద్ధులమగు మనమేల ఎడబాయవలయు? నిర్జనారణ్యాంతర జలాశయమువలె మదీయ హృదయానురాగము ఆ శానుమానవి యోగ తీక్షణకంట కావృతమై, కడు బాధజెందెడిని."

"ఐరిణీ! వియోగము తప్పదు. కాని, ఈవియోగ మెంతకాలము? ఒకటి రెండు దినములు మాత్రము ప్రయాణము సల్పి మగుడ నిన్నుఁ గాంచువాఁడను. కావున, భయముడిగి నాకు సెలవిమ్ము."

ప్రియ పునర్దర్శనమచిరకాలమున నగుననునాశచే నాప్రణయి నీ హృదయాందోళన ముపశమించెను. మనిలుఁడు తన దారింబోయెను. ఐరిణి తన గృహము జేరెను.

పాలకుఁడు పశ్చిమతీరమునఁ గావలియుంచిన సైనికులొక యను కూల గృహమున వితిసియుండిరి. వారందఱు మహమ్మదీయులు. వారి నాయకుఁడును మహమ్మదీయుఁడె. వారందఱు నిశ్శబ్దముగ నుండవల యుననియు, దొంగలందుఁ బ్రవేశించువఱకు వేచియుండ వలయున నియు, ధనసంగ్రహణకార్యమున వారు మునిఁగి ఏమరియుండు సమ

యమున రయంబునఁబడి పట్టవలయుననియు ఆతెఱంగునఁ దమకు రక్తపాతము లేకనే మహావిజయము ప్రాపించుననియు, ఆదురాత్ములను సజీవముగ రాజధానికిఁబంపి యశేష యశోపార్జన మొనరింపనగుననియు నాయకుఁడు పలుక, సైనికులు సమ్మతించిరి. దోపిడికాండ్రు పట్టువడునంతనే వారి నావయందలి ధనకనకాదులు తమ యధీనమగునని ఎఱింగి నా రమితోత్సాహముగనుండిరి.

మఱునాఁడుదయించెను. ఒక యామమగునంతనే చోరుల నావ నయనగోచరమాయెను. తోడనే మహమ్మదీయ సేనాని సంతోషపరవశుఁడాయెను. తానప్పుడే కృతకృత్యుఁడై రాజసన్మానము గాంచినట్లు ఆతఁడు సంతసించెను. వారి ధనమప్పుడే తమ యధీనమైనటులు సైనికు లుప్పొంగిరి.

మధ్యాహ్నమాయెను. మహమ్మదీయ సైనికులు ఎలుగెత్తి తమ దైవమును ప్రార్థింపనుండిరి. అట్టి సమయమున శల్యమాత్రావశిష్టుఁడగు బిచ్చగాఁడొకఁడు ద్వారము కడ నాకస్మికముగాఁ దోఁచి సైనికులు ప్రశ్నించునంతలో గుభాలున నేలఁగూలెను. చూచుటకు వాఁడు జీవరహితముగ నుండెను. ద్వారపాలకులు వానినెత్తుకొని తమ నాయకుని చెంతకు వడివడి బోయిరి. అచటి సైనికులు క్రోధాతిరేకమున రక్తారుణ నయనులైరి. నాయకుఁడు దుర్భర క్రోధానలతప్తుఁడైఁ అభినవ జలధరమువలె నిట్లు గర్జించెను:—

"ఈ శ్వానమెవ్వఁడు? ఈ క్రైస్తవాధముఁడు మనము దైవారాధన మొనరించుసమయమున నరుదెంచి పీనుగువలెఁ బడనేల? సైనికులారా! చూచెదరేల? కొరడాలుదీసి వాని పాదములపై నూరు దెబ్బలు వేయుఁడు. దానఁ దెలివొందునేమో చూతము?"

ఒక సైనికుఁ డిట్టులనెను—

"ఆర్యా! నేనధమాధముఁడనయ్యు నొక్క పలుకాడెద! నా సాహ

సము మన్నించి చిత్తగింపుము. ఈ క్రౌర్యవాధముని శిక్షింపకమున్ను వీని యుదంతమరసిన బాగుండును."

ఆమాట సమంజసముగ నుండుటచే సేనాని సమ్మతించి, వాఁడు తెలివొందునటులు మధురస మిప్పించెను. కాని, మధువనినంతనే, నా యపూర్వద్రవముం గాంచినంతనే సేనాని నోరూరుటచే వాఁడును ద్రావి అమితోత్సాహము వడసెను. బిచ్చగాఁడు సేదదేఱి యిట్టులనెను.—

"లోకైక సార్వభౌములగు అహమ్మదు పాదుషావారి గ్రీకు ప్రజలలో నే నొకఁడను. సేనాధిపా! నీవు మహనీయుఁడవు, చచ్చిన వానికిఁ బ్రాణదానమొసంగిన దయామయుండవు నిన్నెంత కొనియాడినను ఎక్కువకాదు. మాగ్రామము దక్షిణ తీరముననున్నది ఆలుబిడ్డలతో నాయల్ప కుటీరమునఁ బడియుండ ఆఱుదినముల క్రిందట నీటిదొంగ లాకస్మికముగా దిగివచ్చి దోచుకొనిపోయిరి. ఆ పాపాత్ములు నా నివేశనము నేను చూచుచుండగనేకాల్చివైచిరి. అసలు దరిద్రుఁడనగు నేను నిలువ నీడలేక అందంముఁ దిరిగి తిరిగి, మలమలమాడి, తూలి తూలి, తుదకు నీ ద్వారమునఁ బడితిని. నీదయవలనఁ దెలివొందితిని."

"ఎంతదారుణము! ఆ మానవాధములు గ్రీకులా? మహమ్మదీయులా?"

"గ్రీకులే—నా దేశస్థులే నాకిట్టి యపకార మాచరించిరి."

మహమ్మదీయ దళవాయి క్రోధవివశుఁడై పండ్లు కొఱికి యిట్టులనెను.—

"ఓరీ! భయపడకుము. నిన్నింత కష్టపెట్టిన దురాత్ములు ఇఁకమన యధీన మగుదురు. ఆ నాయకునిపై నీవు పగసి తీర్చుకొనవచ్చును."

"మహనీయా! నాకుఁ గసియేల? జవసత్వము లలవడువఱకు నిందుఁ దలదాచికొననిమ్ము—చాలును. ఉత్తరతీరమున నాబంధుగుఁ

డొకఁడున్న వాఁడు—అటు పోయెకను.*

"అటులే కానిమ్ము. కాని, ఈరేయి నీవొక వింతగాంతువు. నిన్నుఁ గారించిన ఆదుష్టాత్ములు మాయధీశులగుదురు. దాన నీచిత్తమునకుఁ గొంత శాంత మొదవుగాక."

నవీనుఁడు సముచితముగా బదులాడెను. వాని కారణమున నిలిచి పోయిన దైవ ప్రార్థనతోడనే మగుడ ప్రారంభమాయెను. అనంత రము వారు కొంతకాలము వినోదాదులం బుచ్చి, సాయంత్ర మగుడు మగుడ సాంధ్యకరణీయము లొనరించి, భోజనమొనరింపఁ గూర్చుం డిరి. నవీనుఁడు కృతజ్ఞతా పూర్వకముగా వారికిఁ బరిచర్య సలుప నడుకట్టి వడ్డన సేయఁదొడంగెను. వాని వినయ ప్రవర్తనము గాంచి యందఱు సంతసించిరి. ముఖ్యముగా సేనాని మఱియు నానందిం చెను. ఆతనికి సర్వోపచారములును బిచ్చగాఁడే యొనరించుచుం డెను. భోజనానంతరము వాఁడు వేఱొక గదిలోనికిఁ బోయి కాఫీ తయారుచేసి యొసంగెను. సేనాని సంతుష్టాంతరంగుఁడై ఆపానీ యము ద్రావెను. బిచ్చగాఁడు సవినయముగఁ బ్రణమిల్లి తత్క్షణము మాయమాయెను.

వాఁడు వడివడి సముద్రతీరమునకుఁ బోయి వెనుదిరిగి చూచి నంతనే, తాను వీడిన గృహంబున ననేక దీపములు మెఱపులవలెఁ బరుగిడుచుండుట గోచరమాయెను. సైనికులు కలవరమంది తనకై వెదకుచుండిరని గుర్తించి సగర్వముగ మందహాస మొనరించెను. వాఁడంత శీఘ్రతరంబుగఁ బాఱెను.

వాఁడు కొంత దవ్వరగినంతనే, జనుల అలికిడి వినవాయెను. రెండు నిమిషములలో నేబదిమంది కాన్పించిరి. వారు కొల్లగొట్టిన సామగ్రి అమూల్యముగను అత్యధికముగను నుండెను. మన బిచ్చ గాఁడు వారి నాయకుని గాంచి యిట్లు ప్రశ్నించెను.—

"నీకార్య మింత శీఘ్రముగ సఫలమాయెనా ?"

"జనులు భయవిహ్వాలులై మమ్మెదిరింపనైన నెదిరింపరైరి. మేము దుర్గద్వారము నిరాఘాటముగాఁ బ్రవేశించి, ఈసామగ్రి నంతయు సులువుగా దెచ్చితిమి. తమ నాయకుఁడు పన్నిన వ్యూహ మమోఘమనియు, దొంగ లీసారి తప్పక పట్టువడుదురనియు బూర్తిగ విశ్వసించి ప్రజాళి నిర్భయముగా హాయిగా నుండిరి. కాని, నాయకా! నీప్రయత్న మేమాయె?"

మన బిచ్చగాఁడు దొంగల నాయకుఁడనియు, నాయకుఁడన్న వాఁడు వాని సహకారి యనియు మీకుఁ దెల్లమాయె గదా! నాయకుఁ డంత దన యుదంతము దెలియఁబఱచెను. సహకారి ఇట్లు ప్రశ్నించెను.—

"కాని, నీకార్యము పూర్తి కాలేదా ?"

"మిత్రమా ! తీవ్రపడకుము—మహమ్మదీయుఁడు మరణింప లేదు—కాని వాని కాఫీయందునేఁ గలిపిన విషప్రభావమున వాఁడు చచ్చినట్టు పడియుండును. వాఁడు నాయెడ సదయుఁడై యుండుటచేఁ బ్రాణాపహరణ మొనరింపఁ జాలనైతిని. సేనానియే వారి బలము. అట్టి సేనాని మృతప్రాయుఁడగుటచే సైనికు లేమియు సేయఁజాలరు. వారిని బాఱద్రోలి వారి సేనానిం బట్టుట కడు సులభము. దాన మనకుఁ బరిహాసపూర్వకముగాఁ జాలధనము చిక్కును."

నాయకుఁ డంత దీర్ఘాస్త్రధారియై, ఇష్టజనసమేతుఁడై తాను వీడివచ్చిన సైనికగృహంబునకు నిబ్బరముగాఁ బ్రయాణమాయెను. వారందఱుగడు నిశ్శబ్దముగ నుండిరి. రేయియు గడు బ్రశాంతముగ నుండెను. వా రేకముగా వైచు నడుగుల దడదడలు తప్ప వేఱు శబ్ద మెద్దియు లేదు.

కంటక జనరాయఁడు గృహద్వారము బ్రవేశించువఱకును మహా

మ్మడీయు లేమియు నెఱుంగరు. అంత వైరులు పిడుగువలె నరుదెంచి నంతనే వారు విగతధైర్యుల య్యు సైనికులగుట కతంబున నప్రయత్న ముగా నాయుధముల దాల్పఁ గడంగిరి. కాని, ధైర్యహీనులకు నాయుధము లేల! రెండు నిమిషములలో వారందఱు పాశబద్ధులైరి. తమ ధనంబులతోఁ బాటు వారి సేనానిం గూడ గరలించుకొని ఆ కంటకులు తమ నావకుఁ బోయిరి.

ఈ దురంతము గ్రీకుపాలకునకుఁ దెలియవచ్చెను. ఆతని యాగ్రహమునకు మేఱలేదు. తన ప్రయత్నమెల్లు విఫలమాయెనో ఆతనికిఁ దెలియదాయెను. ఆ రహస్య మొక్క ఐరిణి తప్ప అన్యులెవ్వరెఱుంగరు. తన చెంతకుఁ బాఱివచ్చిన గ్రీకుదొంగ ఏమైన మోస మొనరించెనా యని అనుమానించుటకైనను అవకాశము లేకుండెను. ఏమన, వాఁడు సదా పాలకుని చెంతనే యుండెను. ఐరిణియును గారణ మరయజాలక విస్మయవిచారాక్రాంతచిత్తఆయెను. ఇంతటి సాహస మొనరించిన దురాత్ములు తన పిరియున కెట్టి యపకార మొనరింతురో యని ఆ కాంత భయప్రకంపితఆయెను.

మఱునాఁడు సాయంకాల మగునంతనే నిజమనోహరసుధాకర వదనసందర్శనోత్సుకమతి యగు నైరిణి సముద్రతీరమునకు రయంబునఁ బోయెను. నాలుగైదు నిముసములలో మనిలుఁడరుదెంచెను, ఐరిణి అనిర్వాచ్యానంద మనుభవించెను. తన ప్రియకాంతను గాఢాలింగన మొనరించి, నునుజెక్కుల ముద్దాడి, అధరసుధారసము గ్రోలి అమందానంద మనుభవించి, అనంతర మొక కరంబా కోమలాంగి కౌనుపై జేర్చి, రెండవ కరంబా పడంతి హస్తమున గీలించి మనిలుఁడు మనోహరముగ సంభాషింప దొడంగెను. కొంతకాల మట్టులగుడు ఐరిణి, నిట్టూర్పు విడిచి యిట్టులనెను.

"మనోహరా! నా హృదయ మేలకో భయాధీనమై యున్నది.

కారణ మరయఁజాలను. కాని మనమిఁక సజీవముగాఁ గలయజాల మని మాత్రము దారుణముగఁ దోఁచెడిని. సమాధినుండి వెలువడు దయ్యములు కేవలమూహా జనితములని నెఱింగియు నా స్థలంబునకుఁ బో వెఱచు వాని పగిది, నేనును డోలాయమాన మానసనై అకారణముగఁ బరితపించుదాన——"

"ప్రేయసీ! ఇట్టి భయంబుడిగి హాయిగ నుండుము. ఈ యాత్ర ముగియునంతనే మన మొండొరుల మెడబాయక అవిరళసౌఖ్యార్ణవ తరంగముల నోలలాడఁ గలము——"

"ఆర్యా! ఇంకను సముద్రయానమా? వలదు! నా జనకుఁడు కరుణామయుఁడు——నన్నెంతయు ప్రేమించును——నా సౌఖ్యమున కంతరాయము గల్గింపఁజూచు కఠినుఁడు గాఁడు. కావున, నీవిఁక గాలయాపన మొనరింపక ఆ మహనీయుని పాదములపై వ్రాలి నీ మనోరథ మెఱింగింపుము——తప్పక అనుగ్రహించును."

"సుందరీ! నేనీ సమయమునఁ దీవ్రపడి నీ జనకు నర్థింతునేని కార్యభంగ మగునని వెఱచువాఁడను. ఏమన, నీ జనకుఁడీ విశాలదేశ పాలుఁడు, సంపన్నుఁడు, సద్వంశజుఁడు, సకలజనహృదయప్రేమాస్పదుఁడు. నే నన్ననో!——అనామకుఁడ——నిర్భాగ్యుడ! కావున, విశేష ధనోపార్జన మొనరించి నిన్నుం బడయవలయునని నే నింతకాలము వేచియున్నవాఁడను. ప్రేయసీ! రెండుమూడు వారములలో నీ యాత్రి ముగియును. అనంతరము మనము సఫలీకృతమనోరథులమై హాయిగ నుండఁగలము. అందనుక వేచియుండుము."

"ఆర్యా! మజ్జనకుని ధనాధికారవైభవంబులఁ గాంచి వెఱగందవలదు. ఆతనిఁ గాంచుటకు మంచి యనుకూలసమయ మెఱింగించెద నాలింపుము. ఆతని సోదరుఁడును, నన్ను గాంచిన జనకుఁడును నగు మహనీయుని సమాధి అల్లదె—— ఆ పర్వతాగ్రమునఁ గలదు. నా

పినతండ్రి ప్రతి 'సబ్బాతు' దినమునను సూర్యాస్తమనసమయమున నే యాడంబరమును, ఏ వైభవమును ఏ సాహాయ్యమును లేకయే ఛాయామాత్రసాహాయ్యుఁడై పోవువాఁడు. అట్టి సమయమున నీ వాతనిఁ గాంచి కృతకృత్యుడవు కాఁగలవు."

"ఐరిణీ! ధనవంతుఁడ నైనగాని నిన్ను వివాహ మాడఁజాలను."

"మనోహరా! ధనసంగ్రహణార్థము మగుడ భయంకర సముద్ర యాన మొనరింతువా? చాలు, చాలు! మనకు ధనమేల? మఱియు నీ యనంత పారావారమంతయు నా దుష్ట చోరాగ్రేసరుని రాజ్యము వలె, దోచెడిని——"

మనిలుఁడు సగర్వముగ మందహాస మొనరించి, ఇట్టులనెను.——

"ప్రేయసీ! నిర్ధనజీవనము దుస్సహము. కావున, ఈ సాగరము సహస్రక్రూర చోరుల కాకరంబైనను నిర్భయంబుగఁ బోవువాఁడను."

"ఆర్యా! నీవా గజదొంగ మహిమ నెఱుంగవు. మేధావంతుఁ డగు నా జనకుఁ డత్యంత నిగూఢముగ నొనరించిన వ్యూహము వ్యర్థ మాయెను. ఆ మాయావి దురంతక్షుధార్తుఁడగు బిచ్చగానివలె నటించి సైనికజన నికాయంబు జొచ్చి వారిం బ్రమత్తుల నొనరించి సేనాని త్రావు పానీయమున మత్తుమందు గలిపి, తానే అందిచ్చి, తదుత్తర నిమేషమే మాయమాయెను! ఒక గడియలో వాఁడు తన సిబ్బందితో నరుదెంచి, ఱిచ్చపడి చూచు సైనికులను బంధించి సైన్యాధిపునిఁ గట్టి కొంపోయెను. అంతకు పూర్వమే, దుర్గమున భద్రపఱిచిన ప్రజాధనము వాఁ డవలీల నపహరించెను! వాఁడెంత సాహసియో గాని ఇరువదివేలు నాణెములు దన కర్పించినచో సేనా నాయకుని విడిచిపుత్తునని నా జనకునకు వర్తమాన మంపెను! ఆహా! నా జనకున యవస్థ కడు దుస్సహముగ నున్నది. తన సేనాని యట్టి దురవస్థకుఁ బాల్పడెననియు ప్రయత్న మాతెఱంగున భగ్నమాయె

ననియు, మహమ్మదీయపాలకుఁడు కడుకుపితుఁడై యున్నవాఁడు. చోర నాయకుఁడు నిర్దయుఁడై విధించు షరతునకు లోఁబడుట తప్ప నాజనకున కుపాయాంతరము కానరాకున్నది.”

మనిలుఁ డొక్కక్షణ మాలోచనాపరుఁడై ఇట్టులనెను.—

“కాని, అట్టు లతి సాహసమొనరించిన ఆ చెఱటి నెట్టులైనఁ జెక్కాడు నుపాయ మరయక నీజనకుఁడు వానికి హేయముగ లోఁబడునని తలంపను.”

“నిక్కము. వాని దుష్టసందేశ మరుదెంచినంతనే నా జనకుఁడు చక్కని యాలోచనం బొనరించెను. పరిహారధనము మఱుచటి ఉదయము తనకుఁ జేరవలయుననియు, ఆ ధనము గొని తెచ్చు నౌక యందు నిరువురుమాత్ర ముండవలయుననియు, తోడనే తాను మహమ్మదీయ సేనానిని విడిచి పుత్తుననియు నా గజదొంగ వ్రాసెను. నాజనకుఁ డొక యపూర్వ నౌకా నిర్మాణమునకు రహస్యముగ గడంగెను. చోరనాయకునకు ధన మందజేయు నౌక అయ్యదె. అందిరువురు నావికులు మాత్రము గోచరింతురు. కాని, జనుల కగోచరమైయుండు నద్దాని గర్భమున సాయుధులగు యోధు లిరువది మంది యడంగి యుందురు. ధనము చిక్కినంతనే సేనాని మాచారి యధీన మగుగదా. ఆ ముహూర్తముననే, గ్రీకువీరులు నౌకా గర్భ విచ్ఛేదన మొనరించి, చోరనావపై లంఘించి, యద్దాని నాక్రమింతురు. మనోహరా! ఈ యుపాయ మమోఘముగదా!”

ఆ యుపాయ మద్భుతముగ నుండెననియు, గ్రీకు పాలకునకు జయము ధ్రువమనియు మనిలుఁడు సానందముగాఁ బలికెను.— “సుందరీ! చాలసేపాయె. నేనిఁకఁ బోవలయు. మూఁడు నాల్గు వారములలోఁ దిరిగి వచ్చువాఁడ.”

తన ప్రియు నభిప్రాయము మఱలింపవలయునని ఐరిణి ఎంతగ

ప్రయత్నించినను నిరర్థకమాయెను. యువకుఁడు ప్రేమమయ గాఢాలింగన మొనరించి నౌకారూఢుఁడాయెను. నిశయగుటచే నాదోనె కానరానికారణమున నౌకాదండంబుల సవ్వడి యంతరించువఱకు నాకామిని ఆ స్థలంబుననె నిలిచి, దుర్భరవిచార ఘూర్ణితమనస్కయై తన గృహమునకుఁ బోయెను.

ఉదయమగుసరికి గ్రీకుపాలకుని మాయానౌక పూర్తిఆయెను. శస్త్రధరులగు సైనికులిరువదిమంది సముచితముగ నందడంగి యుండిరి. చోరనాయకునకర్పింపవలసిన ధనమం సాయత్తమాయెను. వాఁడు విధించినటులు ఇరువురు నావికులు మాత్రము నౌకను నడుప దొడంగిరి. తన కీసారి మహావిజయము ప్రాపించునని విశ్వసించి, ఆచిత్రనాటకముం దాను గనులార గాంచి యానందింపవలయునని యెంచి, గ్రీకుపాలకుఁ డొక సముచిత సమున్నత ప్రదేశమున సగర్వముగ సుఖాసీనుఁడై వీక్షింపనొడంగెను.

గ్రీకు నౌక క్రమముగా నాచోరనావ సమీపించెను. ఒండొంటి నొరయునట్లు గ్రీకునౌక నిలిచిన యనంతరము, పరిహారధనముతో నిండియున్న సంచులను గ్రీకు నావికులు చోరనాయకున కందిచ్చిరి. వారును ఆనావమీఁదనే యుండిరి. తమ నిగూఢ ప్రయత్నము సఫలమగు ముహూర్త మరుదెంచెనని వారు లోలోన సంతసించిరి. నౌకాగర్భస్థ సైనికజనంబులు తామెన్నఁడు బయల్పడి విజృంభించి దురాత్ములగు చోరులను దండించి వారి నావ నాక్రమింతుమోయని తత్తరపడుచుండిరి. దవ్వుననున్న గ్రీకుపాలకుఁడు సంభ్రమోత్సాహ పరుఁడై, ప్రకంపితహృదయుఁడై, అనిమిష నయనుఁడై, నిరీక్షించు చుండెను. దృఢవిశ్వాసబద్ధుఁడగు గ్రీకు నావికుఁడు చోరనాయకునిఁ దన యధీన మొనరించుకొను తలంపున సగర్వముగ నాతనిడాసెను. కాని, అంతలో నెంతటి ప్రమాదము సంభవమాయెను! ఆకస్మిక

ముగా, శ్రవణపిశీర్ణ మొనరింపఁజాలు ఈల ఖంగున మ్రోగెను. రజ్జు పరికల్పిత యంత్రప్రభావమునఁ జోరనావపై నొక బండఱాయి లేచి, గ్రీకునావికుఁడు విగతధైర్యుఁడై మ్రాన్పడి చూచుచుండ, గ్రీకు నౌకపై గుభాలునఁబడెను. అయ్యది తద్వపరీశోద్వేగము సైపఁజాలక అట్టిట్టు నూగులాడి రయంబున సముద్రగర్భస్థ మాయెను! ఆ ముహూర్తముననే ధనము గొనివచ్చిన నావికుఁడును తొంటి మహమ్మదీయ సేనానియుగూడ క్రూరపాశ ప్రపీడితకంఠులై తారున మరణించిరి. గ్రీకుపాలకుని గుండె లవియునట్లు చోరులందఱు సింహనాద మొనరించి, తత్సంఘలాంఛనంబగు రుధిరవర్ణ కేతనం బెగుర వైచి రయమ్మున మాయమైరి.

గ్రీకుపాలకు నవస్థ మఱియు దుర్భరంబాయెను. అట్టి దారుణ మరణమునకుఁ బాల్పడిన సైనికుల దారాపుత్రాది బంధుజనులు దుఃఖపరవశులై యాతని నెంతయు నిందించిరి. స్థానిక మహమ్మదీయ పాలకుఁ డీక సహింపఁజాలక, జరిగిన విషయము సవిస్తరముగా లిఖించి, తురుష్క ప్రధానామాత్యునకు నివేదించెను.

తానెంతయో నిగూఢముగ నొనరించిన మాయోపాయ మెట్లు విఫలమాయెనో యెఱుంగఁజాలక పాలకుఁడు ఖిన్నుఁడై అమితలజ్జా భయాక్రాంత చిత్తుఁడాయెను. ఆ దురంతము వెల్లడి యైనంతనే విస్మయపరవశులై భయవిహ్వలులై అనంత ప్రభావ యుతుండగు నాచోరనాయకునకు భూతనాయకుడు తోడ్పడియుండునని జనులు నిశ్చయించిరి. అదివఱకే క్షీణించిన భూమధ్యసముద్ర వాణిజ్యము మఱియు నడుగంటెను. తన ప్రియుఁ డేమగునోయని ఐరిణి భయాతురయై విలపింపఁదొడంగెను.

విజయములపై విజయముల గాంచుచుండిన చోరనాయకుఁడు దుర్గర్వమున నొక్కనాఁడు తనతోడిచాంగలతో బీరములాడి, తురుష్క

నౌకాధ్యక్షుని దళముపైఁబడఁజూచెను. తురుష్కనావికులావిషయము ముందుగనే గనిపెట్టిఁ చోరనౌక యరుదెంచినంతనే చుట్టిరి. చోరులు సహజధైర్య స్థైర్యములతోఁ బోరాడియు భంగపడిరి. పెక్కండ్రు తెగటారిరి. హతశేషులు పట్టువడిరి. అందు నాయకుఁడుగూడ నుండెను. తురుష్కోద్యోగి వారినందఱను రాజధానికంపెను.

చోరనౌకపైఁగల ధనమంతయు సుల్తాను వశమాయెను. చోరులు నాయకునితోఁబాటు కారాగార బద్ధులైరి. వారు మరణశిక్షకుఁ బాల్పడవలసినదేగాని, వారు మఱియెందైనను ధనముదాచి యుందురని భావించి, రెండుమాసములలో నొకలక్ష నాణెములర్పించినచో వారిని జీవముతో విడిచివైతుమని ప్రధానమంత్రి తెల్పెను.

చోరనాయకుని దురవస్థ యెంతయు దుస్సహముగ నుండెను. యుక్తాయుక్తములు మఱచి దుర్గర్వమున నతిసాహస మొనరించుటచేఁ దనకట్టిచేటు మూడెనని వాఁడెంతయు విలపించెను. పరిహారధనం బర్పింతమన్న, చోరుల సర్వస్వ మానావయందే యుండెను. ఇతర ధనంబేమియులేదు. కాన, మరణముతప్పదు. ఐనను, నాయకుఁడు తనకై విచారింపక, తన, యవివేకముచేఁ దన యనుచరులుగూడ దుర్మరణమునకుఁ బాల్పడవలయుగదాయని కడుంగడు దుఃఖించెను. సాగరమువలె ననంతమై నగాధమైయొప్పు వాని విషాదమునకు వేఱు కారణములుకూడ నుండియుండును.

ఒక్కదినము తక్కువగా నిర్ణీతకాల మరుదెంచెను. ప్రభుత్వో ద్యోగియొకఁడా చెఱసాలకుఁబోయి, "ధనమర్పింతురా, లేక, మర ణింతురా" అని నాయకునిఁ బ్రశ్నించెను. ధనహీనుఁడగు చోర నాయకుఁడు తాము మరణింప సంసిద్ధులమని ఉత్తరమొసంగెను.

ఆ యుద్యోగి వెడలినంతనే మఱియొకఁ డరుదెంచి, చోరనాయ కుని సంబోధించెను. నవీనుఁడు గ్రీకుభాషనే మాటాడెను గాని

ఉచ్చారణము మాత్రము వెట్టుగ నుండుటచే నాజాతివాఁడుకాఁడని వ్యక్తమాయెను. ఆతని సముచితవస్త్రధారణమును, కారాధికారి సవినయముగ మెలంగుటయు జూడ, నాతఁ డొక యధికారియో ఏ ప్రముఖుఁడో కావలయునని చోరనాయకుఁడు గ్రహింపఁ జాలెను. ఆ పురుషుఁడు వానిప్రక్కనే ఆసీనుఁడై యిట్లుప్రశ్నించెను.

"చోరనాయకా! రేపు నీవు మరణింపవలయు గాఁబోలు?"

"ఇట్టి మాటాడుటకు నీ వరుదెంచియుండవని భావింతును."

"ఓయీ! ఎల్లి సూర్యోదయ మగునంతనే, జనసందోహములు చుట్టును గుమికూడి భూనభోంతరాళంబులు ఘూర్ణిల్లునట్లు నిన్నుదిట్టుచుండ నీవు వధ్యస్థానమున కీడ్వఁబడెదవు: చూడ భయంకరముగ నుండు నీదు ఘోరవిచ్ఛిన్నమస్తకము పాదుషావారి దుర్గసింహద్వారమున శూలాగ్రమునఁ బ్రదర్శింపఁబడుఁగదా."

చోరనాయకుఁ డెంతటి ధైర్యశాలియైనను స్వీయవధాప్రశంస దుస్సహముగ నుండెను. తన యభిప్రాయము నాతఁడు సూచించినను, నవీనుఁడు చలము వహించి నిర్దయుఁడై యిట్టులనెను—

"మృత్యువాసన్నమగునపుడు హృదయము సహజముగా భయాక్రాంత మగుకదా!...కాని, కరాళమృత్యువదనగహ్వరము జొరవలసిన నిన్ను దప్పింపఁగడంగువాని కేమి ప్రత్యుపకార మొనరింపగలవు?"

"యదార్థమగునేని నే నా మహనీయుని సోదరునిగాఁ బ్రేమింతును. ప్రేమించుటయే కాక ప్రాణదాతయగు నా యుదారవంతునకు మే మెల్లర మధీనుల మగుదుము."

అట్టి సంభాషణ కొంత యైనపిమ్మట, నవీనపురుషుఁ డిట్టులనెను—

"స్కయోద్వీపమును శాసించు గ్రీకుపాలకు నెఱింగియేయుందువు.

తురుష్క రాజధానియందలి ఫ్రెంచి రాయబారి ఆతని నెట్టులైన వశ పఱచుకొనఁ జూచుచున్నాఁడు. నేనా రాయబారి మిత్రుఁడను, దూతను. గ్రీకుపాలకుఁడు కఠినాత్ముఁడై తన దీవియందుండు ఫ్రెంచి కుటుంబములను గడు గారించుటచే వారచట నిలువఁజాలకున్నారు. అ పాలకునిఁ దొలఁగింపవలయునని మా రాయబారి ఎంతచెప్పినను తురుష్క ప్రధానామాత్యుఁడు సమ్మతింపఁడాయెను. కావున, మా వాఁడొక యుపాయ మాలోచించెను. సమయముజూచి ఆకస్మికముగా గ్రీకుపాలకు నాక్రమించి, రయమ్మున ఫ్రాన్సు దేశమునకుఁ దరలింపవలయును. నీ వీ కార్య మొనరింతువేని, మహమ్మదీయులు కోరు పరిహారధనం బీక్షణమర్పించి, నిన్నును నీ యనుచరులను విడిపించి, మీ కొక నౌక నొసంగెదను. కార్యసాఫల్య మగునంతనే, నీకు విశేషబహుమానముగూడ నిప్పింతును."

దుర్భర నిరాశార్ణవ మగ్నుఁడై పొరలాఁడు చోరనాయకున కా పలుకు లమృతప్రాయముగనుండెను. ఫ్రెంచిపురుషుఁడు నియోగించిన కార్యము కష్టసాధ్యమైనను, అసాధ్యముగఁగూడ గోచరించినను, తనకుఁ గడుసులభసాధ్యమని గ్రహించి, అమితోత్సాహపరుఁడై చోరనాయకుఁడు సమ్మతించెను. ఆరహస్య మెవ్వరికిఁ దెలుపరాదనికూడ నవీనుఁడు శాసించెను. చోరనాయకుఁడంగీకార సూచకముగాఁ దల పంకింప ఫ్రెంచిపురుషుఁడు సంతసించి తోడనే నిష్క్రమించెను. వాని ప్రవర్తనము గాంచిన చోరనాయకుఁడు, విపరీత విస్మయాక్రాంత చిత్తుఁడై వివిధతీవ్రాలోచనా విహ్వలుండై కారయందు నిముసములు లెక్కించుచుండెను.

ఆ సమాచారమటులుండ, సుందరాంగియగు నైరిణి నిజప్రియాగమనమునకై యనుదినము నిరీక్షించుచుండెను. సర్వజన భయంకరుండగు చోరనాయకుఁడు పట్టువడెనని తెలియుటచే నాభీతహారిణేక్షణ

నిజహృదయాధి నాథుఁడగు మనిలునకు వానివలని అపాయము తొలంగెగదాయని మాత్రము సంతసించెను. కాని, అంతమాత్రమున నేమాయె? సమున్నత తరంగసందోహాకరంబై, ప్రచండ మారుత ఘూర్ణితమై, క్రూరమత్స్యాదిజలచర విహరణ స్థలమై యొప్పుగ క్షీరానంత పారావారము కరంబపాయకరముగదా. కాన నాముద్దియ మగుడ భయాకుల మానసయై నిట్టూర్పు పుచ్చెను. కాని, ఆఱువారములలోఁ దన పర్యటనము పూర్తియగునని మనిలుఁడు పలికియుండుటచే నాకోమలి హృదయమొకింత భయరహిత మాయెను. ఆఱు వారములును క్రమముగ్గాఁ దిరిగిపోయెను. మనిలుఁడింకను రాఁడాయెను. నాఁటఁగోలె నీలదీపమెన్నఁడుదయించునోయని ప్రతి సాయంకాల మాబాల డోలాయమానమానసయై సాగరమువంక వీక్షింపఁ దొడంగెను. ఆవారమట్టులే గడచిపోయెను. అట్టివారము లనేకములు గతించినను ఐరిణీ మనోహరుఁడరు దేఱఁడాయెను.

ఆఱు నెలలాయెను. ఐరిణీమనోవ్యథ దుర్భరమై, దుస్సహమై వర్ణనాతీతమాయెను. ఆశోత్సాహదీపిత సుందరవదనము వియోగ భరంబున వైవర్ణ్యము నొందెను. ఆమెచేష్టలుఁగూడ తదనుగుణముగ నుండుటచే నామె జనకుఁ డొకనాఁడు భయాతురుఁడై తత్కారణ మరయఁబోయెను. హృదయము వియోగానలతప్తమై యున్నను మనిలునిపైఁగల విశ్వాసానురాగము లట్టులే యుండెను. తనప్రియుని యనుజ్ఞ అగుపఱకు నా రహస్యముం దన జనకునకైన నెఱింగింప రాదని దృఢముగ నిశ్చయించి, ఆతని కా విషయ మెఱింగింపక ఏమేమియో సమాధాన మీయదొడంగెను. తన మనోహరునకే యపాయమైన వాటిల్లియుండునని వెఱచి, ఆతఁడు సురక్షితముగఁ దిరిగిరావలయునని కరుణాసింధుఁడగు పరమాత్ముని ప్రార్థించెను.

శీతకాలమట్లు గడచెను. సకలజనహృదయానురంజకమగు వసంత

మరుదేఱ, ప్రకృతి నవీనసౌందర్య వైభవముతో నలరారెను. వాతావరణము ప్రశాంతయుత మాయెను. ఐరిణి ఒకనాటి సాయంకాలము విహారణార్థము సముద్రతీరమునకుఁ బోయెను. చిరకాలము సంచరించిన యా ప్రదేశము గాంచినంతనే, గతసంతోష వృత్తాంతము లాకాంత స్మృతిపథంబునఁ దోఁచెను. మానసము తదాలోచనాధీనమైయుండ, నౌకాదండంబుల దడబడ లాకస్మికముగా వినవచ్చెను. పెందత్తరంబున నైరిణి మోమెత్తి తిలకించెను. నౌక యొండు కాన్పించెగాని నిజప్రియాగమన సూచకమగు నీలదీపము కానరాదాయెను. నౌక సమీపించుకొలది, అందుండు వాఁడు మనిలుఁడు కాఁడేమోయను భయమధికతరమాయెను. అంతలో నా నౌక తీరమున నిలిచెను, ప్రణయ ప్రపూర్ణులగు నైరిణీ మనిలులు పరస్పరాశ్లేష సౌఖ్యమున నోలలాడిరి! తదుద్రేకమొకింత యడంగ నా కామిని ఇట్టులనెను.

"మనిలా! అరుదెంచితివా? ఇంత కాలయాపన మొనరింపనేల? మదీయ నిశ్చలప్రేమ మెట్టిదో పరీక్షసలుపఁ గడంగితివా? అయ్యో! అటుగాక, అపాయ మెద్దియేని వాటిల్లెనా?"

"ప్రేయసీ! ఒక అపాయముగాదు—నిన్నా నాఁడు ఎడబాసి వెడలినంతనే ఈ హతభాగ్యుఁడు చోరులకుఁ జిక్కెను. నిన్నుఁ జెట్టపట్ట నాసించిన నాయనంత ధనమంతయు గోల్పోతిని—తుదకు బానిసీఁడనైతిని. సుందరీ! భగవదనుగ్రహమునను, ధైర్యస్థైర్యగుణ సమన్వితులగు నా యనుచరుల సాహాయ్యమునను ఆ దురవస్థ యంతరించెను. ఒక నావ పోయిననుఁ మఱియొకటి కలదు. కాని, ఏటి ప్రయోజనము? ఈ నిర్ధనుఁడు నీ జనకునెట్టు మెప్పింపఁగలఁడు?"

నిజనయనకంజాతములనుండి విమలముక్తాఫలోపమాన బాష్పబిందువు లవిరళముగ రాల, దీనకంఠస్వనంబున నైరిణి ఇట్టులనెను.

"మనోహరా! మదీయ శ్రేయోభిలాషియగు జనకుఁడు నిన్ను

నిరాకరించువాఁడు కాఁడని యెఱుఁగుము. నేఁడాదివారముగదా—ఆ సాధుజనుఁడీ సమయమున నిజభ్రాతృశరీరనిలయ ప్రాంతమున దైవచింతా నిమగ్నుఁడై యుండు—ఆఁ!"

ఐరిణి కెవ్వున నఱచెను. కారణమేమి? ఆ ముహూర్తమున నాకస్మికముగా దుపాకి శబ్దము భయంకరముగా వినవచ్చెను. ఆ ముహూర్తముననే సముద్రమధ్యమున నొక జువ్వమింట కెగసెను! మనిలుఁడు వడివడి నిట్టులనెను.—

"ఆహా! ఆసంజ్ఞ నాకనుభవైక వేద్యము. నీరము తేవలయునని నా యనుచరుల నంపితిని. కాంతా! నేనికఁ బోవలయు—ఒక్కక్షణమైనను దడయరాదు. ఇఁకఁ గలియమేమో—"

పిడుగు పడిన విధమున మ్రాన్పడి, అవిరళాశ్రుధారార్ద్రకపోలయై ఐరిణి విలపించెను—

"ఇఁకఁ గలియుమా! మనోహరా! ఇట్టి యాశారహితకఠినాలాపము లాడనేల? నీదు భయంకరసముద్రయానమున నేఁగూడఁ బాల్గొనిన బాగుండునే! మారుతముల ఝూంకారధ్వానములును, గంభీరసముద్రభంగవ్రాతముల గర్జలును నాకు మృదుమధురగానము వలె మనోహరమగును."

మనిలుఁడు తత్తరపడుచునే ఇటు లనెను.—

"సుందరీ! నీ కసాధ్యమగు కార్యముగుఱించి తలంపనేల? మన వివాహము నీ జనకుఁ డెన్నఁడైనను సమ్మతించునదిగాదు—నన్ను వారింపకుము—పాలకుఁడు ప్రాణత్యాగ మొనరింపఁజూచు గాని తన సమ్మతి యొసంగఁడు. కాంతామానసము ప్రేమాధీనమగునేని, తల్లిని, తండ్రిని, అక్కను, అన్నను,—అందఱను విడనాడి తాఁ బ్రేమించు గాంతు ననుసరించును. సుందరీ! సాహాయ్యరహితవై పలుసారు లీతీరమున కరుదెంచు నిన్ను రాక్షసంబుగఁ గొనిపోఁ

జాలు నీబలశాలి వినిర్మలనిశ్చలానురాగపూరితహృదయుఁడై బాల కునిచందమున నిన్నర్థించువాఁడు—విశ్వాసబద్ధవై యరుదెంతువా? ఐరిణీ! ఏమందువు? మనకొఱకొక నౌక నిరీక్షించుచున్నది. 'మోరియా' యంచలి తొలివీడు జేరునంతనే యథాక్రమముగా మనము వివాహ మాడఁగలము."

ఐరిణి తన మస్తకము ప్రియుని పేరుటురమునఁ జేర్చి నిరుత్తర ఆయెను. ఆముద్దియ మనోపథమమందానందమయ దృశ్యము లతో నిండిపోయెను. మనిలునిస్వరము మనోహరముగ నుండెను. ఐరిణి మాటాడనేరక చేష్టరహితయైయుండ, నా యువకుఁ డామె కౌనుపైఁ జేయివైచెను. తీరమున నా ప్రణయినీప్రణయులు కొంత దవ్వు సుఖంబుగ విహరించినంతనే, మనిలునినౌక కట్టెదుట గోచ రించెను.

మనోహరదీనస్వరంబున మనిలుఁ డిట్లు ప్రశ్నించెను—

"ప్రేయసీ! ఏమందువు? నీ ప్రియుని విశ్వసించి యరుదెంతువా?"

"మనోహరా! రాఁజాలను—నిరాకరింపవలదని హృదయ మనుచున్నది."

ఐరిణి యా తెఱంగున నస్పష్టముగఁబలుక, మనిలుఁడు తదభి ప్రాయము మెఱింగి, దృఢతమ భుజాదండంబులబట్టి ఆ కన్నియను నౌకపై జేర్చెను. తోడనే, తానును లంఘించి, నౌకాదండంబులఁ బూని వడివడి త్రిప్పదొడంగెను. కొంత దవ్వరిగినంతనే, ఆనౌక నిలిచెను, మనిలు డిట్టులనెను.—

"ఐరిణీ! నీ హృదయ మెటులున్నది? విచారాక్రాంతచిత్తవైకుం దెదవాఏమి?"

మనిలుని ప్రవర్తన మామెకు ధైర్యము గొలుపుచుండుటచే నా కాంత ఏవిచార మెఱుంగక నిశ్చలముగ నుండెను. అంతలో

మనిలుని పెద్దనావ సమీపించెను. తోడనే మనిలుఁడు నిజసతీసమేత ముగా నం దధిరోహించెను. ఐరిణిం దోడనే తన గదియందుఁ జేర్చి, నావికు లేమిచేయుచుందురో యాతఁడు పరీక్షింపఁబోయెను.

ఐరిణీ మనిలుల నావ పోయిపోయి, 'కొరాను' అను నగరము జేరెను. తాఁ జెప్పినటు లాయువకుఁడు తోడనే మతాచార్యుని రావించి యథాక్రమంబుగఁ దమ వివాహము జరిగించెను. కొన్ని దినములు వారచట సుఖముగఁ గడిపిరి. ఒకనాఁడు మనిలుఁడు తన ప్రియురాలినిగాంచి, తాను మగుడ సముద్రయాన మొనరింపవలసిన యవసర మరుదెంచెనని యల్లనఁ బలికెను. పతిసేవాపరాయణ యగు గ్రీకుకన్నియ యాతని ననుగమించుటకు సంసిద్ధురాలాయెను. మనిలుఁ డిట్టు లనెను—"ప్రేయసీ! నీ వీమిత్రగృహంబుననుండుము. సముద్రయానము సుకరముకాదు. కష్టమెఱుంగని కోమలాంగివి నీకీపర్యటనము కడుదుస్సహంబగు. మార్గమధ్యమున నీ జనకునిఁ గాంచి మన యుదంత మెఱింగింతు—నీపుత్రిక యొనరించిన నేరము సైరింపుమనియు, నాయెడ బద్ధానురాగయై సుఖంబుగ నున్నదనియు, నెఱింగింతు"...

మనిలుఁ డటు లేమేమియో చెప్పెనుగాని, ఆసాధ్వి తదాలాప ములఁ బాటింపక, వనీలనయననిర్గళితాశ్రుధారలు మెండుగ మెఱయ దైన్యముగ నర్థింప, నాతఁ డియ్యకొనెను. నావ మగుడ సముద్ర తరంగముల నుత్తరింపఁదొడంగెను.

ఆ ప్రయాణము ఐరిణికి బాగుగనేయుండెను. క్రమముగా నౌక యంతయు నామెకుఁ బరిచయమాయెను. మనిలుఁ డెల్లెడలఁ దిరు గాడుచు సర్వ మరయుచుండెను. ఆతని గదిక్రింద నొకయత అమరి యుండెను. అం దేముండెనో మనకుఁ దెలియదు. ప్రతిభాగము నందును దమ తమ పనులపై విచ్చలవిడిగఁ దిరుగాడు నావికు

లావంకమాత్రము పోకుండిరి. కొంద ఱాచట్టును నిరంతర మప్రమత్తులై కాఁపుండిరి. ఆద్వారము మనిలుఁ డొక్కఁడే ఎప్పుడో యొకపుడు తీయుచుండెను. ఆతఁడుతప్ప మఱి యొరులందుఁ జొచ్చుట లేదు. అట్టి సమయములం దాతని మానస మేలకో విపరీతానుమాన బాధితమగుచుండెను. నిశీథసమయమున నాతఁడు శయ్యనుండి లేచి ఆప్రదేశము సురక్షితముగా నుండెనాయని తిలకించుచుండెను. అందుండి సవ్వడి యేమైనను వెలువడునేని, ఆ సమయమునఁ దన భార్యప్రశ్నించునేని, ఆతఁడు విహ్వలచిత్తుఁడై వెలవెలవోవుచుండెను.

ఐరిణి ఆ యా విషయములు క్రమముగా గుర్తించెను. ధీరస్వాంతుఁడగు తన మనిలుఁ డట్లు కలవరపడనేల? ఆమె కేమియు దోఁపకుండెను. ఐనను, ఆమె మానస మేలకో విపరీతభయానుమాన బాధిత మాయెను. మానస మా కారణమున దహించుకొనిపోవుచుండినను, మగనిరహస్య మరయుట మగువకుఁ దగదని యెంచి ఆ మానవతి సహించి మిన్నకుండెను.

కొరానా తీరమువీడి చాల దినములాయెను. నావ యింకను బోవుచునేయుండెను. తా మెన్నఁడు స్కయోద్వీపము జేరగలుగుదుమో, తా నెన్నఁడు తనజనకుని గాంచజాలుదునో యని ఐరిణి తత్తరపడుచుండెను. క్రమముగాఁ దనకాంతు నామె యనుమానింపఁ దొడంగెను. స్కయోద్వీపమునకుఁ జేరు తలం పాతనికి లేదని ఆమె భయపడఁజొచ్చెను. ఒకనాఁడు సమయముజూచి, భయాకుల మానసయగు నాకాంత ప్రశ్నింప, మనిలుఁ డిట్టులనెను—

“ఐరిణీ! నీతో నొకానొక మహావిషయము గుఱించి ముచ్చటింపవలయునని చిరకాలమునుండి నిరీక్షించుచుంటిని. నేటికి నీవే అట్టి యవకాశము గల్పించితివి. నీప్రేమము నిశ్చలంబని విశ్వసించి--”

ఐరిణి సహజముగాఁ గుపితయై వాడిగ నిట్టులనెను—

"ఎన్నఁడైన ననుమానించితివా? నీరహస్యము లన్నియు నా కెఱింగింపకుండుట కదియే కారణముగావలయు!"

"కాదు, కాదు! నావంటి భాగ్యహీనుని వెంబడించుటకు నీ హృదయ మంత నిబ్బరముగ నుండునాయని సంశయించు చుంటిని——"

"ఆర్యా! వివాహమునకుఁ బూర్వమే నా హృదయము నీయధీన మాయెగదా——నీతోడ వధ్యస్థాన మెక్కుటకు గూడ సంసిద్ధనై యుంటినే! ఇఁక మనము పవిత్రవివాహపాశబద్ధులమైనపుడు వేఱుగఁ జెప్పవలయునా?"

"ఐరిణీ! తొందరపడకుము. నాయుదంతమువూర్తిగ నీవెఱుంగవు. నేను ధైర్యస్థైర్యములుగల గ్రీకునావికుఁడననియు, ఎట్టి యపాయమైన సరకుగొనక అంబరచుంబిత తరంగములపై నుయ్యెల లూగుచు వాణిజ్యముచేయు ధనార్థిననియు మాత్రమెఱింగి దృఢానురాగబద్ధవై నన్నెంతయు గారవించితివి. సహజనిశ్చలోదార చిత్తవగు నీవు నాదు వంశాదులెన్నఁడు బ్రశ్నింపవైతివి, నేను పరమానంద భరితుఁడనై యుంటిని. ప్రశాంత మహాసముద్రమున నాకస్మికముగఁ జెలరేగు ప్రచండ ఝంఝూనిలంబుకంటెను తీవ్రతరంబగు మదీయకథా శ్రవణమున నీదు సదభిప్రాయము తొలంగ, దుర్భరదుఃఖార్ణవ నిర్మగ్నవు కాఁగలవు. నీవింకను నన్నుఁ బ్రేమింప జాలుదువా?"

ఐరిణి దురంతభయ సంభ్రమాకుల హృదయయయ్యు, "ప్రేమింతును? తప్పక ప్రేమింతును!" నని వడివడి బదులాడెను.

తోడనే మనిలుని రూపుమాఱెను. ముఖాంతర రక్తనాళములు పొంగ, సహజ నిశ్చలవదన మాకస్మికముగఁ బ్రజ్వలింప, నాతఁడు తీవ్రస్వరంబున నిట్టులనెను——

"ఎఱుంగుదుగదా!——మహాసముద్రమధ్యమున భయంకరస్వైర

విహారి మొనరించిన చోరనాయకుని! వానిఁ బట్టవలయునని నీ జనకుఁడగు గ్రీకుపాలకుఁ డొనరించిన విశ్వప్రయత్నము లెట్లు వ్యర్థమాయెనో, ఆ యసాధ్యచోరనాయకుఁ డెట్లు తనుఁ గనుఁబ్రామఁ దలఁచిన పాలకునిఁ దానే వంచించి ఎట్లు మహావిజయములు గాంచుచుండెనో గూడ నెఱుంగుదుగదా." ఐరిణి అనిమిషనయనయై, నిశ్వాసనిబద్ధయై, ప్రకంపితహృదయయై ఆలించుచుండెను—"ఐరిణీ! గమనింపుము! సర్వజనభయంకరుఁడై అఖిలదేశవాణిజ్యవినాశకారణుఁడై, అభినవభూతనాయకుఁడో యని భ్రాంతిగొల్పిన ఆ చోరనాయకుఁడు నీ సమీపముననే యున్నవాఁడు—నీదు మానసము హరించి ఈనౌకను శాసించువాఁడే ఆ చోరనాయకుఁడని గమనింపుము!"

"అసంభవము! అసంబద్ధము!" అని యఱచి ఐరిణి తత్సమీపశయ్యపై వ్రాలి పనవిపనవి విలపించెను. ఆ మానవతి దురవస్థ వర్ణనాతీతము. కొంత తడవా కాంత శరాఘాతముగ నేడ్చి పిమ్మట యూరటఁగాంచి, ప్రసిద్ధగ్రీకునారీజన సహజోదార మచ్చుపడ నిట్టులనెను—"మనిలా! ఏమైనను, బహుకష్టసంకీర్ణమగు జీవనపథంబున నిన్ననుగమించుటకు సదా సంసిద్ధురాలను. నీ వఖిలజనకంటకుండవగు నా చోరనాయకుఁడవైనను వెనుదీయుదానఁగాను."

మనిలుఁడు పరమానందభరితుఁడై ఆ పరమసాధ్వి కోమల కరపల్లవము నల్లన ముద్దాడి, సహజనిశ్చలస్వరమున నిట్టులనెను,—

"ఐరిణీ! నీవిఁక భయ ముడిగి యుండనగును. అనంతధనసంపాదన మొనరించిన చోరనాయకుఁ డికఁ దొంటితెఱంగున వర్తింపక సాధుజనుఁడై జీవించును. కానిఁ ఒక్కపని యింకను బూర్తికావలయు. మృత్యుముఖమునుండి నన్ను దప్పించిన ఒకానొక మహనీయుఁడు పంచినకార్యము నెఱవేఱిసగాని, దృఢతమసమయపాశవిముక్తుఁడఁ

గాఁజాలను. తత్కార్యము బాధాకరమైనను, సహించి చేయవలయు. నేను తురుష్కనౌకాధ్యక్షునిచేఁ బట్టువడి రాజధానియందుఁ గారాగారబద్ధుఁడనై తదధికారులు దారుణముగ విధించిన విపరీత పరిహార ధనంబుఁ జెల్లింపఁజాలక మరణింపనుండిన సమయమున నామహానీయుఁడు తద్ధనంబు నా వంతు సమర్పించి నన్ను రక్షించెను. ఆ మహాపురుషుఁడు నా తలపై నొక మహత్తరకార్యభారము మోపెను. నేను విడువడిన యనంతర మీ నావ ఆయత్తపఱచి, తత్కార్యసాధనాయత్తచిత్తుఁడనై బయలుదేఱితిని. సుందరీ! ఇట్టి కారణములచే నిన్నుఁ మగుడఁ గాంచుట కింతకాలమాయెను."

"ఆర్యా! ఆ కార్యభార మెద్దియో మున్ముందు వచియింపుము!" అని ఐరిణి వడివడి ప్రశ్నింప, మనిలుఁ డిట్టులనెను.—

"కాంతా! మనము తొలుఁదొల్త "మరసీలు" నగరమునకుఁ బోవలయు. ఈ దిగువ గదియం దతి భద్రముగ నుంచిన బందాను ఆ నగరమున దింపివేయవలయును."

"ఆ బందా ఎవ్వరు? సత్వర మెఱిఁగింపుము!"

"ఐరిణీ! నీవే చూడఁగలవు. కాని, అసాధారణవైపరీత్యము గోచరించును. కావున స్థిరచిత్తవై యుండుము."

"నా చిత్తము నిశ్చలముగ నున్నది. ఈ విశ్వప్రపంచమునం దెంతటి యపాయము వాటిల్ల నున్నను, నా మానసము భయ మెఱుంగదు."

తోడనే, మనిలుఁ డామె నా రహస్యమందిరము చెంతకు, గొంపోయెను. సాయుధుఁడై 'అప్రమత్తుఁడై యా స్థలమునం గావలియుండిన నావికుఁడు వారికి దారి యొసంగెను. ముందు నీ వరుగుమని తన భార్యతోఁ బలికి మనిలుఁడా ద్వారమున నిలిచెను.

ఐరిణి ఆ క్షణమె అప్రయత్నముగా నందుఁ బ్రవేశించెను. ఆ

కోమలాంగియందుఁ జొచ్చినంతనే కెవ్వున నఱచెను. అందుండిన గ్రీకుపాలకుఁడు పట్టుకున్నవో, విచ్ఛిన్నరంభాస్తంభము వలె నానుకుమారహేమగాత్రి నేలఁబడి యుండెడిది!

"హా! ప్రియపుత్రీ! ఐరిణీ! నీవా! ఈ చోరాధముని బాఱికి నీవును జిక్కితివా! హా! విధీ——"

ఐరిణీ జనకుఁడగు గ్రీకుపాలకుఁడా తెఱంగున ఘొల్లునవిలపించుచు మూర్ఛపోయిన తన పుత్రికకు వలయు శీతలోపచారము లొనరించెను. ఆమె సేదదేఱి ఉన్మాదిని వలె, జూచి యస్పష్టముగ నిట్టులనెను.—"ఇది కలయా? సత్యమా? నా నయనములు నా శ్రవణములు నెలవులు దప్పెఁగాఁబోలు. ఇదియొక మాయాప్రదర్శనము గావలయు."

"ఐరిణీ! స్థైర్యము వహింపుము. నీ జనకుఁడు గ్రీకుపాలకుఁడే యిందు బంధితుఁడై యుండువాఁడు."

"ఏమీ——బంధితుఁడా! నిన్నేల బంధింపవలయు? మనిలునితోఁ జెప్పి ఈ క్షణంబ నిన్ను విడిపింతును——"

గ్రీకుపాలకుఁడు విచారకంపితకంఠుఁడాయెను.—"అయ్యో! ఆ చోరనాయకునితోడ నీకుఁ బరిచయ ముండునా."

"పరిచయ మున్నది! మా హృదయము లన్యోన్య.——"

"మందబుద్ధీ! మాటాడకుము! రమ్యహర్మ్యమున సుఖంబున నుండు మనల నీ నికృష్టావస్థకుఁ బాల్పేసిన ఆ నరాధముని ధర్మవిరుద్ధముగ నాశ్రయించియుంటివని తలంపనైన దలంపజాలను.

"ఐరిణి అధర్మ మెఱుంగదు!" అని నిశ్చలంబుగఁ బలికి తోడనే ఆమె విచారకంపితస్వరమున నిట్టులనెను——"జనకా! మనిలుని గాంచి ప్రేమించినపు డాతని యుదంత మెఱుంగను. ప్రణయము నాటుకొని నిశ్చలమై దృఢతమమైనంతనే తదావేశమునకు వశంవదనైతి. నీ

యనఁ జవడయక, నీకెఱింగింపక యీ తెఱంగాచరించిన నీయెడ నపచార మాచరించితి. నీ వెంత దూషించినను, తలయొగ్గెద. కాని, యథార్థ మాలింతువేని, నీ హృదయభార మడంగును. తండ్రీ! నిశ్చలప్రేమానురాగబంధురహృదయనై సునిలుని సక్రమముగ వివాహ మాడితినే గాని జారిణివలె నధర్మమున కుద్యమింపలేదని గ్రహించి మన్నింపుము."

"మందభాగ్యా! ఎంతపని యొనరించితివి! నవనీతసదృశపవిత్రవంశము కళంకిత మొనరింతువా?"

పాలకుఁ డట్లు నిందాగర్భముగ విలపింప నాహతభాగ్య జనకుని పాదముల నాలింగన మొనరించి దుర్భరదుఃఖాతిరేకమున గొల్లున నేడ్చెను. పాలకుఁడు గాఢచింతానిమగ్నుఁ డాయెను. అట్టి తఱి సుని లుఁడరుదెంచి, అవనత శరీరయగు తన భార్యను రయంబున లేవదీయ వలయునని తలంచియు నిగ్రహించుకొని, గ్రీకుపాలకు నుద్దేశించి ఇట్టులనెను.—

"అయ్యా! నీ సంతాప కారణ మెఱుంగుదు. ఐరిణి చోరనాయకుని వివాహ మాడితినని తెల్పినంతనే భవదహంకారమయ రుధిర ముడికి యుండును. ఐనను నీ పుత్రిక ఏలోప మెఱుంగక హాయిగ నుండునని గ్రహించి సంతసింపుము. మఱియు తొల్లిటి భయంకర చోరనాయకుఁడా యవతారము చాలించి ఇఁక సాధుజనుఁడై మను వాఁడని ఐరిణి ఎఱింగియే యున్నది. ఆర్యా! మత్ప్రియపత్నీసన్నిహిత బాంధవున కుపకారము సలుపవలయునని నా హృదయము ప్రోత్సహింపుచున్నను, దృఢతమసమయబద్ధుఁడ నగుటచే నటులాచరింప నసాధ్యము. మరసీలునగరమున వేచియుండు నధికారులకు నిన్నందఱ జేయవలయు."

గ్రీకుపాలకుఁడు సహజముగా దుర్భరక్రోధానల తప్తుఁడాయెను.

ఐనను సహించుకొని యిట్లు ప్రశ్నించెను.—"ఓయీ చోరనాయకా! జాతి మతగృహస్థధర్మవిరుద్ధమగు నిట్టి గర్హితకార్యమునకు నిన్నెవరు నియోగించిరి?"

ఫ్రెంచిరాయభారి. ఆ మహానీయుఁడే మహమ్మదీయ ప్రభువులు విధించిన పరిహారధనము జెల్లించి నన్ను రక్షించెను. ఆతని యాజ్ఞకు బద్ధుడనై యిట్టు లొనరించితిని."

"ఫ్రెంచి రాయబారియా! హాఁడా! హా!" అని గొణఁగుచు సర్వదహనాయమానదారుణబడబానల సన్నిభాలోచనలు హృదయమునఁ జెలరేఁగ గ్రీకుపాలకుఁడు తల్పమున వ్రాలి అచేతనుఁడాయెను."

ఆ రహస్యము బయల్పడరాదనియు నా దౌర్భాగ్య నూఱడింప వలయుననియు నైరిణితోఁ బలికి మనిలుఁడు వెడలెను.

అనుకూలవాయువు వీచినంతనే వారి నావ మగుడ యానమొనరింపఁ దొడంగెను. మరసీబునగర మంతకంతకు దగ్గఱ యగుచుండెను. కాని ఐరిణి యవస్థ దుస్సహముగ నుండెను. తద్దురవస్థ అసాధారణము కేవలము వర్ణనాతీతము. పితృభక్తిపరాయణయు నసాధారణ పతివ్రతామతల్లియు నగు నా సాధ్వి మహాసంకటమునఁ బొరలాడెను. జనకునకు ధైర్యము గఱపుచు వినమ్రయై తన మగని బ్రార్థింపఁ దొడంగెను. సకలదేశవాసులను గడగడలాడించిన భయంకరచోరనాయకుఁ డయ్యు, మనిలుఁడు హృదయము లేనివాఁడు గాఁడు. వలయునెడ దన భార్యకొఱకుఁ దన ప్రాణమునైన విడనాఁడజాలు గాఢాభిమానమయత్యాగశీలుఁడయ్యు, నీ సమయమున మాత్రము సమయబద్ధుఁడై ఆ కారణమున స్వాతంత్ర్యరహితుఁడై యుండుటచే అవిరళాశ్రుజలార్ద్రముఖాంబుజయై వినమ్రయై అవనతశిరస్కయై ఐరిణి ప్రకంపితస్వరంబున దైన్యముగ బ్రార్థించినను చోరనాయకుఁడు గ్రీకుపాలకుని విడుచుట కియ్యకొనఁడాయెను.

వారు క్రమముగా మరసీలు రేవుజేరిరి. మనిలుఁడు నగరదుర్గ రక్షకుని చెంతకుఁ బోయి తన యుదంత మెఱింగించి రాయబారి యొసంగిన పత్రములు నిదర్శనపూర్వకముగాఁ బ్రదర్శించెను. కొన్ని దినములైన పిమ్మటఁ దన భార్యను గాంచి పితృవియోగమునకు సిద్ధపడి యుండవలయునని మనిలుఁడు హెచ్చరించెను. ఆ కాంత మగుడ నశ్రుజలములు మున్నీరై ప్రవహించునట్లు మధురకలస్వనమునఁ దన మగని బ్రార్థించెను. ఐనను, సమయబద్ధుఁడగు మనిలుని హృదయము కరుగదాయెను. తుదకా దుష్టముహూర్త మాసన్నమాయెను. ఐరిణీ జనకుల వియోగము భయంకరమై వర్ణనాతీతమై యుండెను. తద్దురంతవియోగభరమ్ము సైపఁజాలక ప్రేమస్వరూపిణి యగు నైరిణి జీవరహిత సువర్ణసాలభంజికవోలె మూర్ఛిల్లెను. మనిలుఁడు తోడనే యొక పరిచారికను రావించి ఆమెను దన మందిరమునఁ జేర్చెను.

అంతలో మరసీలు దుర్గపాలకుఁడు తోచెను. ఆతనితో సాయుధులగు సైనికు లిరువురుమాత్ర ముండిరి. రాయబారి ఆజ్ఞయగుటచే, గ్రీకుపాలకుని వదనము దట్టమగు నినుపముసుఁగుచేఁ గప్పఁబడెను. ఆ యఘోరదృశ్యము గాంచినంతనే, కఠినహృదయుఁడగు మనిలుఁడు గూడ సహింపజాలకపోయెను. అనంతర మాదురదృష్టవంతుఁ డొరులకుఁ గానరాకుండ నొకదుప్పటి దట్టముగఁగప్పి, నిర్జనంబై యంధకారమయంబై యుండు నిశీథసమయమున నాక్రమించియధికారి ఆతనిఁ దనదుర్గమునకుఁ గొంపోయెను. తత్పూర్వమే ఆతఁడు మనిలున కొకయోగ్యతాపత్ర మొసంగెను.

కార్య మావిధము చక్కఁబడినంతనే మనిలుఁడు తన నావఁద్రిప్పి, తురుష్కరాజధానియగు కాన్స్టాంటునగరముజేరి, మరసీలు దుర్గాధిపతి యొసంగిన పత్రము గ్రహించి రాయబారి కొసంగెను. ఆతఁడెంతయు ముదమంది, సమయబద్ధుఁడై కార్య మతిజయప్రదముగ

నొనరించినందులకు మనిలునిఁ గడుఁగొనియాడి, అమూల్యపారితోషికము లొసంగఁబోయెను. వానినెల్ల సగౌరవముగ నిరాకరించి చోరనాయకుఁ డిట్టులనెను-

"ఆర్యా! నాకుఁ బ్రాణదాన మొనరించిన మహోదాతవు. నీవు నియోగించిన కార్యము భంగపడకుండ నొనరించి నీఋణము దీర్చుకొంటిని. వేఱు పసదనము వలదు."

అనంతరము మనిలుఁడు తననౌక నమ్మివైచి తత్ప్రాప్తధనము దన యనుచరులకు గొంతపాలువెట్టి, ఐరీణీసమేతముగా స్కయోద్వీపము జేరెను. తాము చిరకాలము పలుసారులు నిగూఢముగఁ గలియుచుండిన ప్రణయంపుఁ దావున నొకదివ్యభవన మాతఁడు నిర్మించెను. కాని, వాని ప్రియపత్నియవస్థ ఎటులుండెను? జనకుని దురంత దురవస్థ చిచ్చువలె నామెహృదయము దహించివేయుచుండెను. పతిభక్తిపరాయణయగు నామానవతి తనదారుణవిషమావస్థ ప్రియునకెఱుకపఱుపకుండిన కారణమున నామె యవస్థ మఱియు దుస్సహముగ నుండెను. కఠినదృఢదారుస్తంభము జొచ్చి కంటికిఁ గానరాకుండ లోలోన దొలిచెడు క్రూరకీటకమువలె విచారమామెహృదయమును దినివేయుచుండెను. ఒక్క కుమారుని మాత్రము గని ఆపరమసాధ్వి అచిరకాలమున దివి కేగెను.

తన ప్రేమైకనిధాన మంతరించుటచే మనిలునకు జీవనము దుస్సహమాయెను. కొంతకాల మెటులో పోనిచ్చి, ఒకనావ నాయత్తపఱచి, అదృష్టవశమునఁ గంటఁబడిన తొంటియనుచరులఁ జేరదీసి, ఇతరులనుగూడ నాహ్వానించి, మనిలుఁడు మగుడఁ జోరనాయకుఁడాయెను. కాని, యౌవనమద మడంగుటచే నాతఁడు దురుష్కనావల జోలికిఁ బోక, ఆతీరముల పొంతకైనఁబోక, తత్ప్రభుత్వవైరుల నౌకలను యథేచ్ఛముగా దోఁచుకొని, అమితధనవంతుఁ డాయెను.

మనిలుఁడు చిరకాలము జీవించెను. రాజధానియం దాతఁడు విపులవైభవసమన్వితమగు భవనము నిర్మించి అమితసుఖ మనుభవించెను. తాను మరణించు సమయమున గ్రీకుపాలకుని రహస్య మాతఁడు తన కుమారున కెఱింగించెను. నాఁటఁగోలె నీమహారహస్యము దనతండ్రివలనఁ బుత్రుఁ డెఱింగి, వాఁడు తన యవసానకాలమునఁ సుతునకుఁ జెప్పుట ఆచారమూయెను. అన్యు లెఱుంగరు.

౨౪

## శీతలారామము.

ఖాలీంఁడు వినిపించిన యీకథ పాషాకు మఱియుఁ బ్రీతికరముగ నుండెను. స్త్రీజనంబులుగూడ తదేకధ్యానమున నాలించిరి. ఏమన, అయోముఖముగల మనుజుఁడు ప్రతీతిపూర్వకముగా వారికిఁ జిరపరిచితుఁడై యుండెను. అందలి గాథమాత్ర మెవ్వ రెఱుంగక, పలువురు పలువిధము లాడుచుండిరి. ఈ కథ యన్ననో అందనుక వారు వినియుండిన గాథలకంటె గడుసమంజసముగను విశ్వసనీయముగను నుండెను. దల్తబను పాషా యథాపరికార మాలోచనాపరుఁడై ఇటులనె —

“స్కయోద్వీపము బాలించు గ్రీకుపాలకు నెవ్వరో యెత్తుకపోయిరనుట చరిత్రప్రసిద్ధము. ఇందు ఆవంతయు సందియమున కవకాశము లేదు. అయోముఖము దాల్చిన మనుజుఁడుగూడ బ్రసిద్ధుఁడే. వాఁడు చిరకాలమా బందియందుండినను, వాని పూర్వచారిత్ర మేరికిఁ దెలియకుండెను. కాని, ఆగ్రీకుపాలకుఁడే అయోముఖుఁడని ఎన్నఁడు వినియెఱుంగను.”

ఖాలీలుఁ డిట్లు బదులాడెను.—

"పాపా! నేనీవిషయము కొంతపరిశ్రమ యొనరించితి. తురుష్క ప్రభుత్వాధికారులు భద్రపఱచిన పత్రములు గొన్నింటిఁ బరిశీలింప, నీరహస్యము గ్రహింపఁజాలితిని."

"కాని, మిత్రమా! చరిత్రకారులు వేఱువిధములు వ్రాసి యుండిరే?"

"నిజము. ఒక్కొక్కఁ డొక్కసమాధాన మొసంగఁబోయెనుఁ కాని, ఎవ్వఁడును జరిత్ర యెటులుండునో అరయరైరి. అట్టివార లాఱుగురున్నారు. ఆ యార్గురును ఆఱుపాత్రలను నిర్ణయించియుండిరి. వానినెల్ల సులువుగా ఖండింపనగును."

"ఎట్లు?"

"అందు రెండు కేవల మసంబద్ధములని చెప్పినంత మాత్రముననే గ్రహింపనగును. వాఁడును, ఫ్రాన్సుదేశము బాలించిన పదునాల్గవ లూయీరాజును గవలని యొకసిద్ధాంతము. ఫ్రెంచిదర్బారు నందలి సాంప్రదాయము గుర్తింతుమేని, విషయము వ్యక్తమగును. ఫ్రెంచి రాణులు బహిరంగముగాఁ బ్రసవించుట సాంప్రదాయసిద్ధము. రాజ వంశజులును, అత్యున్నత ప్రభుత్వోద్యోగులును, కొందఱు రాజసభికులును గూడ నచ్చో గూడియుందురు. నాఁటి ఫ్రెంచిరాణి వివాహానంతరము ఇరువది వత్సరములకు గర్భవతియగుటచే నాప్రసవగృహము ప్రేక్షకజనసంకీర్ణ మాయెను. కవ లుదయించినచో, నావిషయము దాగునా? అసలు, దాగవలసిన యవసర మేమున్నది? కాన, ఈ సిద్ధాంత మసంబద్ధముగదా. ఇక రెండవది విచారింతము. తదయోముఖుఁడు ఫ్రెంచిరాణి గూఢజుఁడఁట. అయ్యది నిక్కమగు నేని, రాజు జీవించియుండగనే, గూఢజుఁ డుదయింపవలయును. కాని, ఆనెపై నప్రతిహతవైరము వహించి, సహస్రగూఢచారుల ముఖం

బున నాగాజపత్ని చర్యలెల్ల నరయు సమర్థ ప్రధానామాత్యుఁడు—
'రిఘులూ' ఎఱుంగకుండునా? ఎఱింగి యూరకుండునా?......"

మిగిలిన నాలు సిద్ధాంతములుకూడ ఖలీలుఁడు సహేతుకముగా ఖండించెను. పాషా మొదలగు వారందఱు గడుశ్రద్ధమెయి నాలించిరి. నిజమనోహరుని యనందవైజ్ఞానముగాంచి జులేఖా లోలోనగర్వించి ముదమందెను. కథ జెప్పఁగోరఁది తురుష్క యువకుని సుందరవదన ముత్సాహముతో దీపించెను. సహజముగఁ గాంతిపుంజములు వెద జల్లు నామోహనాంగుని విశాలనయనము లధికతరదీప్తివంతములా యెను. తన హృదయచోరుఁడంత మనోహరముగ నెన్నఁడు దోఁప లేదని జులేఖా సంతసించెను. ఖలీలునిగాంచి యానందించునది యొక జులేఖామాత్రము గాదు; ప్రభుపత్నియగు నిస్మిల్లాకూడ నట్టులే యానందించెను.

ఇస్మిల్లా స్వభావము పాఠకులకు విదితమే. ఆమె హృదయము నిష్కళంక విమలాభిమానమున కాకరముగాక స్వైరిణీజనసహజ కామోద్రేక పూరితముగదా. సర్వాంగసుందరాంగుఁడగు ఖలీలునిఁ గాంచినంతనే, ఆమదవతి కామాతుర ఆయెను. లూకాసునుగాంచి నంతనే ఆతఁడును మన్మథప్రాయముగ గోచరించెను. జూలియను తటస్థమై నపుడుగూడ నాభోగవతి మానసమట్టులే ఉద్రేకించెను. ఈసమయమున నాముగ్వురు గాన్పించిరి. గ్రీకు లిర్వురు మనోహరా కారులేయైనను, తురుష్క యువకుడు మఱియు నాకర్షణీయుఁడాయెను.

కథాశ్రవణాభిరతలగు కాంతల ముసుఁగులు క్రమముగాఁ దొలం గెను. వీక్షణమాత్రముననైనను దల్లబను పాషా వారింపకుండుటచే, జారినముసుఁగులువారు సవరింపకుండిరి. ఆకారణమున ఖలీలును మనమలరగాంచుటకు ప్రభుపత్ని కవకాశమాయెను. తన్మనోహరా కారము నయనపర్వ మొనరించు సమయమున ఆప్రక్కనేయుండిన

తన మగనిమోముకూడ దృగ్గోచరమగుచుండుటచే వారిరువురకుఁగల వ్యత్యాసము కడుంగడు స్పష్టమాయెను. రూపురేఖలులేని అట్టివృద్ధునకు దాను భార్యనైతిగదాయను తలంపాకాంత మనమున జురుక్కున నుదయించెను. తలంచునంతమాత్రమున నామెహృదయము తీవ్రముగఁ గంపించెను. అసలే ప్రేమాస్పదుఁడుకాని ఆభర్త మఱియు నసహ్యకారణుండాయెను. చిరకాలప్రవర్ధిత దురాలోచన లాసమయమున మఱియు దుష్టతరములై, దృఢతరంబులై ఆశావంతములు గూడ నాయెను.

నౌక మగుడ విమలజలమార్గము ననుసరించి యల్లనఁబోఁదొడంగెను. యువకులు మువ్వురొకవంక నాసీనులగుటచేఁదమ ప్రియకాంతలతో గుసగుసలాడి ఆనందించుట యసాధ్యమాయెను. విధివశమున గపటనాటకమాడుచుండిన ఖాలీలుఁడుమాత్రము సంతసించెను. జులేఖా ఖాలీలుల ప్రణయము ప్రభుపత్నికిఁ దెలియు నవకాశము దానఁదొలంగెను.

నౌక క్రమముగా నొక మనోహరవిశాలారామమునుసమీపించెను. అయ్యది వరుసవరుసలుగ వాలుగ నీటివఱకు విస్తరిల్లి గట్టునకు నూరడుగులెత్తున నుండెను. ఆమీఁద నిబ్బరముగఁదోఁచు మందిరము నిరుపమాన సౌందర్యముతో నలరారుచుండెను. అనంతమై నవవికసిత కుసుమనికర విరాజమానమై, బహుళఫలవృక్ష సంకీర్ణమైయొప్పు నావనముగూడ వర్ణనాతీతముగ నుండెను. అట్టితావుంగాంచి యెఱుంగని ఖాలీలాదియువకులు పరవశాత్ములై అనిమిషనయనులై చూడదొడంగిరి. లెక్కకు మీఱిన జలస్తంభము లాచుట్టును జలము లెగుర జిమ్ముచు గడుమనోహరముగ నుండెను. తనమిత్రుల మనోభిప్రాయమెఱింగిన దత్తబను పాషా తోడనేయిట్లులనెను.—

"మిత్రులారా! మీమనోరథముకడు సులభసాధ్యము. ఈయనంత

క్షేత్రాధిపతి మత్ప్రియమిత్రుఁడు. ఆతని, గాంచి చాలకాలమాయెను గాని అభ్యంతరముండబోదు. రాజధానియందలి మంత్రివర్గములో నొకఁడగు నామిత్రుఁడీ సమయమున నిందుండువాఁడుగాడు. మీరు కొంతకాలమిందు సుఖముగ విహరింపవచ్చును."

పాషా యట్లుపలికి సన్నయొనరింప, నొగ నిలిచిపోయెను. తోడనే యందఱు నేలకు డిగ్గిరి. ఒక సేవకుఁడు ధూమనాళముబట్టి పిఱుంద భద్రముగ నరుదేఱ, శీతలలతాగృహంబొంతు పాషా చేరఁబోయెను. అందాతురుష్కమహనీయుఁడు సుఖాసీనుఁడై, ధూమయంత్రాంతర సుగంధతోయములు గుడగుడ రవంబులొనరింప ధూమపాన మొన రించి వికసితవదనుఁడై ఈలోన నరుదెంచిన బందుగులగాంచి సంతో షితస్వరంబున నిట్టులనెను.— "మీరందఱు వనవిహార మొనరించి రయంబున నరుదెండు. ఒక్క విషయము మాత్రము మఱువక ప్రవ ర్తింపవలయు, జంటజంటలుగావీడి నాకపయశ మార్జింపకుఁడు. తోఁటకాఁపరులెవ్వరైనఁ గాన్పింతురేని, నానామ మెఱిఁగింపుఁడు. పొండు."

పాషాసెలవు ఇస్మైల్లాకుఁగూడ వర్తించుటచే నాకామిని హృదయ ముప్పొంగెను. దర్తబను పాషా ముగించులోపుననే ఖలీలుఁడు సమ యముజూచి తన ప్రియురాలి శ్రవణమున నేమియో గుసగుసలాడెను. తాను సూర్యాతపంబోర్వఁజాల ననియు, మామకు సాహాయ్యముగా నందేయుందుననియు నామె పలికెను. పాషా ఇయ్యకొన, ఇస్మైల్లా తెర జా గుల్నేరులు మేల్ముసుఁగులు దట్టముగఁదాల్చి ముందుగ నడిచిరి. ఖాలీలాది యువకులావెనుకనుండిరి.

దర్తబనుపాషా దృష్టిపథమునుండి తొలంగినంతనే, తమప్రియ కాంతలతో నేకాంతముగ విహరింప నువ్విళులూరు జూలియనులూకా నులు ప్రార్థనపూర్వకముగాఁదమ తురుష్కమిత్రునిపైఁ జూడ్కులు

బలుపిరి. ఖాలీలుండు రహస్యముగ నిస్మిడ్లాతో ము చ్చటింపవలయునని వాంఛించెను. ఆకారణముననే ఆతఁడు జులేఖాతో గుసగుసలాడి ఆమె తమతో రాకుండచేసెను. ఒంటిపాటున నా సుందరయువకునితో మాటాడవలయునని ప్రభుపత్నియు కడుంగడుద త్తరపడు చుండెను. ఈవిహారసమయమునఁ దమప్రియులతో ధారాళముగ సరససంభాషణ మొనరించి యానందించుట కవకాశమేర్పడునో లేదోయని తైరజా గుల్నేరులు లోలోనఁ దల్లడిల్లిరి.

ప్రభుపత్ని యంత ఖాలీలునికాంచి సాభిప్రాయముగా నిట్టులనెను. "ఆర్యా! ప్రణయబంధుర హృదయులగు నీయువతీయువకులను గ్రూర ముగ నరికట్టుట పాడియగునా?"

"నిజము. నాహృదయముగూడ నట్టులేయనుచున్నది; ముందాడు టకు సాహసముచాలక ఊరకుంటిని."

"దుర్భరమగు పాషా దురాగ్రహము సహించియైనను, ఈప్రణయ ముగ్ధుల ముచ్చటతీర్చెద." నని పలికి వారి నుద్దేశించి, ఆప్రౌఢాంగన మగుడనిటులనెను.—"కన్నియలారా! తన కసహ్యాకరముగనుండు ఈ రహస్యము మీాజనకుఁడెఱుంగకుండుగాక."

తైరజాగుల్నేరు లానంద సూచకముగ మందహాసమొనరించి సమ్మతించిరి. తోడనే, జూలియను లూకాసులు తమకాంతల కేల్పట్టి వేర్వేరు మార్గము లనుగమించిరి.

మిగిలియుండిన ఇస్మిడ్లా ఖాలీలులుగూడ మఱియొక దెసఁబోయిరి. ప్రభుపత్ని మేలిముసుఁగు బోఁద్రోచి ఆమనోహరాకారుని భుజాదం డము నాశ్రయించి, గాఢంపుఁగామ వికారము వదనమునఁ దాండవింప మంజుల స్వనంబున నిట్టులనెను.—"మోహనాంగా—మనోహరా! మదీయ హృదయవాంఛితమీాడేరె. ప్రయాణమొనరించునపుడే మన మేకాంతముగ నుండు నవకాశము చిక్కునని ఆసించియుంటి. ఆహా!

నీతో నెంతయో మాటాడవలయు!"

సజ్జనుఁడగు తురుష్క యువకుఁడు నిజహృదయ సంక్షోభమునడంచి లేని ఆనందోత్సాహములుదాల్చి నిక్కంపుఁ గామాతురునివోలె దోఁచి, మధురమందహాస విరాజితుఁడై, తానును తత్సమానోత్సాహములతో వేచియుంటినని తదవసరానుకూల మధురస్వరంబున బదులాడెను.

"సుందరాంగా! నీవు నిక్కముగఁ బ్రేమింతువా!" అని అవ్యక్తముగఁ బలికి ఆ కామినీమణి తదవసరావేశమునఁ బ్రకంపించుగురు వక్షోజము దనకాంతుని భుజాదండము హత్తించెను. ఖలీలుఁడు మఱియు మనోహరముగఁదోఁచి ఇట్టులనెను.—

"కాంతా! నీహృదయము శంకాకళంకితముగానేల? భవదీయ సుధారసాంచిత దివ్యవదన సందర్శన సంజాత మన్మనోవికార మెఱుక పఱచి, తొల్లిటి ప్రేమమఱచి నీకధీనుఁడనై యుంటిగదా! నీపైఁగల కూర్మిపేర్మినేగదా జులేఖాను దలంపకుంటిని. ఇంకను సందియమా?"

"సుకుమారా! సందియముగాదు. మృదుమధురాంచితములగు నిట్టి పలుకు లెన్నిసారులాలించినను, ఇంకను ఆలింపవలయుననియే యుండుట సహజముగదా! సరసజ్ఞా! నన్నే ప్రేమింతునని మగుడ సమయ మొనరింతువుగదా."

తురుష్క యువకుఁడు సముచితముగఁ బలుక, అవిరళ మోహ పరవశయగు నాయింతి అవ్యక్తముగ నిట్టులనెను. "సుందరుఁడా! నా హృదయము పూర్తిగ నీయధీనమాయనని నీవెఱుంగుదుగదా— నీ మానసమున కనుభవైక వేద్యము గావలయు! ఆహా! నీయునికి నేనెన్నఁ డెఱుంగని విపరీతానంద పారవశ్యమొదవించుచున్నది. దృఢానురాగ పాశబద్ధులమగు మనమెడబాటెఱుంగక నిరంతర సౌఖ్యార్ణవ తరంగముల నోలలాడఁ జాలుట కొఱకు ఎట్టి యవసరకృత్యమైనను, ఎంతటి

కఠినవ్యాపారమైనను, ఏ భయంకరాచారమైన నొనరింప వలయునని మానస ముద్రేకించుచున్నది?"

ఖలీలుఁడు సంతోషమభినయించి ఇట్టులనెను.—

"కాంతా! నీపలుకులు కడుతీవ్రములు. కాని, మనము నిరంతరము గూడియుండుట అసాధ్యముగదా!"

"అసాధ్యమా?"—వీడియాడుకపిలవర్ణవిరాజితశిరోజముల నొక కేలసవరించి, రెండవకరమ్మున నా మనోహరవీరుని భుజము బిగియ బట్టి ఇస్మిల్లా మగుడ నిట్టులనెను—"అసాధ్యము గానేల? నీవు సర్వస్వతంత్రుఁడవుగదా? చిన్నాసియా దేశమునందలి ప్రసిద్ధశ్రీమంతవంశోద్భవుఁడనని పాషాతోఁ జెప్పితివిగాదె?—అట్టి మహనీయుఁడవు నీ వీలోకమున నే లోపములేక అఖిలభోగభాగ్యముల నోలలాడఁ జాలుదుగదా?"

"ఔను—అట్టులే యగుగాక. కాని, నీవు—"

ఖలీలుఁడు ముగింపకమున్నె, ప్రభుపత్ని ఆకస్మికముగ విపరీత కఠినాననయై ఇట్టులనెను—

"నేనా! యువకుఁడా! నీవనుకొనినట్లు, నేను దుస్సహవైవాహిక దాస్యశృంఖలాబద్ధనై, కేవలము స్వాతంత్ర్యరహితనై యుండలేదు."

"కాంతా! నాకేమియు గ్రాహ్యముకాకున్నది!" ఖలీలుని కౌటిల్యము నరయుక, ఇస్మిల్లా ఇట్లు బదులాడెను.—

"మనము నిరంతర మేకస్థులమైయుంట అసాధ్యమంటివిగదా. సుందరాంగా! నిశ్చలప్రేమాయత్తచిత్తయగు మగువ కేదియసాధ్యము? నిబిడాంధకారమునుండి లేచి మహాసామ్రాజ్యనిర్మాతలై ప్రసిద్ధి వడసిన నానా దేశస్థమహావీరులు అసాధ్యమును పదమెట్టింగియుండిరా? పురుషునివోలె వనితయు నట్టులే సమర్థురాలు. రణరాజకీయము లందుఁ బురుషులు ప్రవీణులగుదురుగాక. ప్రేమరంగమున వనిత

విజృంభించి విజయములఁగాంచి విరాజిల్లఁగలదు. భర్తలమని విఱ్ఱవీగు మహనీయులు మమ్ముల నంతిపురంబుల దాచియుంతురేకాని మా మానసముల నరికట్టఁజాలరని యెఱుంగరు. నిజానిజములు నీకుఁ గర తలామలకముగదా!"

"నిజమె యగు, గాని, కాంతా! పర్యవసానమేమి? మంజుల వీణారవంబున వెలువడు నీ వాక్సుధారసము నిర్నిమిత్తముగఁ బ్రభ వింపదుగదా!"

"నిక్కము!"—ఖాలీలుని మనోహరాభినందనముచే నా కాంత మానసమానందపరవశ మాయెను—"మనోహరా! మదీయప్రేమైక నిధానమా! మోహపరవశయై, ఇతరవిషయములు వేనిని జీరికిం గొనక స్వీయసౌఖ్యమును నిజహృదయాపహరణ క్రియాదక్షుఁడగు ప్రియునిసౌఖ్యమునుమాత్రము పరమావధిగఁ బరిగణించి కృత నిశ్చయయై యుండు కామిని కెద్దియు నసాధ్యముగాదని నీకుఁ దెలుప నమకట్టితిని. హా! ఖలీల్! సుందరాంగుల ననేకులఁ గాంచియుంటి: వారందఱు నాప్రేమకుఁ బాత్రులైయుండిరి. నాచిత్తము తాత్కాలిక ముగఁ గలంగుచుండెను. నీవన్ననో! నా హృదయమును వింత తెఱంగునఁ గలంచితివి. ఈప్రేమావేశ మసాధారణము. తదావేశ మున నెట్టి కార్యమైన నొనరింపఁజాలుదు—మన పరస్పరసౌఖ్య సంపాదనార్థము ఎంతటి విపరీతఘోరాచారమైన నొనరింప సమర్థు రాలనని చెప్పియుంటిని!"

హృదయము మోహప్రపూర్ణమైనట్లు తురుష్కయువకుఁ డా మోహనాంగిపైఁ జూడ్కులు బఱపి యిట్టులనెను—

"కాంతా! నా హృదయముగూడ నితాంతప్రేమపూరితమై యున్నది! కాని, నీ నాథుఁడు?"

"నాథుఁడా! మన సంపూర్ణసౌఖ్యానుభవమున కాతనియునికి

ఒక్కటియే అడ్డు. మోహనాంగా! నిన్నుఁ గాంచిన నయనములతో నాతని గాంతునేని, నామానసము దుర్భరాగ్రహానలతప్త మగును—చెప్పజాలని అసహ్యాభావ ముదయించును—తలంచునంతమాత్రమున నా హృదయము దహించుకొనిపోవుచున్నది.—"

ఖాలీలుఁడు మిథ్యాప్రవర్తన మొనరించుచున్నను, సహజముగ ఋజువర్తనుఁ డగుటచే నట్టి పాపాలాపము లాలింపఁజాలక, వారింపఁ బోయెను. ఇస్మిల్డా ఇట్టులనెను—

"నాపలుకులు తీవ్రముగ నుండుగాక—నా హృదయము వెలి బుచ్చితిని—కాని, మనోహరా! మనము కలసియుందమా?—నేను నీదాన నాయెద—నీవును బూర్తిగ నాయధీన మగుదువా? మన హృదయములవలెనే మన ధనంబులుగూడ గలపోసి అవిరళమోహార్ణవనిర్మగ్నులమై హాయిగనుందమా? నీవియ్యకొందు వేని, ఇయ్యది సులభసాధ్యము."

అట్టులాడు ప్రభుపత్ని యభిప్రాయ మెఱింగియు నెఱుంగనట్లు ప్రశ్నించి, ఖలీలుఁడు వీక్షణంబులఁ బ్రోత్సహింప నాకామిని ఇటులు బదులాడెను.—

"పాపా తనయనంతధనరాశి దాచియుంచుతావు నే నెఱుంగుదు. ఇఁక నావృద్ధుని ప్రాణమూ—మన యధీనముగదా?"

"కాంతా! నీవు హరింతువాయేమి?"—ఖలీలుని స్వరము డగ్గుత్తికఁ జెందెను.

"మోహనాంగ! నీకై హరింతును! ఆహా! నీ హృదయము జూరగొని చిరసౌఖ్యాంబుధి దేలియాడనాసించు నీవనిత ఎంతటి క్రూరకార్యమైనఁ దప్పక ఒనరించును."

నుష్టకామాతురమున నొడలెఱుంగని ఆ మదవతి నిజకరాంచిత మనోహరహస్తము నెత్తుకొని ముద్దాడెను. ఖలీలుఁ డిట్టులనెను—

"కాని, పట్టువడిన, నపాయకరముగదా! ఘోరమగు శిక్షకుఁ బాల్పడవలయునే?"

నిజమనోహర నీలనయనములం దన ప్రియునిపై నిల్పి ఆస్వైరిణి ఇట్టులనెను.—

"అపాయ మేమియులేదు. సుందరాంగా! ఆ శీతలలతామందిర మున నిన్నటిరేయి నీవు వినిపించిన హెలీనా జిజీముల చిత్రకథ ముగిసిన యనంతరమువచ్చిన సంభాషణ మఱచితివా?"

"మఱువలేదు—కాని, పూర్తిగ జ్ఞప్తికి రాకున్నది. స్వప్నగత విషయమువలెఁ గొంతకొంత యస్పష్టముగ మనంబునఁ దోఁచు చున్నది."

ప్రభుపత్ని వదనమున నాగ్రహాతురములు తోఁచెను. తానా ప్రసంగము దెచ్చినంతనే తనప్రియుఁడు గ్రహించి తోడ్పడునని ఆమె ఆసించెను. అటుగాక ఖాలీలుఁడు వేఱువిధమున నుండుటచే, దా నొనరింపఁదలంచిన దుష్కార్యము సమగ్రముగ వక్కాణింపవలసి వచ్చెను.—

"సుందరాంగా! మఱచితివా నీ మిత్రుఁడు లూకాసు చేసిన విషాభివర్ణనము? పోపు వంశజులును రష్యారాజవంశజులును ఆవిషము నిరంతరము బ్రయోగించుచుండిరట—"

"ఆ! తెలిసినది. ఆ పాషాణవిషౌషధము గుఱించియా? ఆవిషయ మున నాకు మఱికొంచెము తెలియును. కాని, నీకును తక్కుంగల కోమలాంగులకును దుస్సహంబనిఎంచి చెప్పకుంటిని."

"తెలియునా? ఏమి తెలియునో రయమ్మునఁ దెలుపుము."

"అనేక విద్యలతోఁబాటు రసాయనశాస్త్రము గూడ నాకుఁ గడుపరిచితము. నేను సంకల్పింతునేని, అట్టివిషము సులువుగాఁ దయారుచేయఁగలను."

ఆపలుకులు వీనులఁబడి నంతనే ప్రభుపత్ని సుందరవదన మాకస్మికముగ భయానక రాత్రిసానంద దీపితమాయెను.—"ఏమంటివి! నీకట్టి సామర్థ్యముగలదుగా?"

"మిథ్యా ప్రగల్భములు నాకసహ్యము. సుందరీ! ఈవికసిత పుష్పచయంబులు జూడుము. చూచుటకెంతయు సుందరములు, నవ్య సుగంధబంధురములు, నవనీతకోమలములు. కాని, విషౌషధ రచనకు వలయు పదార్థము లీసుమవ్రాతములోని ప్రతిదానియందు నడంగి యుండు: వీనియందే గాక, ఇసుకయందు, ఢాలయందు, మఱియే యితర వస్తువునందును గూడ నిమిడియుండు—"

"కాని, లూకాసు చెప్పిన పాషాణము?"

"కాంతా! తళతళ మెరయు నీశిలాఖండములు జూడుము— ఇవియు విషపదార్థ సంభరితములని గ్రహింపుము. విశేషపరికర సాహాయ్య మావంతయు నపేక్షింపక మదీయపరిశోధనాగారమునం దుండి అనలాంబువుల సాయము మాత్రము వడసి అమోఘ విష మొండు తయారుచేయఁగలను—"

"చాలు చాలు! ధన్యురాలను! నేఁడు నిక్కముగ సుదినము! ఆవిసమెద్దియో సత్వరమొసంగుము-నీకొఱకద్దానిఁ బ్రయోగింతును!"

"దానఁగలుగు నపాయము?"

"నే నా బాధ్యతవహింతు. ఆవిసము మెసవువాఁడు కొన్ని వారములు రోగార్తుఁడై క్రమముగాఁ గృశించి కృశియించి రోగనైజ మెఱుంగకయే, తాను రోగగ్రస్తుఁడనైతినని అరయఁజాలకనే చచ్చునని లూకాసు తెలిపెగదా. కాన, మనము తీవ్రపడక అట్టులే యొనరింతము. కార్యమా తెఱంగున నిరపాయముగాఁ జక్కఁబడును. కాని, నీమాట స్పష్టము గావలయు—నీకు సమ్మతమని ఒక్కింత సూచింపుము, చాలును—ఎట్టి యకార్యమైన నొనరించి చిరతరా

నంద సంపాదన మొనరింపఁ బ్రయత్నింతును. అసహ్యాకరమగు పతి ప్రేమాభిజ్ఞ దాస్యపంకపరిత్యక్తనై, నీకు మదీయహృదయార్పణ మొనరించి నీదాసనైయుందు. ఖలీల్! నీవు ధనవంతుఁడవు గావచ్చును; ఐనను, నాకతంబున సధికతరానంత విత్తవంతుఁడవై రాజభోగము లనుభవింపఁగలవు. సుందరాంగా! ఏమందువు? ఒక్కమాటాడుము."

ఖలీలుఁడు సమ్మతించి, తా నాకాంతకుఁ జూపిన తాళాలను భద్రముగ జేబునం దుంచి ఇట్టు లలెను—"సర్వసౌఖ్య ప్రదమగు సాధన మిపుడు నాయధీనమైయున్నది. కాని, సుందరీ! నిన్ను మగుడ గాంచు టెట్లు? రెండు రాత్రులును—"

"సుందరాంగా! రెండు రాత్రులును నీవు భగ్నమనోరథుఁడ వైతివి—నామనోవ్యథ మఱియు నధికతరము. కానిమ్ము—చతుర మతియగు అమీనా సాహాయ్యమున మనమెట్టులోఁ గలియఁగలము. కాని, ఈలోపున మందు సిద్ధమగునా?"

"సిద్ధము కాఁగలదు. కాని—ఆహా! మనమిం దరుదెంచి ఎంత కాలమాయెను! చాల కాలమగుటచే పాషా వెదకులాడుచు నిటు రానగును. మన మొక వంకను, తమ ప్రియులతోఁ బాటు పుత్రిక లొక వంకను గాన్పింతుమేని—"

ఖలీలుఁడు వాక్యము పూరింపకమున్నె గుల్నేరు లూకాసులుదవ్వున గోచరించిరి. ఆకారణమున, ఖలీలుఁడు ప్రభుపత్ని భుజవలయమునుండి రయంబున వెలువడెను.—"తరుణీ! మనము జాగరూకులమైయుండ వలయు. ఆయువజను లనుమానించుట కవకాశమీయక, కేవల నిశ్చల స్నేహపూర్వకముగా విహరించునట్లు తోఁపవలయు."

అంతలో లూకాసు గుల్నేరులును, తైరజా జూలియనులును వారినిఁ గలసికొనిరి. జులేఖా పాషాలను విడి చాలకాలమగుటచే నిఁకఁ దిరిగి పోవుట పాడియగునని ఖాలీలుఁడు పలికెను. తోడనే

కాంతలు నిజకులాచారాను గుణముగ ముసుఁగుల నుచితముగఁ దాల్చి, తమ కోమల పాదపద్మము లల్లనల్లన ధరాతలముంజుంబింప నడిచిరి. కొంత దవ్వున యువకులు వారి ననుఁగమించిరి.

శీతల లతాగృహమున దల్పంబను పాషా గుఱగుఱ ధన్వి యొనరించుచు మేను మఱచి నిద్రాసౌఖ్యము బూర్తిగఁ జూరగొనుచుండెను. ప్రభువు నిద్రాపరుఁడై సంతనే చేఁదప్పిన ధూమనాళము ట్టెపడి యుండెను. ఆప్రక్కనే యుండవలసిన జులేఖా మాత్రము గానరాకుండెను!

## ౨౫

### జులేఖా యుదంతము

మామచెంగట నాసీనయైన జులేఖా యేమి కావలయు? నూరు గజములలో నున్న నౌకయందామె యుండవలయునని సహజముగ యోచించి, గాఢనిద్రాధీనుఁడైన పాషాను మేల్కొల్పక యే ఖాలీలాదు లటుబోయిరి. జులేఖాను గాంచి, ఆ మహమ్మదీయప్రభువు పసుండి ఎంత కాలమాయెనో అరయకుండ నిద్రాభంగ మొనరింప రాదని వా రాలోచించిరి. నౌక దృగ్గోచరమాయెను; తచ్చోదకులు భయసంభ్రమాకులులై అప్రయత్నముగ దండములు బట్టిరి; జులేఖా మాత్రము కానరాకుండెను.

ఖాలీలాదులు వడివడి బ్రశ్నింప, జులేఖా యటు రాలేదనియు, నామె జాడ తా మెఱుంగమనియు బానిసలు ప్రత్యుత్తర మొసంగిరి. గుల్నేరు భీతచేతస్కయై జులేఖాకు నెద్దియో యపాయము వాటిల్లెనని యఱచెను. తత్క్షణము దాము వెదకవలయునని హైరజా

యనెను. "పాషా గాఢనిద్రాపరుండగుట గాంచి అటులందే యుండుట సహింపక, ఇందెందో విహరించుచుండును: ఈ సరి కరుదెంచి యుండును. రండు." అని ఇస్మిల్డా వాక్రుచ్చెను.

తోడనే వారందఱు మగిడి పాషా శయనించిన తావునకుఁ బోయిరి. ఆతఁ డప్పుడే ప్రబోధితుఁ డగుచుండెను. మేను మఱచి, జగము మఱచి, మృతప్రాయుఁడై పడియుండిన ఆ మహనీయుఁడు మాత్రము జులేఖా ఏమాయెనో ఏమెఱుంగును? ఖలీలాదులు వెడలిన యనంతరము పాషా మాటపాటించి జులేఖా యపూర్వ మధురకల స్వనమున గానమొనరించెను. మ్రోడులు చిగిరించెను: శిలలుద్రవించెను: పాషా మేనుమఱచి శయనించెను. అనంతరమేమాయెనో ఆమహనీయుఁ డేమియునెఱుంగఁడు. ఖలీలుఁ డిట్టులనెను.— "మన మూరక కాలహరణమొనరింపక నలువంకల వెదుకవలయు. అలసిన అయ్యబలామణి బుద్ధిపూర్వకముగా నీ స్థలము వీడియుండదు. ఎద్దియేని అపాయము సంభవమై యుండు."

ఇస్మిల్డా మానసము తోడనే ఈసున భగ్గుమనెను.— "జులేఖా అచిరకాలమున నరుదేఱ గలదు. మీ రనవసరాందోళనము వీడి యుండుడు."

ప్రభుపత్ని హృదయావస్థ గుర్తించిన ఖలీలుఁడు తన హృదయారాటము నడంచి గాంభీర్యము వహించి యుండవలయునని ఆమె శ్రవణమున నల్లనఁ బలికి, తన మిత్రుల నుద్దేశించి తాము తత్క్షణ మన్వేషణార్థము వెడలవలయునని హెచ్చరించెను. తోడనే ఆ యువకులు మువ్వురును మూడుమార్గములందు నమ్ములవలెఁ బాఱిరి.

జులేఖా విషయమిఁక నరయఁ బ్రయత్నింతము. దత్తనుపాషా నిద్రాధీనుఁడైన పిమ్మట జులేఖా గానము నిలిపి, నిజమనఃప్రభవాలోచనానిర్మగ్న ఆయెను. అంత నాకస్మికముగ, నాచుట్టు దట్టముగ

బెఱిగియున్న సాంద్రతరగుల్మలతా నివహముల నలుకుడి యైనటు లాయెను. జులేఖా ప్రకంపించి, చుట్టుం బరికించి, ఏమియుం గానక మగుడ నాలోచనాధీనమానస ఆయెను. ఆ సవ్వడి మగుడ వెలువడు టచే నా లతాంగి కుతూహలంబున దిగ్గున లేచి అవ్వలకేగి, చూడం బోయెను. తోడనే, ఆ కోమలి దుష్టనిష్ఠురకనవీక్షిత ఆయెను: ఆ దురాత్ముని రెండవచేయి ఆ సుకుమారహేమగాత్రి సుందర లాక్షార సారుణితాధరోష్ఠములను బంధించుటచే, నా హతభాగ్య కెవ్వున నఱచుటకునైన నవకాశము లేకపోయెస. తదవసర భయాతిరేక మున నామె తక్షణము మూర్ఛిల్లెను.

దాది బిడ్డ నెత్తుచందమున నా క్రూరుఁడు జులేఖాను దాల్చి, అశ్రమమున వాయుసమానజవమునఁ బరుగిడఁ జొచ్చెను. ఆ పథం బున కిరుదెసల వృక్షములు గుజ్జుగఁ బెరిఁగియుండుటచే నాపికులుగాని మఱి యెవ్వరుగాని వానినిఁ జూడరైరి. వాఁడా తెఱంగున నా విశా లారామము నిరపాయముగాఁ గడచి, మఱియొక వృక్షసంకీర్ణోప వనము జొచ్చిన యనంతరము జులేఖా కనువిచ్చి పరికించెను.—నీల జీమూతసన్నిభదృఢగాత్రుని వికారాకారము భయంకరముగ గాన్పించెను !

జులేఖా తెలివొందెనని తెలిసినంతనే, ఆ రక్కసుఁడామెను మర కత ప్రభలతో నొప్పు పచ్చికపై దింపెను. వాని యభిప్రాయ మేమి? ఏమియోగాని, ఆ ఘోరాకారుని ప్రవర్తనము విపరీతముగ నుండెను. మేఘనిర్ముక్తసుధాకరబింబమునలె మునుఁగు దొఱంగిన ఆ సొగసు లాడి యపూర్వ సుందరాననమును, సువ్యక్తముగఁ దోఁచు నితర వివిధమనోహరాంగకములను గూడ తెప్పపాటు మఱచి అపూర్వా తురమునఁ దిలకింపుచు వాఁ డానందింపఁ జొచ్చెను. జులేఖా భయ విహ్వల ఆయెను. అంత నా కాంత యొకింత ధైర్యము దాల్చి, లేచిఁ

మోకరించి, ముకిళితహస్తయై మూర్తీభవించినదీనత్వమువలె దోఁచెను. ఆ శఠుఁడు తాల్చిన శ్వేతవస్త్రములు జలార్ద్రములగుటయేగాక, పంకనిలయములు గూడనై యుండుటచే, వాఁడు కొంతకాలము క్రిందటనే జలమున మునిఁగియుండునని వ్యక్తమగుచుండెను. వాఁడు మన చిరపరిచితుఁడగు సిద్దీ మస్రూరయే అని పాఠకులు గ్రహించియే యుందురు. జులేఖా మాత్రము వానిని గనివిని యెఱుంగదు. కాన నామె వినమ్రయై భయప్రకంపితయై ఇట్లు ప్రశ్నించెను.—"నీ వెవ్వఁడవు? ఇట్టు లాచరింపఁ గతం బెద్ది?"

"నేనా?—నన్ను మస్రూరయని పిలుతురు. ఇంతకాలము నీ మామ యగు దల్తబనుపాషా బానిసీఁడనై యుంటిని."

"బానిసీఁడవా?"—భయనమ్ర సంభ్రమభావములు తోడనే యంతరింప, నామానిని దిగ్గున లేచి, క్రోధవివశయై, మగుడ నిట్లు ప్రశ్నించెను—"బానిసీఁడవై యుంటివా? ఐన, నిప్పుడు పాఱి వచ్చితివా?"

"నిజము. దల్తబను పాషా సేవనుండి తొలంగుటయే గాదు, ప్రాణము నిల్చుటయే దుర్ఘటము పట్టువడినచో మరణము తప్పదు గాన, నిలిచిన తావున నిలువనేరక, ఇందందుఁ బరుగులాడుచుంటిని. కాని, సుందరీ! వాని పని పట్టింతును—నా మోహము తీఱుటయు, నాకసి తీఱుటయు గూడ నొక్క కార్యమున సిద్ధించును. సుందరీ! ఏమందువు? ఈసిద్దీని వివాహమాడెదవా?"

ఎంత విపరీతము! ఎంత దారుణము! జులేఖా కెవ్వున నఱచి, తద్భయావహారంగమునుండి తొలఁగు దానివోలె చలించెను. తోడనే ఆభయంకరాకారుఁడు అయోమయముష్టిచే నాయబలను గ్రూరముగఁ బట్టెను. కాని, అట్టి నిష్ఠురాచరణ మనవసరము. ఏమన, భయాధిక్యమున జులేఖా కరచరణములు కట్టువడిపోయెను. ఘాతుక

మృగోచిత భీషణవీక్షణములు నిగుడించి, భయానకముగ సిద్దీ ఇట్టు లనెను.—

"నన్నుఁ దప్పించుకొని పాఱుట అసంభవము. అట్టిప్రయత్నము నిరర్థకము. నీవు నాయధీనవైతివి. ఒక్క క్షణమాత్రమున నిన్ను నాభుజబలమున నలిపివేయఁగలను."

ఆనరాధముఁడట్లు తనయంతర మరయక ప్రేలినంతనే, జులేఖా క్రోధప్రకంపితయై, సుందరసంధ్యారుణరంజితవదనయై, విశాలతర నయనయై, ఉద్విగ్నస్వరంబున నిట్టులనెను.

"దురాత్మా! ఒడలెఱుంగక వదరుచుంటివి! నన్నుగాదు, మదీయ శిరోజమైనఁదాఁక సాహసింతువేని, ఎట్టికఠినశిక్షకుఁ బాలగుదువో తలఁచి భయకంపితుఁడవుగమ్ము!"

"కాంతా! నాయునికి బయల్పడినను, క్రూరశిక్ష తప్పదు. కావున నన్ను వెఱపింపఁ బ్రయత్నింపకుము. సుందరీ! కాలహరణ మొనరింపక, నాభార్యవుగమ్ము. నేను ధనరహితుఁడనే యైనను, నష్టములేదు. నీయాభరణము లమూల్యములు. వాని సాహాయ్యమున మనమొక దూరదేశమున హాయిగనుండఁగలము. సుందరీ! ఐదు నిముసములలో మనము బయలుదేఱవలయు. ఈలోన నీయలసట బాపికొని సేదదేఱుము. మఱియు మన హృదయములు గలయునట్లు సముచితముగఁ బరస్పరము సంభాషింపవలయును. కాని, నా మానసమంతవఱకు నిలువఁజాలదు—ఒక్క తియ్యని ముద్దొసంగుము!"

"అరే, దురాత్మా! పొమ్ము! అంతకంటె మరణము శ్రేయోదాయకము!"—అని యఱచి, ఒక్కవిసురున జేయి విదళించుకొని, క్రూరకిరాతపీడిత సుందర హరిణశాబకమువలె నా చపలాక్షి ఱివ్వన బాఱెను. సిద్దీ సహజముగఁ గ్రోధోన్మత్తుఁడై జుంధరధ్వానమునఁ

దిట్టుచు నఱచుచు వెన్నాడెను. జులేఖా యేమికావలయు? కాని, దైవవశమున నాదురాత్ముఁడు మార్గమధ్యమునఁ జచ్చిపడియుండిన కొండొక జంతువుం గానక, తాఁకి గుభాలున నేలఁగూలెను. దాన, నసహాయయగు జులేఖా మఱియు దవ్వాయెను. బానిసీఁడు సహజముగా ద్విగుణీకృత క్రోధఘూర్ణితుఁ డాయెను. నిజమానసంరక్షణ కార్యపరతంత్రయగు జులేఖా ఒక గమ్యస్థాన మెఱుంగక, తెరువు నరయక, ఇతరాలోచన మెద్దియులేక వాయువేగమున నట్టులే పాఱుచుండెను. సిద్దీ చాలవెనుకపడి యుండుటచే నామెకు నవీనధైర్య మలవడెను. దాన జవంబుగూడ నధికతర మాయెను.

జులేఖా ఆ తెఱంగునఁ గొంతదవ్వు పరుగిడిన యనంతర మా యారామపథము రెండాయెను. ఆభీతహరిణాక్షి ఎటుపోవలయు? ఎయ్యది క్షేమకరము? జులేఖా యేమియు నెఱుంగదాయెను. వెనుదిరిగిచూడ, సిద్దీ గోచరింపలేదు. అంత నాపడఁతి లోలోన సంతసించి, నిలిచి విచారించుట అపాయకరమని ఎంచి, దీనజనరక్షకుఁడగు పరమాత్మున్నిై భారమువైచి, తన్ను బాధింపఁజూచు రక్కసుఁ డొకమార్గము బట్టునని ఎంచి, తాను రెండవత్రోవ ననుసరించి పతంగమువలె బాఱఁజొచ్చెను. కాని, ఎండ కన్నెఱుంగక రమణీయ సౌధాంతరమున భోగభాగ్యముల నోలలాడు కోమలి ఎంతదూర మటుపోఁజాలును? అంతలో నదృష్టవశమున నొకగృహము దృగ్గోచరమాయెను. జులేఖా తోడనే పెన్నిధిగాంచు నిఱుపేద చందమున, హోరముజూచు దురంతక్షుదార్తచాడ్పున నెంతయేని సంతసించెను. దుర్భరానందాతిశయమున నాకాంత అఱచెను.

నానావిధ వృక్షసమన్వితమై, నవపికసితకుసుమ నికరవిరాజితమై ప్రేక్షణీయమైయొప్పు నొకపశాల ప్రదేశమునడుమ రమ్యహర్మ్య మొకటి శోభాయమానముగ నిలిచియుండెను. క్రూరశార్దూలమువలె

వెన్నాఁడు సిద్దీబారినుండి తప్పించుకొనఁజాలు సాహాయ్యమందు లభింపవచ్చునని అయ్యబలామణి మానస ముప్పొంగెను. బహిర్ద్వారము తెఱచియుండుటచే, నామెకు మఱింత ధైర్య మలవడెను. కవాటము తీసియుండుటయు, ఉద్యానవన మడవివలె బలసియుండక కలకలలాడుటయుజూడ, నా మందిరము జనశూన్యము కాఁజాలదని జులేఖా గ్రహించెను.

జులేఖా మఱియొకసారి వెనుదిరిగి పరికించెను. సిద్దీ యింకను దోఁపలేదు. నూతనానందోత్సాహములచే వదనము వికసింప, నా మచ్చెకంటి రయంబున నందుఁ బ్రవేశించి, వడివడిబోయి మందిరద్వారము డాసెను. తనయవస్థ ఎటులున్నను, అనుజ్ఞవడయక అందుఁ జొరనొల్లక జులేఖా దలుపుదట్టెను. కాని, ప్రత్యుత్తరములేదు. మగుడ దట్టినను, లోనుండి ఎవ్వరైన నరుదేఱకుండుటయే గాక, ఏమాటయు వినరాకుండెను. అవ్వల ఇంకను నిలిచినచో నారక్కసుఁడు చూచునేమోయని వెఱచి ఆమగువ అల్లన నందుఁజొచ్చి మగుడఁ దట్టెను. మందిరమట్టులే నిశ్శబ్దముగ నుండెను. ఆహా! ఆగృహము నిర్జనంబగునా యేమి? జులేఖాగతి ఏమికావలయు? ఆ కాంత హృదయము మిఱుల భయకంపితమాయెను. అంత నాపడఁతి సాహసించి ఒక మందిరముజొచ్చెను. అందెవ్వరు లేరు. గదిమాత్రము సామాన్య పరికరసమృద్ధమై శుభ్రముగ నుండెను. అటిస్థలము జనశూన్యముగనుంట కడువింతగ నుండెను. ఆ మందిరమునకంటి మఱియొక ద్వారముండెను. వివిధాలోచనబాధిత యగు జులేఖా అటుపోయెను. అంతలో భయంకరాకారుఁడగు సిద్దీ ఏతెంచునేని, నిజమానసంరక్షణార్థ మందుజొరవలయునని చింతింపుచుండిన ముహూర్తమున నీవిపరీతాలాపములు వింతగ వెలువడుటచే, నాముగ్ధ అట్టెనిలిచిపోయెను. ఆ స్వరము బలహీనముగ మందముగ

నుండియు నుత్సాహవంతమై, పురుషునిదివోలె నుండెను.

"సుందరాంగీ! నన్ను విడనాడకుము. నీదు మనోహరాకారము గాంచి ఆనందింపనిమ్ము—మదీయ హృదయము దురాలోచన పూరితముగాదు సుమా!— నిర్మల నిశ్చల ప్రేమముగ్ధుఁడనై తిలకించువాఁడను. ఆహా! అనిర్వాచ్యమధురార్ద్ర వీక్షణములు!—శతసహస్ర వందనములు. ఓహో! ఏమీ తరళనయనములు!— కడు మోహజనకములు. భవదీయ సువర్ణశిరోజములును, నక్షత్రవిరాజిత పక్షములును దివ్యకాంతియుతములైయున్నవే! సుందరీ! ఈప్రదేశమున నిరుపమాన తేజోవంతమొనరించు నీవు నాకమునుండి దిగివచ్చిన దివ్యాంగనవు గావలయు. మందహాసము! అపూర్వము! నిన్ను వెంబడించుట మహాభాగ్యము— నిజము— నిశ్చయము! స్వర్గమునకుఁ గొంపోదువా! ధన్యోస్మి! ధన్యోస్మి! నీయధీనమైతిని— భూతలము వీడితిని— వాయువిహారము! శరీరభారము శూన్యము— భూలోక సహజనికృష్టాలోచనలు పటాపంచలాయెను— నిశ్చల ప్రేమానంద నిలయమగు సప్తమస్వర్గము జేరువాఁడను! మధురము! మనోహరము! అపూర్వము!"

ఆపురుషుఁడు నాలుగైదు నిమేషములూరకుండెను. అనంతర మీపలుకులు మగుడ వెలువడెను.—

"ఆహా! ఆకసమునవెంత రయంబునఁ బోవుచుంటిమి— వాయువెంత తేజోవంతముగ, నెంతయుష్ణముగనున్నది! మదీయ భారము వహించు నీదుహస్తము సహితమెంత యుష్ణతరము!—నీదు నయనములనుండి ప్రసరించి నాపైఁబడు వీక్షణము లెంత వికాసవంతములో! గాలిలో నడయాడు త్వదీయావిరళసువర్ణకుంతలము లెంతటి మధుర సుగంధము వెదజల్లుచున్నవి! నీదు మనోహరాంగము నాచ్ఛాదించు శుక్ల విసీల విమలకాచసన్నిభాంబరము సవరించు నపుడు నిక్కంపు

దివ్యాంగనవలె దోఁచెదవు! ఓహో! మనము చాల దవ్వొగసియుం టిమి— ఈ సమున్నత స్థానమునుండి కాన్పించు దృశ్యము కడు మనోహరము! అధోముఖంబునఁ దిలకింతునా?— మాతురుమ్క- రాజధాని వింతగఁ గాన్పించుచున్నది— ధగద్ధగాయమానములగు సువర్ణకలశములు— వైరిజన దుస్సాధ్యములగు దుర్గములు— అంబ రము చుంబించు 'మీనారు' స్తంభములు— అన్నియు సువర్ణ బాలేంకు విరాజితములు! వైభవాభిరామ విశాల సౌధములం జుట్టి యున్న పచ్చిక బయళ్ళు ఎంత శోభాయమానముగ దీపించుచున్నవి! బాస్వరసు జలములెంత సొగసుగ మెఱయుచున్నవి! 'సువర్ణశృంగస్థ' తోయములు ప్రకాశమానముగ నిశ్చలముగ నున్నవి! రాజమార్గము బహుళజన సంకీర్ణము!— మహావైభవ సమన్వితము!— తెలిసె— పాదుషావారు ప్రార్థనార్థము పోవువారు! అల్లదె!— మౌల్వీ ఎలు గెత్తి గంభీరముగ దైవము నారాధించువాఁడు!"

ఆస్వరము మగుడ గొంతతడవు నిలిచెను. జులేఖా నిశ్చేష్టయై సంభ్రమాకులంబున నట్టెయుండెను.—

"ఆహా! మఱియు మఱియుఁ బైకెగయు వారముగా! సుందరీ! దయామయచిత్తవై నన్నానికృష్ట భూతలమునుండి పవిత్రస్వర్గధామ మునకుఁ గొంపోవు నిన్ను నేనెంతని కొనియాడఁగలను? ఏమి— ఈ మృదుల మనోహరకలస్వనము! వీనులకు విందగుచున్నది— స్వర్గము నలంకరించు మరున్నారీ రత్నములు పరమాత్మునకొనరించు ధన్య గీతములుగావలయు— ఎంత మనోహరము! ఎంతమధురము!— అపూర్వము— ఎన్నఁడు విని యెఱుంగను. చూడఁజూడ, పృథ్వి చిన్నదియగుచున్నది— స్వర్గము చేరువయగుచున్నది! నాయానంద మపారము! అపూర్వము! వర్ణనాతీతము!"

అట్టి పరమానంద మనుభవించు నామనుజుని స్వరము తదావేశ

మున నట్టులే కట్టునడెను. జులేఖాయవస్థ అనిర్వచనీయముగనుండెను. అపలుకుల భావమేమి కావలయు? దురదృష్టవశమున మతిసెడిన ఉన్మాదుఁడో, లేక, తీవ్రసన్నిపాతజ్వర పీడితుఁడో ఆతెఱంగున ప్రలాపింపవలయునని ఆమెగ్రహించెను. యథార్థమరయ వలయు ననెడు కుతూహలమేగాక, ఒకవేళ సిద్ధి యరుదెంచునేని ఎలయు సాహాయ్యమిచ్చుటకవకాశమునో లేదో యను భయముగూడ నుదయించుటచే, నా జవ్వని ధైర్యధుర్యయై, ద్వారమునఁ దొంగి పరికించెను. తెల్లని బానిసలిర్వురు జీవరహిత శిలావిగ్రహములవలె నొక సోఫాచెంతఁ గూర్చుండియుండిరి: తన్మృదుతల్పమున నొకవ్యక్తి వ్రాలియుండెను.

ఆ మువ్వురును గదలక మెదలక కేవలము చైతన్యరహితముగ నుండుటచే, ప్రాణములేని మైనపు బొమ్మలు కానోపునని జులేఖాకు ప్రప్రథమమున స్ఫురించెను. కాని, అట్టిసందియము రయమునఁ దొలంగెను. బానిసయొకఁడా మెచెంత మోముద్రిప్పి, పెదవిపై వ్రేలిడి, కడు నిశ్శబ్దముగ నుండవలయునని సన్నయొనరించెను. ఆపరిచారకుని వీక్షణములు నిరపాయముగ నుండుటయేగాక, సవినయముగ సగౌరవముగ నుండుటచే, జులేఖా హృదయము భయరహితమాయెను. అనంతర మాసేవకుఁడు తల్పమువంకఁ దిలకించెను: తదాశ్రితునకు నిద్రాభంగ మొనరింపరాదని వాఁడు హెచ్చరించెనని జులేఖా గ్రహించెను.

వనితాజనోచిత కుతూహలాధికమున నాకాంత మఱింత తొంగి చూచెను. అంతవఱకు నాశయ్యాగతుని శరీరాకృతి బాగుగ గోచరింపలేదు. ఇపుడు సువ్యక్తమాయెను. తోడనే, హృదయము ప్రకంపింప, నాకాంత రయంబున వెనుదిరుగఁబోయెను. తదవసర విపరీత సంభ్రమాకులంబున వెలువడు కంఠరవము వారించుటెంతయో కష్టమాయెను. సేవకజన పరివృతుఁడై తల్పమునఁబడియున్న పురుషుని

ప్రాయ మేఁబది సంవత్సరములుండునని తోఁచుచుండెను. అసలాతని వయస్సుముప్పదియైదుసంవత్సరములే, ఐనను, శరీరపటిమ మాత్రము పూర్తిగ చిక్కి పలుచనై మాంసరహితమై, కేవలము కంకాళ సన్నిభమగు కాయము చూచుట కెంతయు భయావహముగ నుండెను. శరీరమంతయు మేల్వాలువలతో నలంకృతమైయున్నను, దుస్సహాశరీర దౌర్బల్యము ఘోరముగ వ్యక్తమాయెను. దట్టంపు మొగముల దిండులపై వ్రాలియున్న ఆపురుషుని మస్తకమునకుఁ బ్రాపుగ శక్తమాంస రహిత కృశీభూత చర్మాంచితాస్థిమయ హస్తమమరియుండెను. వాని మోము గూడ జీవరహితముగనుండెను. ఎముకల కంటియుండు చర్మము కాగితమువలెఁ బలుచనై వదులుగనుండెను. నిమీలితములగు నయనములు రెండును రెండు బిలములవలె, గుహలవలె, జూచుట కెంతయు దుస్సహముగ నుండెను.

అట్టి ఘోరాకృతిం జూడఁజాలక జులేఖా వెనుదిరుగుచు నొక పరిచారకునకు సన్నయొనరించెను. మృతప్రాయుఁడగు తన స్వామి మేనుమఱచి నిద్రించుటఁగాంచి, వాఁడు పిల్లివలె మెల్లగలేచి, జులేఖాను నిశ్శబ్దముగా సమీపించెను. గట్టిగ నూపిరిదీయుటకైన సాహసముచాలని ఆసేవకుఁడు తదుచితజాగరూకతతోఁ దలుపునల్లన వేయనంత వారిరువురు కొంతదవ్వునకుఁ బోయిరి. సేవకుఁడు సవినయముగ నిట్లు ప్రశ్నించెను.—"అమ్మా! సేవకున కేమిఆజ్ఞ ?

"ఓయీ! నేను ప్రసిద్ధ పురుషుడగు దత్తబను పాషా సోదరీ పుత్రికనని యెఱుంగుము. పాషా బంధుమిత్ర సమేతముగా నీప్రదేశమున విహరింప నరుదెంచెను. ప్రమాదవశమున నేను వారిని వీడి వచ్చితిని. నేను శీఘ్రముగఁ బోవలయు—అసహాయనై వెడలఁ జాలను—తోడు గావలయు."

"అమ్మా! మాయిరువురియందెవ్వరమైనను నిన్ను నిరపాయముగాఁ

జేర్పగలము—అట్టి కార్యము మాకెంతయు సంతోషకరము. కాని, మా ప్రభువు మేల్కాంచువఱకు వేచియుండవలయు. మఱియొక పరిచారకుఁ డిందులేఁడు."

"నీ స్వామి శీఘ్రముగా మేల్కాంచునా?" అని జులేఖా తత్తరపాటునఁ బ్రశ్నింప, వాఁడిట్లు బదులాడెను—

"దేవీ! ఒక గంటయగును—రెండు గంటలు కూడ గావచ్చును. ఈ లోన, అల్పాహారమాయత్తము చేయుదును, ఆరగింపుము."

"కాని, రెండు గంటలగునా? అంత కాలమిందుఁ దడయరాదు. నాకై నా బంధుగులు దిగులొందుచుందురు. నీ ప్రభువు నిక్కముగ వ్యాధిగ్రస్తుఁడా? ఈ నిద్రనుండి మేల్కాంచునని నాకుఁ దోపకున్నది."

దేవీ! నీ కాభయము వలదు. నిక్కముగ లేచువాఁడు. సందియ ముడిగి వేచియుండుము."

"కాని, ఈ రోగమేమి? జ్వరాధికమున మేను మఱచి యట్లు ప్రేలునా? లేక, ఈ హతభాగ్యుఁ డున్మాదుఁడా?"

"దేవీ! ఎఱుంగవా? గ్రహించి యుందునని తలంచితిని."

"ఎఱుఁగను!" జులేఖా సంభ్రమము దశాధికమాయెను.

దేవీ! ఇదంతయు నభినీ ప్రభావము! ఈ మహనీయుఁడు నల్లమందు విరివిగాఁ దినువాఁడు."

తానాపాటి గ్రహింపఁ జాలనైతినే యని జులేఖా కడుంగడు విస్మయము జెందెను. అట్టివింత పూరుషుల నాకాంత యెన్నఁడు గాంచి యెఱుంగదు. ఐనను, అట్టి చిత్రముల నామె వినియుండెను. జదివియు నుండెను. అట్టి మందభాగ్యుని బ్రత్యక్షముగఁ గాంచుటచే నామె హృదయము కంపించెను—"హా! దైవమా!—పరిచారకా! ఎంత దురదృష్టము! ఇట్టి దారుణదుర్వ్యసనమునకుఁ బాల్పడి నీ ప్రభువు మెల్లమెల్లగ నాత్మహత్య యొనరింప నెంచెనా!"

“దేవి! తన జీవితకాలములం దర్ధభాగ మీకొఱకు స్వీయమనోపరికల్పితస్వర్గమునందు వసియించువాఁడు: ఇంతటి ప్రభావముగల సిద్ధౌషధము నోరారసేవించి మనసార ఆనందించుటకుగా నీ సిరాన్మా నిష్యప్రదేశమునకుఁ బ్రత్యేకముగా నరుదెంచి ఇందు స్థిరావాసమేర్పఱచుకొనెను ___”

ఆ ముహూర్తమున నవ్వాని కాలియడుగులు దబదబ వినవాయెను. జులేఖా భయప్రకంపితహృదయయై, అనిమిషనయనయై, అటు తిలకించెను. సిద్దీ భయంకరాకార మామె మనోనయనమునకు గోచరించెను. కాని, యథార్థ మన్యథా పరిణమించెను. ఖలీలుని అపూర్వమనోహరమూర్తి నయనగోచరమాయెను; జులేఖాహృదయ ముప్పొంగెను: వదనము వికాసవంతమై అనిర్వచనీయానందమున కాలవాలమాయెను ___

“ఇయ్యదే, నా మిత్రుఁడొకఁ డరుదెంచెను!” అని యమందానందకంపితస్వాంతమున నఱచి, సందివసినది దీసి, కనుపనయముగ మెలంగిన పరిచారకున కొక సువర్ణమొసంగి జులేఖా సంభ్రమంబున నావలకుఁ బోయెను.

నిజమనోహారిణిం గాంచినంతనే ఖలీలుఁడు గూడ విస్మయానంద పరవశుఁడాయెను. తత్క్షణమా యువతీయువకులు పరస్పరము గాఢాలింగన మొనరించిరి. అనంతరమా లతాంగి నిజహృదయాధినాథు భుజాకాండము నాశ్రయించి, యల్లన నడచుచు స్వీయకథా విశేషములు తెలియఁబఱచెను. దల్లబుపాషా నిద్రాపరుం డగుటయు, సన్నాసి యైనంతనే తా నవ్వల కేగుటయు, సిద్దీమూర్తి దస్యుని వలెఁ బైఁబడి ఎత్తుకొని పోవుటయు, వాని దుస్సహప్రవర్తనము తాను తప్పించుకొని ఆ గృహంబునఁ బడుటయు మొదలుగాఁ గల విషయములు జులేఖా యభివర్ణింప, ఖలీలుఁడు సహాయముగా నాగ్ర

హాయత్తచిత్తుఁడాయెను.

మస్రూ ఆప్రదేశమున నెందైన డాగియుండునని అనుమానించి, ఖాలీలుఁడు తన సునిశిత కరవాలము జేతఁబూని అప్రమత్తుఁడై యుండెను. కాని, వాఁడామార్గమునఁ గాన్పింపలేదు. తాను వెను దవిలిన ఆయధమాధముఁడు నీటమునిఁగి చచ్చియుండునని తురుష్క యువకుఁడు నమ్మియుండెను. వాఁడట్లు గతింపక, ఇంకను సజీవుఁడై యుండెనని స్పష్టమాయెను. పరస్పరానురాగబద్ధులగు నాయువతీ యువకులు పరస్పర మెఱుంగని రహస్యములు లేవు. కాన, మార్గ మధ్యమున నాయువకుఁడు తన ప్రియాంగన కెన్నియో విషయము లెఱింగించెను.

జులేఖా ఖాలీలులను గాంచినంతనే, పాషా మొదలగు వారం దఱు గడుంగడు ముదమందిరి. జులేఖా నరయుటకు వేర్వేఱు పథం బులఁ బోయిన జాలియును లూకాసు లప్పుడే యరుదెంచియుండిరి. ప్రభుపత్నియగు ఇస్మిల్డా హృదయము గర్హిత మాత్సర్య సమ్పదష్ట మాయెను. హృదయ మెంత యుడుకుచున్నను నిశ్చలముగఁ గాన్పింపవలసిన కారణమున, నా మత్తకాశిని యవస్థ మఱియు దుస్సహముగ నుండెను. జులేఖా మఱలఁ దన భయావహ వృత్తాం తము సమగ్రముగ వినిపించెను. తన సేవకాధముఁడు మస్రూయే అంతటి దౌర్జన్య మొనరించెనని ఎఱింగినంతనే, దర్పభరుపాషా ప్రచండ క్రోధారుణనేత్రుఁడై, పండ్లు పటపట గొఱికెను. మేధా వియు సమర్థుఁడును నగు ఖాలీలుఁడు సిద్దీని మును దానెఱుంగ నట్టులే మెలంగెను.

అనంతరము వారలందఱు నల్లనఁ దమ నావనెంతకుఁబోయి, అందాసీనులై గృహాభిముఖులైరి. సంభాషణము సహజముగా జులేఖా భయానక సాహసగాథంతయు మీఁగనే కేంద్రీకృతమాయెను.

ఆ సందర్భమున లూకాసు ఇట్టులనెను.—“జులేఖా! నిన్ను అన్వేషింపఁబోయినప్పుడు నా చిత్తము పరిపరివిధములు పోయెను. బాల్కను దేశమునంతటిని గడగడలాడించిన నల్లదొంగను బోలు మఱియే క్రూర చోరాధమునకైనఁ జిక్కియుందువని నేనెంతయు భయమందితిని.”

దల్తబనుపాషా తోడనే యిట్లు పలికెను.—

“ఔనౌను. ఆ నల్లదొంగ మొన్న టివఱకు జీవించియుండెననియే జ్ఞాపకము. కడుంగడు ప్రవీణుఁడగు నాగజదొంగ యొనరించిన వైపరీత్యములు జనులు భయాద్భుతస్వరంబున జెప్పుకొనుచుందురు.

“అట్టి గాథలలో నొక ఫ్రెంచి బాటసారికి సంబంధించినది కడు ప్రసిద్ధము, కడు విపరీతము. ఒకానొక వార్తాపత్రికయందుఁ గాంచి యుంటిని.”

అట్లు లూకాసు మగుడ బలుక, పాషా సాశ్చర్యముగా నిట్టులనెను.—

“మిత్రమా! అటులనా! మన మిత్రుఁడు ఖలీలుఁ డొక్కదినము రెండు కథలు జెప్పువాఁడు కాఁడు గాన, నీవా భారము వహించి, ఆ ఫ్రెంచి బాటసారి కథ వినిపించి మాకానంద మొదగూర్పుము.”

లూకాసు అమితోత్సాహదీపితాననుఁడై తత్కార్యమున కుద్యమించెను.

## ౨౩

## రహస్యయుద్ధనౌక.

లూకాసు కథ పూర్తియైనంతనే, దల్తబనుపాషా యథావిధంబునఁ జింతాపరుఁడై ఇట్టులనెను.—

"ఖాలీలుని కథలవలె నియ్యది చరిత్రాధారము గాకున్నను, కడు నానందకరముగనే యుండెను. తత్కథానాయకుఁడగు ఫ్రెంచివీరుఁడు నాయికను గాంచినంతనే ప్రేమముగ్ధుఁ డాయెనని తోఁచెడిని. ఇట్టి ప్రేమము వీక్షణమాత్రమని చెప్పనొప్పును. ఈ సిద్ధాంతమును ధృవపఱచుటకును, ఖండించుటకునుగూడ సమానావకాశములున్నవి."

దత్తబను పాషా సహజాహంకార పూరితస్వరంబున నటులు పలుక, ఖాలీలుఁ డిట్లులనెను.—

"పాషా! వీక్షణమాత్ర ప్రేమ సిద్ధాంతము కడుంగడు సమంజసము. ఎయ్యది సమంజసమో, అయ్యది స్వభావసిద్ధమని చెప్పఁదగును. నా యభిప్రాయము విశదీకరింతును, గమనింపుము. సౌందర్యము నేత్రానందకరము, తత్క్షణ హృదయానురాగ ప్రభవకారణము. కావున, తొలుదొల్తనే అనుకూలాభిప్రాయ మేర్పడఁజేయఁజాలు సామర్థ్యము సౌందర్యమునకుఁ గలదు. అట్టి అభిప్రాయబద్ధుఁడు తాఁగాంచు కాంత వదన సౌందర్యము తదీయ హృదయ ప్రతిబింబితమనియుగూడ ప్రసంగవశమున నరయఁజాలునేని తదనుకూలాభిప్రాయము ధృవంబగును. వీక్షణమాత్ర జనిత ప్రేమతత్వమియ్యది."

దత్తబను పాషా తోడనే యిట్లు బదులాడెను.—

"నీపలుకు లసంబద్ధములు గావు: అట్టి ప్రేమము గలదు—శాశ్వతముగూడ గానచ్చును. ఏమన, పరస్పరము హాయిగ మేళవించు హృదయములే విధికృతంబున నొక్కయెడ సమకూడును. కాని, మఱియొక విషయము గమనింపవలయు. వీక్షణ మాత్రమున నాకస్మికముగ నేర్పడు ప్రేమ అట్టులే క్షణభంగురము గానొప్పు. ఎట్లు జనించెనో, అట్టులే యంతరింపఁగలదు. ఇయ్యది సాధారణ సంభవమని భావింతును. అట్టి ప్రేమ అభంగురమై, నిశ్చలమై, సుఖప్రదమై

యుండజాలదు. సౌఖ్యదాయకము గాకుండుటయే గాక, అట్టి సంపతులలో నొక్కరికైనను సంతాపకారణమై బాధాకరముగఁ బరిణమించును.’’

ప్రభుపత్ని ముసుంగునుండియే భావగర్భితముగ వీక్షించుచు నిట్టులనెను.—

“తరుణ వయస్కుఁడగు పురుషుఁడు అత్యుత్సాహపరుఁడై, అనివార్యమోహావేశము కతమున, యుక్తాయుక్త వివేచనా సామర్థ్యముడిగి, తదవసరోద్భూత మనోవికారము విమల నిశ్చలానురాగమని భ్రమించి, ఒక సుందరిని ప్రేమించి, తదుత్తరదినముననే, తదుత్తరఘటికయందే తత్సమానావేశమున మఱియొక వాల్గంటిని గాంచి వలచును. ఖలీలు మహాశయా! నాపలుకులు నిక్కముగదా?”

అట్లు పలుకు ఇస్మిల్లా క్రూరతీక్ష్ణ వీక్షణమొండు జులేఖాపైఁ బఱపెను; ఖలీలుఁడు కనిపట్టెను. ప్రభుపత్ని మానసమెటులుండెనో ఆతఁడు గుర్తించెను. ఆకస్మికముగ నంతర్హితమైన జులేఖాను అన్వేషించుటయందు ఖలీలుఁడు వ్యక్తీకరించిన గాఢోత్సాహముచే నిస్మిల్లా మాత్సర్యము మగుడ పెల్లుబికెను. లూకాసు జూలియనులు గూడ వెదుకబోయినను, ఖలీలుఁడే ఆకన్నియ నరయఁజాలెను. ఆకారణమున, నాయువతీ యువకులు కొంతకాల మేకాంతముగ నుండుటకు వీలాయెను. నిర్మల ప్రేమ మన నెట్టిదో యెఱుంగని ప్రభుపత్ని, నిశ్చలానురాగ మెద్దియో యెఱుంగని ప్రభుపత్ని, దుష్ట కామాయత్తచిత్తయగు ప్రభుపత్ని, ఖలీలుని గాంచి మోహాతురయై ఉవ్విళులూరు ప్రభుపత్ని ఆతఁడు మగుడ జులేఖాతో నొంటిపాటుగ నుండెనని యెఱింగి ఎట్లు సహించును? కావుననే, నిజహృదయాంతర ప్రజ్వలిత క్రోధ మొకింత యుపశమనము గాంచునట్లు వీక్షణమాత్ర ప్రేమము గుఱించి యట్టు లుపన్యసించి ప్రశ్నించి ఆమె తురుష్క

యువకునిఁ గారింపఁ గడంగెను.

గభీర హృదయుఁడగు ఖలీలుఁడు ప్రభుభార్య వక్రహృదయము మెఱింగియు, సహజ నిశ్చల స్వరంబున నిట్లులనెను.—

“దేవి! నీపలుకు లణుమాత్ర మసంబద్ధములుగావు. ప్రత్యేకముగఁ గొన్ని యుదాహరణములం దీసి విచారింతుమేని, మన మట్లు వాదింపనగును. అట్లుగాక, పాషా విశాలహృదయముతో నొక సర్వసామాన్యవిషయము మాత్రము ప్రశంసించెను.”

పాషా యిట్లులనెను.—

“మన మిత్రుఁడగు లూకాసు కథా శ్రవణము[illegible]నను, తదనంత రాలోచనా పరంపరచేతను మదీయ మానసము నాశ్రయించియుండిన ప్రధాన విషయము మఱచితిని.”

నిజభర్తృఘాతము దలపెట్టిన ఇస్మిల్లాతోడనే విహ్వలహృదయ యయ్యు నిగ్రహించుకొని, నితాంత విమలానురాగపూరిత చిత్తవలె నభినయించి, మధుర మందహాస విరాజిత ప్రసన్నాననయై మగని వంకఁ దిలకించి, మనోహర కలస్వనమున నాప్రధాన విషయమెద్దియని ప్రశ్నింప, పాషా యిట్లు బదులాడెను.—

“దుష్టాత్ముఁడగు ముస్రూ గుఱించి తలంచుచుంటిని. జులేఖా! నీజనకుఁడు నగర రక్షకుఁడు గదా! మన మిలుసేరునంతనే, భటులను నలుదిక్కుల రయంబున నంపి సిద్దీని బట్టవలయునని కదీస్కారుకు వర్తమానమంపుదును.”

నౌక మెల్లఁగఁ బోవుచుండెను. వారింకను ఉపనదిమీఁదనే యానమొనరింపుచుండిరి. అటు నిటు నుండు గట్టులు వృక్షసంకీర్ణములగుటచే బాస్వరసు కానరాకుండెను. క్రమముగా నాజల మార్గము గడచి బాస్వరసు జొచ్చినంతనే, వారి యుత్సాహమంతయు నడంగెను. భయముచే గాకున్నను, విపరీత విస్మయ సంభ్ర

మములచే వారి హృదయము కంపించెను. కారణమేమన, తురుష్క-దేశముతో సఖ్యములేని రష్యాదేశపు యుద్ధనావ యొకటి తద్దేశ లాంఛనములు కేతనములతోఁ గృష్ణసముద్రమునుండి బిఱబిఱ నరుదెంచుచుండెను.

అంతమాత్రమున వారి హృదయములు చలింపనేల? టర్కీ-రష్యాదేశములు కొంతకాలము పరస్పరసంగరమున మునింగియుండెను. ఇంగ్లాండు, రష్యాదేశమునకుఁ దోడ్పడెను. ఐనను, ఇంగ్లాండు దేశమువలననే వైరులిర్వురు సంగ్రామము విరమించియుండిరి. అంతమాత్రమున యుద్ధభయము తొలంగెనని తలంపరాదు. ఇరు కక్షుల వారు నామోదించు సంధి పొసగవలయును. తత్కార్యము సాధింపఁ గోరియే ఇంగ్లాండు ప్రోత్సాహముచే టర్కీ రుష్యాదేశములు రణ ముడిగియుండిరి. రాజనీతిజ్ఞులు సంధికార్యరచనానిమగ్నులై యుండిరి. అట్టి సమయమున శత్రునావ తమ జలముల నేల ప్రవేశింపవలయు? దల్లబను పాషా సహజముగ భయసంభ్రమవిచలితహృదయుఁడై ఇటులనెను-

“ఏమీ వైపరీత్యము! సంధి కాఁగల ఈ విరామ సమయమున రష్యను యుద్ధనావ మన జలముల చొరనేల? సమర విరామము భంగపడలేదే!” .

ఆనావ దృగ్గోచరమైనంతనే ఖలీలుఁడు దిగ్గున లేచి తదేకధ్యానమున నావంకఁ జూపులునిగుడించి “కడు విపరీత”మనియనుకొనెను.

“ఈ యాగమనము స్నేహపూర్వకము కారాదా? వినోదార్థము కారాదా? అకారణముగా రష్యాదేశము యుద్ధవిరామ నియమముల నుల్లంఘించునని భావింపను.”

ఆ తెఱంగున లూకాసు పలుక, పాషా యిటులనెను —

“ఈనావ దురాలోచనాయత్తమై యింత దవ్వరుదెంచెనేని,

మన యుద్ధనావ లూరకుండునా? 'సువర్ణశృంగము'న నిలిచియుండు మన నౌకాబలము తప్పక ఎదిరించును."

"అపాయము సంభవించునా?" అని ప్రభుపత్ని భయోద్విగ్న స్వరంబునఁ బ్రశ్నించెను. తైరజా గుల్నేరులు గూడఁ దత్సమాన భయముచేఁ గంపించిరి. జులేఖా మాత్రమట్లు చలింపక, శత్రునావ పరీక్షా నిమగ్నుఁడగు తన ప్రియు నల్లనల్లనఁ దిలకింపఁ దొడంగెను.

భయాతురమునఁ బ్రశ్నించిన భార్యకు దత్తబదు పాషా సమాధాన మొసంగక మున్నె, ఉద్విగ్నస్వరమున ఖలీలుఁ డిట్టులనెను.—

"తెలిసె! తెలిసె! పాషా! రష్యను నావికులు అల్లదె—శ్వేత కేతనము నెత్తినారు! వారు దుష్టాభిప్రాయ బద్ధులుగా రనుట సువ్యక్తము!"

అంతటి బుద్ధి కౌశల్యమెట్లుంగని పాషా వారి యభిప్రాయమేమై యుండునని ప్రశ్నించెను. ఖలీలుఁ డిట్లు బదులాడెను.—

"ఇవన్నియు యుద్ధవిరామ దినములు గదా. టర్కీ రష్యా దేశములు పరస్పరము సమ్మతించుటచే నన్యోన్యాధీనయోధజనంబును సాగనంపుచుండిరి. యుద్ధమున మనకుఁ జిక్కిన రష్యను ప్రముఖుల నెక్కించుకొని వారి నగరమున దిగవిడుచుట కొఱకు మననావ యొకటి నాలుగు దినముల క్రిందఁ బ్రయాణమాయెను. అట్టులే, వారి యధీనమైన మన యోధులను మన కప్పగించు నెపమున నీరష్యను నావ యరుదెంచి యుండవలయు."

ఖలీలుని ఊహ నిక్కమగునా యని తర్కింపవలసిన యవసరము లేక పోయెను. శాంతసూచిత శ్వేతపతాక ప్రదర్శనమున వారి వారి భయానుమానములు పటాపంచలాయెను. ఆనావ ఒక యర మైలు దవ్వున గోచరించెను. తెరచాపలన్నియు లేచియేయున్నను వాతావరణము తీవ్రానిల వీడితముగాక నిశ్చలముగ నుండుటచే

గమనము కడు మందముగనుండెను. ఆకారణమున, భాసుర బాస్ఫోరసు జలపర్యంకమున గంభీరతరముగ నిలిచియున్న ఆ జలగామి చూచుట కెంతయు శోభాయమానముగనుండెను. బాగుగఁ జూచి యానందింపఁగోరి తమ నౌక నొకింత కవ్వగఁ బోనీయవలయునని దల్లబను పాషా తన బానిసల నాజ్ఞాపించెను.

మనువారలన్యనౌకావీక్షణోత్సాహపరతంత్రులై తమ మేలుముసుంగులను బోఁద్రోచిరి. రష్యను నావపైఁ బెక్కు దూరవస్తుదర్శనయంత్రములు పొడసూపెను. అయ్యవి పాషానౌకపై నిగిడియుండెను. అసమాన సౌందర్యముతో నలరారు నా మేల్బంతుల వంకఁ దిరిగిన దూరదర్శనయంత్రములు సహజముగ మఱిమఱి దిరుగక అట్టులే నిలిచిపోయెను. పూలంబట్టు వితానాంతరమున, మెత్తని మోహంపు దిట్టంపుదిండులపై మనోహరతరంబుగ వ్రాలి, ప్రాచ్యదేశనారీజనసహజాపూర్వరూపవైభవంబులతో విద్యుల్లతాసన్నిభముగ దీపించు నిస్సిల్లా తైరజా జులేఖా గుల్నేరుల నొకసారి గాంచిన యనంతరము దృష్టి మఱల్చుట అసంభవము గదా! ప్రభుపత్ని ఆ విషయము గమనించిన గమనించి యుండుగాని, మిగిలిన జవ్వనులు మువ్వురు మాత్ర మేమియు నెఱుంగక అట్టులే చూచుచుండిరి. ఖాలీలాది యువకులు రష్యను దూరదర్శనీయంత్రముల మర్మము గ్రహించియు, అనాచ్ఛాదితవదనలగు నా యువతులపై దల్లబనుపాషా కనియు చేమోయని వెఱచి, మిన్నకుండిరి. రెండుమూడు నిముసములు గడచిన యనంతరము పాషాయే గ్రహించి, యదరి ఉద్విగ్నస్వరంబున నిట్టులనెను.—

"వదనముల నాచ్ఛాదింపుఁడు! సత్వర మాచ్ఛాదింపుఁడు! ఆ కాఫరులు మిమ్ము గాంచువారు!"

తోడనే ఆ సుందరీమణుల మనోహరవదనబింబములు వసనమేఘాచ్ఛాదితము లాయెను. తోడనే ఆ దూరదర్శనయంత్రములు [illegible]

కటి స్థానభ్రంశమాయెను.

ఖాలీలుని యూహయే నిక్కమని పాఠకులు గ్రహింపవలయు. రణమునం దయ యధీనమైన రష్యను యోధులను తురుష్కులు నాలుగైదు దినములక్రింకట నంపియుండిరి. ఆ విధంబుననే, తమ యధీనులైన తురుష్కయోధులను రష్యను నావ యిపుడు కొనివచ్చెను. ఆ యుద్ధనౌక ముప్పదియారు ఫిరంగులు గలిగి కడు బలాఢ్యముగ నుండెను. కులీనుఁడగు యువకుఁ డొకఁ డందు నాయకత్వము వహించి శాసించుచుండెను. యుక్తాయుక్తము లెఱుంగని ఆ బాలనాయకుఁడు సాహసకార్యము లొనరించి కీర్తికాంతాకరగ్రహణ మొనరింపవలయునని కడుంగడు దత్తరపడుచుండెను. ఏదియేని ఒక కార్యము దలపెట్టి సాధింపఁ గడంగునపుడా సేనాని మంచిచెడ్డ లరయుట గాని, పాపపుణ్యములు పరిగణించుటగాని, యెఱుంగఁడు. తురుష్కజాతిపై నాతని కెంతయేని జుగుప్స. అట్టి గర్వితక్రోధదురహంకారపూరితహృదయుఁడు తాఁ గొనితెచ్చిన తురుష్కయోధులు నౌకోపరిభాగమున నిలిచి స్వదేశమును సంతసమునఁ దిలకింపఁజాలు నవకాశమీయక, దుష్టమతియై వారి నధోభాగమున నుంచెను.

సేనానియగు నివనుఁడు నిజసహాయాధికారజనపరివృతుఁడై ఎద్దియో ముచ్చటింపుచు బాస్వరసు రమణీయదృశ్యములఁ గాంచు సమయమున దత్తబనుపాషానౌక నయనపథంబునఁ బడెను. ఆ సమయమున నితరనౌక లేవియు నా ప్రాంతమున లేవు. చిత్రవర్ణవిరాజమానమై, మనోహరమై యొప్పు నాకలను గాంచినంతనే ఆ నావాధికారి కుతూహలపరుఁడై దూరదర్శినిం దీసి చక్కగ జూడఁబోయెను—"సల్లసినావికులార్వరా నౌక నడుపువారు. మన నావికులవలె వారును నేర్పరులు గావలయు! ఓహో! మనలఁ గాంచి వెఱచియుండురు—ఎటు తిరుగవలయునో నిర్ణయింపఁజాలక తల్లడిల్లుచున్నవారు! ఆహా! అందుసుందర

నారీమణులు గూడ నున్నారే! అట్టి సొగసుకత్తెలను దగ్గఱనుండి కనులారఁ గాంచవలయు! మనల గాంచి వారు భయకంపితలై యుందురు—సత్వర మాశ్వేతకేతనము బ్రదర్శింపుఁడు!"

భటు లటు లొనరింప, నాతఁడు మగుడ నిటులనెను.—"భళీ! అదృష్టమే! ఆ నౌకయే ఇటు లనుదెంచుచున్నది! మిత్రులారా! చూడుఁడు! అందలి సుందరులు మేలి ముసుఁగులు దొలఁగఁ ద్రోయువారు! మీరును మీయంత్రసాహాయ్యమున మీనయనములకు విం దొనరింపుఁడు."—ఉపనాయకు లటు లొనరించిరి.—"ఆహా! ఏమి సోయగము! మిత్రులారా! తురుష్కనారులు సహజముగఁ గడు సుందరులు; మఱియు, తమ సౌందర్యము నిరుపమానమని యెఱుంగు మెఱుంగుఁబోఁడులే ఆపగిది నిబ్బరముగ, దమ వదనములను బ్రదర్శింతురు!"

ప్రధానోప సేనానియగు 'నికోలసు' సమంజసముగ నిట్లు బదులాడెను.—

"ఆర్యా! మనము దూర దర్శనయంత్రములతోఁ బరీక్షించుచుంటిమని తెలియక, మన నావను జక్కగఁ గాంచవలయుననెడు కుతూహలముననే వా రనాచ్ఛాదితవదనలై యుండవచ్చును."

అనంతర మాయధికారు లందఱు తురుష్కనారీజన పరిశీలన కార్యనిమగ్నులైరి. ప్రధాన సేనానియగు ఐవనుఁడు మగుడ నిట్టులనెను.—

"ఏమీ మోహనాంగుల రూపురేఖా వైభవములు! మిత్రులారా! ఇట్టి మనోహర నారీమణుల మీ రెన్నఁడైనఁ గాంచి యుందురా? వారి నావపై నున్నటులే విస్పష్టముగఁ గాన్పించువారు. ఆకర్ణాంత విశాలములగు నామచ్చెకంటుల నయనము లపూర్వ మోహజనకములే! ఛీ! ఏమీ యాగడము! వదనములు మగుడ నాచ్ఛాదితము-

లాయె!—"

"నిజము! విరాజమాన నక్షత్రము లొక్కసారి మాయమైనటు లాయెను."

"నెఱసిన గడ్డముగల ఆస్థూలశరీరుఁడేమియో తీవ్రముగఁ బలికి నటులున్నది—"

ప్రధానోపనాయకుఁడగు నికోలను ఇటులనెను.—

"మేలు ముసుంగులు దాల్పవలయునని ఆతఁ డాజ్ఞాపించియుం డును. వాని పేరు టురంబుపై దీపించు లాంఛనములు గాంచితి— ఆతఁ డొక పాషా కావలయు. మన మటు లవిరళముగఁ గాంచుట యసంగతము గదా. ఇఁక నా మోహనాంగుల మనోహరవదనములు మనకుఁ దెల్లమగుట కల్ల."

"తెల్లమగుట కల్లయా! త్వదీయాలాప మారుతాహతి నా హృదయము విపరీతముగఁ గలంగెడిని! నా మానస మమితోత్సాహ పూరితమై—"

"ఆర్యా! ఇయ్యవి యుద్ధవిరామదినములనియు, మన మిప్పుడు శాంతిధ్వజ మెత్తితిమనియు గమనించి జాగరూకుఁడవు గమ్ము. తీవ్రాచరణము తగదని మనవి చేయువాఁడను."

"ఇయ్యది యుద్ధవిరామ సమయమగుట నిక్కము. ఐననేమి? ఆతురుష్కముదుకఁడు—పాషాను, ఆసుందరనారీజనంబులను ఊరక పోనీయరాదు. ఇదియొక దోషము కానేరదు."

అనుభవజ్ఞుఁడగు నికోలను తన నాయకుని దుర్బుద్ధి మరలింప నెంతయు బ్రయత్నించెను. మహావమానియగు తురుష్కుఁడు తన కాంత కెంత స్వల్పమగౌరవము ఘటిల్లినను సహించువాఁడు కాఁడని ఆతఁడు తెలియఁబఱచెను. ఐనను, యుక్తాయుక్తము లెఱుంగని ఐవనుఁడా హితవాక్యములు పెడచెవిని బెట్టి ఇట్టులనెను—"మిత్రమా!

ఇంకగౌరవమేముండును? ప్రసిద్ధుఁడగు రష్యా సేనాని వాంఛించుటయు, తురుష్కసరాధముఁడు నిరాకరించుటయునా? ఇఁక నాకాంతల గుఱించియా!—ఎండ,కన్నెఱుంగక అంతిపురంబునఁ జిరకాలమునసయు వనితలు మనవంటి ప్రముఖులతో ముచ్చటించుటకుఁ దప్పక తత్తరపడుచుందురు."

"ఆర్యా! అందు పాషాయొక్కఁడే గాక తరుణ వయస్కులగు ముప్వురు సుందర పురుషులు గూడ నున్నవారు సుమా!"

అనుభవజ్ఞుఁడగు నికోలసు ఎంత వారింపఁ బ్రయత్నించినను, ప్రయోజనము లేక పోయెను. వారించు కొలఁది, వాని యాతురమధికతరమాయెను. తాను ముందుగ వారి చెంతకుఁ బోయి, వారిని దన నావమీఁదకు నాహ్వానించి, ఉపాయమున నాయువకులను దొలంగించి తా నాకాంతలతో సరస సల్లాపములాడి తీరుదునని యవనుఁడు దుర్మదాంధమునఁ బంతములాడెను. పూత తురుష్కనారీజనశీల మెఱుంగని ఆ మూర్ఖాగ్రేసరుఁడు చలము వహించియుండెను. యుద్ధవిరామ సమయమున నెంతటి యల్పకార్య మొనరించినను, దావానలాభీల సమరజ్వాలలు మగుడ రెండుదేశములను భస్మీభూత మొనరింపవచ్చునని ప్రధానోపనాయకుఁడు హెచ్చరించినను, ఆశకుఁడు వినఁడాయెను. నాయకుని ఆజ్ఞ యగుటచే, నొక చిన్న నౌక ఆయత్తమాయెను. చక్కని రష్యను నావికులార్గురు నౌకాదండములు బూని సిద్ధముగనుండిరి. వారందఱు ఖడ్గధరులై యుండిరి. సాయుధుఁడగు నైనికుఁడు గూడ తోడనే యందు దాసీనుఁడాయెను. నౌక క్షణము రయంబునఁ బోనాగెను.

ఆముహూర్తమున పాషా నౌక వెనుదిరిగి గృహోన్ముఖమాయెను. రష్యను యుద్ధనావను జూచు కుతూహలము తీఱుటచే వారిక దమ నిలయమునకుఁ బోనుండిరి. అట్టి సమయమున

రష్యను సేనాని నౌక ఆయత్తమాయెను. ఆవిషయము గాంచిన పాషా ఇట్టులనెను—"యుద్ధనావనుండి ఎవ్వరో దిగుచున్నారు." ఖలీలుఁ డిట్టులనెను.

"నిజము. ఆ యుద్ధనావ వడివడి మన రాజధాని జేరి తన కార్యము నిర్వర్తించుటకు మాఱు లంగరు వేయుచున్నది. నౌక వాయువేగమునఁ బఱతెంచుచున్నది! మనవంకకే యరుదెంచుట లేదుగదా?"

ఖలీలుని అంత్యవాక్యము స్వగతప్రాయము. తన యండనుండు కాంతలు భయమందుదురను భయమున నాతఁ డాపలుకు బిగ్గరగ నుచ్చరింపలేదు.

"ఆనౌక సూటిగ మనమీఁదకే వచ్చుచున్నది!" అని లూకాసు సవిస్మయముగ ననెను- ఇస్మిల్లా మగుడ భయవిహ్వలయై "అపాయము సంభవించునా?" యని ప్రశ్నించెను. పాషా యిట్టులనెను.—

"మొఱకులగు రష్యనులు గౌరవమర్యాద లెఱింగినవారు కాకున్నను, శ్వేతపతాకము బ్రదర్శించి కలహమునకు గాలు ద్రవ్వుదురని తలంపను. ఐనను, యుద్ధనావ అచట నిలుచుటయు, దూరదర్శనయంత్రములు మఱలినంతనే ఈనౌక బయలుదేఱుటయు వింతగఁ దోఁచెడిని."

ఖలీలుఁ డిటులనెను—

"వనితాజనంబులకు భయములేదు. ఆ నౌకయం దార్వురు నావికులును ఒక ఉద్యోగియుం గలరు. మనము పదిమంది యున్నారము."

"కాని, మన నావికు లాయుధహస్తులు కారు. ఐననేమి? మనము నల్వురము సాయుధులము, కృతహస్తులము గదా. మృగప్రాయులగు ఈరష్యనులు పాడి దొఱంగి దురాలోచనాయత్తచిత్తు లగుదురేని,

మన భుజబలము జవిగాంతుకు గాక!—కాని, వారేమైన నరయఁ గోరి యిటు రావచ్చును. ఇఁక ముందు భోఁజాలక తను నావికునకై తత్తరపడవచ్చును —''

యోధపురుషుఁడగు దట్టబనుపాషా యట్టు లుచితముగఁ బలుక, ఖలీలుఁడు మందస్వరంబున నిట్టులనెన.—

“పాషా! ఏ సమాధానము కావలసియున్నను, ఇట్లు రానవసరము లేదు. ఈప్రదేశ నైసర్గికము దెలియు మన జాతివాఁ డొక్కఁడైన నందుండక పోఁడు.”

వారా తెలుఁగున గుసగుసలాడుచుండ, ప్రభుపత్ని విపరీత భయాతురంబున ననిమిష నయనయై, స్వేదకణ విభూషితవదనయై మగని చెంత కరుదెంచి, ఆతని భుజము నాశ్రయించి యిట్టులనెను.—

“ఈ సమయము నిక్కముగ నపాయకరము? నాథా! మాటాడ వేమి?''

“ప్రేయసీ! భయము వలదు. ఈచర్య నాకును గ్రాహ్యము కాకున్నది— నా హృదయము భయాధీనము కాదు, కాని విస్మయగ్రస్తమై యున్నది. ఈరష్యనులకేమి కావలయునో ఎఱుంగరాదు— అనుమానాస్పదము—”

“నాథా! ఇంతజాగేల? మన నౌక నయంబున దరిజేరవలయు!— నావికులను త్వరపెట్టుడు!—”

“అసాధ్యము! రష్యను నౌక గమనము శీఘ్రతరము— మనము పోఁ బ్రయత్నించినను, ఆపాత్రమడ్డుతగిలి నిరోధించును— మఱియు, ఐదారుగురు రష్యనులు కన్పడునంతమాత్రమున పలాయన మొనరింపఁదలచుట పాడియగునా? ధీరజన సమ్మతమా? సుందరీ! భయరహితవై సుఖోపవిష్టవుగమ్ము. అబల ఒక్కతె యున్నఁజాలు, నాకును భుజము బలము సెడినట్లగును.”

భారతరహస్యాన్వయమై, ఇస్మ్రైల్లా తన తావునకుఁబోయెను. భార్యాభర్తలిట్లు పరస్పరము సంభాషించు నవసరమున, ఖలీలుఁడు సందుజూచి, ధైర్యాంచిత ప్రణయ వీక్షణము జులేఖాపైఁ బఱపెను. అదే సమయమని ఎంచి, జూలియను లూకాసులు తమ మనోహారిణులగు తైరజా గుల్నేరులను రయంబున డాసి వారి శ్రవణమున రెండుమాటలాడిరి.

సహజముగ ధైర్యశాలియు మానినియునగు దల్తబను పాషా తన నౌకను శీఘ్రతరముగ బోనీయఁడాయెను. రష్యను నౌక మఱియు మఱియు సమీపించుచుండెను. మేధావియగు ఖలీలుఁ డాకస్మికముగ నిటులనెను.— పాషా! వారి యభిప్రాయమేమైనను, మనమిచట నిలిచి యుండము.”

అట్టి ప్రవర్తనమే సమంజసమని భావించి తన బానిసల నాజ్ఞాపింప, వారుతోడనే నౌకాదండములు వదలివైచిరి. అంతలో రష్యను నౌక దగ్గఱ కరుదెంచి ఎదురుగా నిలిచెను. సేనాని యగు ఐవనుఁడు తురుష్క కాంతల నుద్దేశించి, ప్రణామపూర్వకముగా సవినయముగ శిరఃకంప మొనరించెను. తమ సహజవినయసౌశీల్య మచ్చుపడ నా నారీమణులల్లన మోములు వాల్చిరి. తత్ప్రణామమునకుఁ దానె గుఱియైతినని భ్రమించిన దల్తబను పాషా సైనిక జనోచితముగ దన దక్షిణహస్తము నిజాననమున నెత్తెను. రష్యను నాయకుఁ డంత వారందఱను గలయఁజూచి కడు సౌమ్యముగనే ఇట్లు విస్పష్టముగఁ ప్రశ్నించెను— “రష్యను భాష తెలియువారు ఇం దెవ్వరైన నుందురా ?”

తద్భాషాపరిచయము లేని కారణమున వారెల్లరు మౌనముద్రాభిముద్రితులై యుండ రష్యను సేనాని ఫ్రెంచిభాషయందు ప్రశ్నించెను.

ఖలీలుఁడు తోడనే దల్తబను పాషావంక దిలకించెను. ఆ మహా

నీయుఁడు శూన్యవదనుఁడై వింత తెఱంగున శిరం బాడించి, గడ్డము దడవుచు నిట్లు గొణఁగెను—"ఈ సేనాని వట్టి దౌర్భాగ్యుఁడు గావలయు—వట్టి మృగప్రాయుఁడు! కాదేని, పూజ్యులగు మహాత్ములు వారు నిర్వచించిన పవిత్రస్వర్గభాష వీనికి రాకుండునా?

అట్టి వెంగలిమాటలు లెక్కసేయక, ఖలీలుఁ డిట్లు అనెను.—

"ఆర్యా! నేను ఫ్రెంచిభాషయందుఁ బ్రత్యుత్తర మీయఁగలను."

ఆ భాష తనకు దెలియునని తైరజా గుత్సేనుతో జులేఖా యనెను. తనపలుకులకు బదులాడిన ఖలీలునిఁ గాంచి యవనుఁ డిట్లు పలికెను.—

"ఆర్యా! ఆ రష్యన నావను శాసించు నాయకుఁడ నని ఎఱింగింపనిండు. ఇట్టులే మీ రెవ్వరో సగౌరవముగా నాకెఱుకపఱతురా?"

"ఈ మేటి పురుషుఁడు దల్లబదు పాషా యని యెఱుంగుము. ఈ నౌక ఈ మహానీయునిది. ఈ వనితామణులు పాషా కుటుంబములోని వారు. నేనును ఈ గ్రీకుయువకు లిక్వునును పాషా యొక్క మిత్రులము, అతిథులము."

తురుష్కనారీమణుల వదనసౌందర్యము గాంచి ఆనందింపవలయు నని రష్యన సేనాని హృదయము తత్తరపడుచుండెను. కాని, దట్టంపు ముసుఁగుల నడంగియుండిన ఆ సుందరవదనబింబము లించుకేనియు గానరాకుండుటచే నైవనుఁడు కడు జీకాకు జెందియు గొంత నిగ్రహించుకొని ఖలీలు నుద్దేశించి ఇట్లు ప్రశ్నింపఁ బోయెను.—

"ఆర్యా! ఎఱుంగుదు గదా! మన దేశములు రెండును యుద్ధము విరమించి—"

"నీవా శ్వేతకేతనము బ్రదర్శించియే యుంటివి. కాని యుద్ధమునఁ బట్టువడిన తురుష్కసైనికులను మా యధికారుల కప్పగించుటకొఱకే ఈ నావ యరుదెంచి యుండునా?"

"నీ యూహ సమంజసము, నిక్కము. కాని, మనము వైరము వీగి యుంటిమి గదా. పరస్పరసుహృద్భావము వృద్ధియగు నవకాశ మవశ్యము వాంఛనీయము గదా. కావున, పాషా సకుటుంబముగ మిత్రసహితముగ మా నావమీఁద కరుదెంచి కించిత్కాలహరణ మొనరింపవలయునని అర్థించువాఁడను—మర్యాదల కణుమాత్రమైనను లోటుండదు."

"ఆర్యా! నీ యాహ్వాన మానందప్రదము. కాని, ఈ విషయమున పాషా యభిమతము నాకుఁ దెలియును. కాన, నాతనిఁ బ్రత్యేకముగఁ బ్రశ్నింపకయే ఉత్తర మొసంగఁగలను. పాషా రయంబునఁ దన గృహము జేరవలయు. కావున, నీ యాతిథ్యభాగ్య మనుభవించు నదృష్టము మాకు లేదని విన్నవించువాఁడను."

అట్లు లాశాభంగ మగుచు, రష్యను సేనాని పెదవి గఱచికొనెను. వాని వదనమున నొకానొక వికారభావము మెఱపువలెఁ దోఁచి, అట్టులే యదృశ్యమాయెను. సూక్ష్మగ్రాహియగు ఖలీలుఁ డద్దానిం గనిపెట్టెను. సేనాని ప్రయత్నము మొదటినుండియు కుటిలముగనే యుండెనని ఖలీలుఁడు గుర్తించుచుండెను. వాని వినయగౌరవములు వట్టి బూటకములని ఆతఁడు సులభముగా గ్రహించెను. తన నౌక పాషానౌకను జేరినంతనే, ఆ సేనాని ఏకతీక్షణవీక్షణమాత్రమున దురుష్క నావికులను బరిశీలించి, వారాయుధ రహితులని దెలిసికొనెను. రష్యను నావికు లాయుధహస్తులై యుండిరి. తాను దల్లభను పాషాను పరిచయ మొనరించు సమయమున నా రష్యను సేనాని నావ వంక దిలకించి చీకాకుపడుటయు గూడ ఖాలీలుఁ డరసి యుండెను. కావునఁ దా నట్లు ప్రత్యుత్తర మొసంగినంతనే యవనుఁడు దురంత వికారవదనమునఁ బెదవి గఱచుటచే దురుష్క యువకుని యనుమానము దృఢతరమాయెను. ఐనను డొక్క నిముస మూరకుండి

మగుడ నిట్టులనెను.—

"ఆర్యా! నీ పీతెఱంగున రా నిరాకరించుట యసభ్యము. నా యందు దయయుంచి మదీయాహ్వానము పాషాకు నివేదింపుము."

తానట్టులే యొనరింతునని ఖలీలుఁడు సగౌరవముగఁ బలికి పాషా వంక మోము ద్రిప్పెను. ఖలీలుని యపూర్వగంభీరోదారప్రవర్తనమును నిరుపమాన తేజోవిరాజమాన మనోహరమూర్తియు గాంచినంతనే ధూర్తుఁడగు ఐవనుఁడు తన యంతరము బాధాకరముగ గ్రహించి మగుడ బెదవి గఱచికొనెను.

ఐవను ఖలీలుల ప్రసంగము నాలించిన జులేఖా తక్కుంగల కాంతలకు వారి దేశభాషయందుఁ దెలియఁబఱచెను. రష్యను సేనాని యాహ్వానమును ఖలీలుఁ డేల నిరాకరించెనో అరయఁజాలక వారు విస్మయాక్రాంతచిత్తలైరి. నిజమనోహరుని అద్భుతప్రవర్తన మెఱంగిన జులేఖా అట్టి నిరాకరణమున కేద్దియో కారణ ముండునని విశ్వసించి నిశ్చలహృదయయై యుండెను. అపూర్వమేధావంతుఁడగు ఖలీలునిపై దత్తబను పాషా అమిత విశ్వాస ముంచుటయే గాక, ఆ విపరీతాంగుళీయోదంతము నిరంతరము కంటికిఁ గట్టినటులుండుటచేఁ గూడ నాతఁడు ఖలీలుని యభిప్రాయము నామోదించెను. కాన నా యువకుఁడు ఐవనుని గాంచి ఇట్లు పలికెను.—

"ఆర్యా! పాషా భవదీయాహ్వానమునకుఁ గడు సంతసించి కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించితి ననియు, రాఁజాలమని వగచువాఁడ ననియుఁ జెప్పెను."

ఐవనుఁడు తోడనే దురంతక్రోధఘూర్ణమాన మానసుఁడై, రోషభీషణవదనుఁడై దుర్భరంబగు విసువునఁ జేయి విదలించి తీవ్రస్వరంబున నిట్టు లనెను.—"ఇట్టి మూర్ఖప్రవర్తన మెన్నఁడు గాంచి యెఱుంగను! నేను సుహృద్భావమున నాహ్వానించుటయుఁ మొఱకు

గనంబున నిరాకరించుటయునా?"

ఖలీలుండు తన్నుపయోగానుకూలముగ గంభీరముగ నిట్లు బదులాడెను.—నీ వట్లు లనరాదు నీ యాహ్వానము సగౌరవముగ నున్నచో మేము తదనుగుణముగనే మెలంగితిమి. అంతకంటె నధిక మొనరింపఁజాలము. మఱియు మా దేశసాంప్రదాయము ననుసరించి ఆహ్వానముల నామోదింతుము: ఇష్టము లేకున్నను, కష్టముగ నున్నను, నిరాకరింతుము—ఇయ్యది మా యాచారము."

"మీతురుష్కుల నడవడి కేవల మనాగరికము. చూడు మా కాంతలు నల్లని చిక్కని ముసుంగులు దాల్చి మోములను బూర్తిగ మఱుగు పఱచి కేవల జీవరహితశిలాప్రతిమలవలె నెటులున్నవారో!"

ధూర్తుఁడగు ఐవనుఁడటుల పలుక, ఖలీలుఁ డిట్టులనెను —"చాలు నీప్రల్లదము! పాషా! ఇఁక మనవోక పోనీయ నాజ్ఞాపింపుము."

దల్తబను పాషా తో డనే ఆజ్ఞాపూర్వకముగ సన్న యొనర్పింప, నావికులు వడివడి దండంబులు త్రిప్పఁదొడంగిరి. తురుష్క నౌక యట్లు కదలినంతనే, దుర్మదాంధుఁ డగు రష్యను సేనాని సహజముగ పాద తాడిత పన్నగము పగిది క్రోధాతిరేకమున రోఁజుచు దుర్భరావమానమునపైఁ జాలక తీవ్రాస్పష్ట మందస్వరమున నిట్టులనుకొనెను—"ఇంతటి యవమానమునకుఁ బాల్పడియు, సహించి యూరకుందునా? తురుష్క నౌకాదళమంతయు నే తెంచుగాక!—ఆ నారీమణులంబట్టి నానావపైఁ జేర్చెదను!"

తురుష్క నౌక ఇంతలోఁ గొంతదూరము బోయెను. రష్యను సేనాని యభిప్రాయము తెల్లమాయెను. వాని తుదిపలుకులు తెలియకున్నను, వాఁడు దుష్టాలోచనాయత్తచిత్తుఁడై యున్నాఁడని స్పష్టమాయెను. తాను ఐవనుసితో సలిపిన ప్రసంగమును ఖలీలుఁడు పాషాకు శీఘ్రముగ, దెలియఁబఱచెను. అతఁడు వీరపురుషోచితముగ

యుద్ధసన్నద్ధుఁడాయెను. ఖలీలుఁడు సంతసించి భయకంపితలగు స్త్రీజనంబులకు ధైర్యము గఱపెను. రష్యను నౌక శీఘ్రగతిగామి యగుటచే, దురుష్కనౌక పలాయన మొనరింపఁ గోరినను, అసాధ్యము. కావున, పాషా అట్టి ప్రయత్న మొనరింపలేదు. కాంతలకుఁ గాఁపుగా నావికులను నియోగింప వలయుననియు, తాను గ్రీకు యువకులతోఁ గూడ సప్రమత్తతతో నౌకాముఖమున నిలచి యుందుననియు ఖలీలుఁడు పలికెను. ఇతరవ్యాపారములందు మందబుద్ధియైనను యుద్ధవిషయములందుఁ గడు శ్రద్ధాళుఁడగు పాషా అందులకు సమ్మతించుటయేగాక రెండు అరిత్రంబులు విడిచి తద్దండములు గాల్చి యుండవలయునని తన బానిసల నాజ్ఞాపించెను. అనంతరమా వీరుఁడు అబలలకు ధైర్యము గఱపెను ఇస్మిడా ఒక్కతెయె భయకంపితయై అట్టి హెచ్చరిక నాకాంక్షించియుండెను. జులేఖా తైగజా గుల్నేరులు తమ ప్రియులు ధైర్యస్థైర్య సమన్వితులని యెఱిఁగి నిబ్బరముగ నుండిరి. ఖలీలుఁ డంతలో నిజమిత్ర సహితముగ నౌకాముఖంబునకుఁ బోయి శత్రునౌకను వీక్షింపదొడంగెను.

## ౨౭

### పోరాటము

తురుష్కనౌకా సంరక్షణార్థమట్టి ప్రయత్నము లన్నియు నాలుగైదు నిముసములలో నాయెను. ఐవనుఁడా సన్నాహములు సూక్ష్మముగా గ్రహించుచుండెను. ఒక్కక్షణమాత్రమాతఁడు పశ్చాత్తాపమందెను. తన ఘోరప్రవర్తన మాతనికప్పుడు తెల్లమాయెను. పోరాటము తప్పదు. ఈ పోరాటమెట్లు పరిణమించునో యెఱుంగరాదు ఐనను,

ఇంత యొనరించి వెనుదిరుగుట యసంభవము. మఱియుఁ దానా తురుష్కకాంతలను యుద్ధనావమీఁదకు రప్పింతునని ముందాతఁడు తన ప్రధానోపనాయకునితో బీరములాడియుండెను. ఖలీలునితో నట్టు లధికదర్పములాడిన ఐవనుఁడెట్లు పోఁగలఁడు? మఱియుఁ దన యనుచరులు చులకనచేయుదురను భయముగూడఁ దోడగుటచేఁ బౌరుషవంతుఁడగు నైవనుఁడు పోరాటమున కాయత్తమాయెను.

తురుష్కుల సన్నాహములఁ జక్కఁగఁ బరిశీలించి తానుచిత ప్రయత్న మొనరించుటకై ఐవనుఁడు తన నౌకను గొంత దవ్వునకుఁ బోనిచ్చెను. మున్ముందు ఆయుధహస్తులను దాఁకవలయునా, లేక, దండధరులగు భటులపైఁ బడవలయునా, యని కొంతసేపాతఁడు చింతించెను. సాహసవంతుఁడగు రష్యను సేనాని వీరులగు తురుష్కయువకులను దాఁకుటయే పౌరుషవంతమనియు, వారిఁబట్టిన యనంతరము పాషా తక్కుంగలవారలు సులువుగా వశులగుదురనియు నెంచి అట్టులొనరింప నిశ్చయించెను.

తన యనుచరులకు వలయు నుపదేశములొసంగి ఐవనుఁడు స్వయముగాఁ జుక్కాని బట్టెను. నావికు లరిత్రములు దాల్చిరి. నౌక తురుష్క పాత్రమును డాసినంతనే సేనాని చుక్కానివీడి ఖడ్గము ధరించెను. నావికులుగూడ దండంబులు బోఁద్రోసి కత్తులుబూనిరి. ఇరువురు దృఢగాత్రులు వెంటనరుదేఁ, ఐవనుఁడు చంగున ముందుకుఁబోయి, ఫ్రెంచిభాషయందు బిగ్గరగ "మువ్వురకు మువ్వురము!" అని పలికెను.

పోరాటము ప్రారంభమాయెను. ఐవనుఁడు సగర్వముగ నౌకయుక్కుజీను * పాషా నౌకపై విసరెను. వీరుఁడగు ఖలీలుఁడు త్రిప్పు ఖడ్గము నాతఁడు నేర్పుమెయి తప్పించుకొనెను. అనంతర మాయోధు

* లంగరు

లిద్దరు ద్వంద్వ యుద్ధమునకుఁ దలపడిరి. జూలియను లూకాసులు సాయుధులగు రష్యనుభటులను దాఁకిరి. ఖడ్గములు మెఱుపులవలెదీపించి కణకణరవంబు లొనరించినంతనే భీతచిత్తయగు నిస్మిల్దాయుందస్వరంబు ననే 'హా' యని విలపించెను.

తోడనే పాషా తీవ్రముగ మందలించెను.

అనంతర మామహనీయుఁడు యుద్ధరంగము సమీపించి శత్రు సంఖ్య యధికతరంబగునేని తన మిత్రులకుఁ దోడ్పడవలయునని నిశ్చయించి అప్రమత్తుఁడై యుండెను. అట్టి యవసరము నిక్కముగ వెంటనే యరుదెంచెను. తురుష్కఖడ్గ ప్రహారమున నైవనుని వామ భుజము తెగి రక్తము స్రవింపఁజొచ్చెను. రుధిరము గాన్పించినంతనే మిగిలిన సైనికులు నల్వురును సహింపఁజాలక, ఆగ్రహావేశమునఁ గృపాణములుసాసి ముందునకురికిరి. ఖలీలుఁడు వారి ప్రయత్నము గుర్తించి తటాలున రష్యనునొకపై లంఘించి ఒక్కవ్రేటున ఐవనుని దక్షిణ భుజముగూడ ఛేదించెను. ఆవీరుఁడు తోడనే డిల్లవడి సోలుచు వెనుకంజవైచియు, మగుడ స్థైర్యగుణ ధుర్యుఁడై, సమరకార్య పర తంత్రుఁడాయెను. తమమిత్రుఁడగు ఖలీలునితోఁబాటు జూలియను లూకాసులుగూడ రయమ్మునఁ దమనొకవిడిరి. ఆవెంట పాషా చయ్యనఁబోయెను.

పోరాటమొక్కక్షణములోఁ గడు దారుణమై, ఐదారు నిముసములు దుర్నిరీక్షముగఁ జెలరేగి చల్లారెను. ప్రతాపశాలియగు ఖలీలుచే కోహటించి ఐవనుఁడు నిరాయుధుఁడై భూపతనుఁడాయెను. జూలియను లూకాసుల భుజబలమున నిద్దరు రష్యనుభటులు తెగటారిరి. దత్తబను పాషా డాఁకిన సైనికుఁడపాయకరమగు గాయము దిని నేల గూలెను. పాషా భటులుకూడ రంగమున రయంబున ప్రత్యక్షమైరి. మిగిలిన వైరిభటులు ముప్పురు సులభముగా నాయుధరహితులై

వశులైరి. తురుష్క వీరులకు దగిలిన గాయములు కడుస్వల్పములు. తురుష్కులీ పోరంబున సంపూర్ణ విజయము గాంచిరి.

ధూర్తుండగు రష్యనువీరుడు చేవసెడి ధరాతలంబున వ్రాలినంతనే వాని పేరురమున ఖలీలుఁడు తన పాదముమోపి పోరాటము ముగిసినంతనే చరణముదీసి లెమ్మని ఆజ్ఞాపించెను. రక్తసిక్తుండగు నైవమునకట్టికార్యము కష్టసాధ్య మగుటచే నాతఁడు మెల్లగ నిలుచుండెను. వాని వదనమునఁ దాండవించు దుర్భరాగ్రహావమానములు వర్ణనాతీతములు. ఆదుర్బలుని చిత్తము దురంతమగు పౌరుషముతో నుడికిపోవుచుండెను. అపారదుర్గర్వమున నరుదెంచిన ఆనాయకునకట్లు శృంగభంగమగుటచే మాటాడక, క్రూరమృగోద్రేకపూరిత వీక్షణంబుల దురుష్కవీరులఁగలయఁ జూచెను.

సహజోదార హృదయుఁడగు ఖలీలుఁడు తన యధీనుఁడైన వైరి వీరుని గాయము తొలుదొత్తుగట్టి, రక్తస్రావము మాన్పి, అనంతర మిట్టులనెను— సైన్యాధిపా! నిష్కారణముగ మమ్ముఁదాఁకి ఇంతటి యాగడ మొనరించితివి. మానాయకుఁడగు దత్తబనుతరపునఁ బ్రశ్నించువాఁడ— నీవొసంగు సమాధానమెద్ది?”

సమయము విషమముగఁ బరిణమించినను, రష్యను సేనాని దురహంకారమడంగ దాయెను. తా నేసమాధాన మొసంగననియు, నీతిబాహ్యులగు తురుష్కుల దయనర్థించువాఁడఁగాననియు నాతఁడు విస్పష్టముగ వక్కాణించెను. ఖలీలుఁడంత నిట్టులనెను.—

“ఇట్టి దుర్గర్వము నిరర్థకము. నీప్రవర్తనము సర్వవిధముల నింద్యము గదా. యుద్ధవిరామ సమయమయ్యు, నిర్హేతుకముగ మమ్ము దాఁకి శాంతి భంగమొనరించితివి: నిక్కంపుఁ బౌరుష మెఱుంగని పంద పగిది నధర్మయుద్ధమునకుఁ దలపడి అబలాజనంబులకు భయభ్రాంతులు గల్పించితివి—”

"నే నెట్టి దౌష్ట్యము లొనరించిననేమి? తత్ఫలమనుభవించుటకు సంసిద్ధుఁడను;—మూర్ఖాగ్రేసరుఁడగు మీపాషాను క్షమాభిక్ష నర్థింతునని మాత్రము తలంపకుము. ఒక్క విషయము మాత్రము గమనించి మెలంగుము. యుక్తాయుక్తము లరయక నన్ను శిక్షింపఁ గడంగుదేని, ఆ యుద్ధనావపై నుండు నాయుద్యోగులు తగు ప్రతిక్రియ సల్పుదురు. మాయధీనమున నఱువండ్రు తురుష్క యోధులున్నవారు—"

ఖలీలుఁడు క్రోధారుణితనేత్రుఁడై ఐవనుని వారించి యిట్లనెను.- "వారిని మారాజధానియం దప్పగింపవలయు! యుద్ధమునఁ బట్టువడిన మీయోధుల నీసరికి మానావ మీనగరము జేర్చియుండును."

"మాటలకేమి? కార్యమెట్లు పరిణమించునో చూడుము. అల్లదె! చూడుము. మానావనుండి చూచెదు దూరదర్శన యంత్రములు! మన పోరాటము గాంచి నాకు సాహాయ్యమొనరింప మఱియొక నౌకను నాయుద్యోగులాయత్తము చేయువారు! ఇపుడు జయించితినని గర్వింపకుము! మఱియు మాయధీనమున నున్న మీవారలెట్టి యవస్థకుఁ బాల్పడుదురో గ్రహించి మెలంగుము."

ఐవనుని పలుకు లసత్యములు గావు. పండ్రెండు దండములు గల పెద్ద నౌక యొకటి సైనికజన సంకీర్ణమై యరుదెంచుచుండెను. యుద్ధనావయందలి ఫిరంగులు గూడ భయంకరముగ గోచరింపుచుండెను. పరిస్థితు లట్లు కడు విషమముగ నున్నను జలింపక, రష్యాను సేనానితోడి ప్రసంగము ఖలీలుఁడు పాషాకుఁ దురుష్కభాష యందుఁ దెలియఁబఱచెను. మహమ్మదీయ ప్రభువు తోడనే క్రోధవివశుఁడై, తత్క్షణ మా రష్యనుని బొలియింపఁగోరెను. దానఁగలుగు నుపద్రవము—రష్యనుల యధీనమునందున్న తురుష్క యోధులకు సంభవింపఁగల అపాయమును విశదీకరించి, ఐవనుని సాహాయ్యమున

కరుదెంచు రెండవ నౌకను జూపి, రష్యను యుద్ధనావయందలి ఫిరంగులను ఖలీలుఁడు స్మరణకుఁ దెచ్చినంతనే దల్లబను పాషా ఆగ్రహముడిగి కర్తవ్యము నిర్ణయింపనేరక కార్యభారము పూర్తిగ ఖలీలుని మీఁదనే యుంచెను. జూలియను లూకాసు లందులకు సంతసించిరి.

రెండవ రష్యను నౌక క్రమముగా దగ్గఱయగుచుండెను. ఖలీలుఁడు రయమున నైవనుని వంకఁ దిరిగి నిశ్చల గంభీరస్వరంబున నిట్లులనెను.—

“దల్లబను పాషా యభిమత మాలింపుము. మాతురుష్కయోధులను ముందుగ దిగ విడిచితివో, నిన్నుఁ బోనిత్తుము.”

“అందుల కొడంబడనిచో నేమి సేయుదురు?”

“నీశిరము తెగి నేలఁబడును. అనంతరము మాభుజబలము కొలఁది ఆ రెండవ నౌకతోఁ బోరాడుదుము. నీవొక్క విషయము గమనింపవలయు. తొంటి మానావికు లాఱ్వురు ఆయుధరహితులు గారు. వారిపుడు మీఖడ్గములు దాల్చి యుద్ధసన్నద్ధులై యున్నవారు.”

“ఆర్యా! అంతమాత్రమున భయకంపితుఁడ నని యెఱుంగుము. మగుడఁ బోరాటము కలుగునేని, నీవు జయింపఁగలవా? అసంభవము! అసంబద్ధము! ఆనౌకయందనేకులున్నవారు: వారందఱు ఖడ్గధరులగుటయే గాక తుపాకులుగూడ దాల్చిరి.—”

“ఎందులకీ మిథ్యాప్రగల్భములు! కాలహరణ మొనరింపక సత్వరము ప్రత్యుత్తర మొసంగుము. లేదేని, మరణింప సిద్ధముగ నుండుము!”

ఐవనుని దురహంకారము చాలవఱ కంతరించెను. తానట్లు కలహమునకు గాలు ద్రవ్విన సమాచారము పాషా మఱువవలయుననియు, రష్యను ప్రభుత్వమున కాయుదంతము తెలియరాదనియు నాతఁడు కోరెను. ఖలీలుఁడు సమ్మతించి వెండియు నిట్లుపలికెను.—

"నేఁ జెప్పిన చొప్పున మా తురుష్క యోధులు సురక్షితముగ దిగునవఱకు నీవిచటనే యుండవలయు — నన్ను వారింపఁగడంగక పూర్తిగ నాలింపుము. ఐదు నిముసములలో నా సహాయనౌక మన చెంత కరుదెంచును. నీవిలోన నేఁగోరినట్లు లొంగనిచ్చుచుండినచో సమయము మొఱరింపవేని, నీ శిరం బొక్క వ్రేటునఁ దెగిపడును — ఆనౌక యరు దెంచునంతనే నేనందుఁ బ్రవేశింతును. మావారలందఱు సురక్షితముగ స్వదేశ తీరస్థులగుట నేను గనులారఁ జూడవలయు. అనంతరము నేనిచట కరుదెంచునంతనే నీవా నౌక నారోహించి వెడలవచ్చును. సైన్యాధిపా! అంగీకరింతువా! ఆ నౌక సమీపించుచున్నది — త్వరపడుము!"

"అందనుక నేనిందు బందీనై యుండనేల?"

"నీ హృదయము నిర్వక్రమగునేని, సంశయమేల? ఒక గంటలో మా యోధులు దిగిపోయెదరు. అంతవఱకు నేను మీ నావయందు బందీవలె నుందుగదా?"

ఉపాయాంతరము దోఁపకుండుటచేతను, ఖలీలుని, ఏర్పాటు సమంజసముగ నుండుటచేతను ఐవను డు సమ్మతించెను. ఖలీలుఁడు మగుడ నిట్లు పలికెను.—"ఆర్యా! మఱియొక విషయము గమనింపుము. నౌక చేరువయైనది. నీ సహాయసేనానికి తగునుత్తరవు లొసంగుము. రష్యను భాష నాకుఁ దెలియదను నిబ్బరమున ద్రోహ మొనరింపఁ గడంగెదు సుమా! — తద్భాషాజ్ఞానము లేకున్నను, నీదు వీక్షణముల బట్టియే అరయఁజాలుదు — భద్రము!"

రెండవ రష్యను నౌక సమీపించెను. పన్నిద్దరు నావికులు గాక, అందుఁ బదునెనమండ్రు సైనికులు నుండిరి. ఐవనుని ప్రధానసహాయ సేనాని యగు నికోలసే స్వయముగా నాయకత్వము వహించి యరుదెంచెను.

చెప్పవలసిన మాటలు ఐవనుఁడు రయంబునఁ జెప్పెను. ద్రోహ మణుమాత్రమైనను గోచరించునేని తత్క్షణము వాని తల ద్రెవ్వ నేయుటకు ఖలీలుఁడు సునిశితఖడ్గపాణియై అనిమేషనయనుఁడై సిద్ధముగ నుండెను. కాని, రష్యను నాయకుఁడు సముచితముగనే మెలంగెను. తన సేనాని యొకింత మాలించినంతనే రష్యనులు చిన్నవోయిరి.

తా నేర్పఱచిన కార్యక్రమము ఖలీలుఁడు పాషా మొదలగు వారికిఁ దెలియఁబఱచెను. శత్రునావమీఁదకుఁ బోయినచో నాతని కెట్టి అపాయము వాటిల్లునో యని వారు వెఱచిరి. వారి భయంబుడుప, ఖలీలుఁ డిట్లు లనెను.—

"ఈ ఐవనుఁడు కడుక్రూరుఁడు. పరిభవానల తప్తుఁడగు నీ మృగతుల్యునిఁ బోనిత్తుమేని మన యోధులను దప్పక హింసించును. ఆ కారణమున నిట్లు లేర్పఱచి నేను బోనుంటిని."

తురుష్కయువకుఁడు నిరుపమానపరాక్రమవంతుఁడగుటయే గాక సమయ మెంత ప్రతికూలముగ నున్నను రయంబునఁ దదుల్లంఘనోపాయము నరయుటయందుఁ గూడఁ గడుంగడు ప్రవీణుఁడని దలఁచి పాషా హృదయపూర్వముగా నగ్గడించెను. జూలియను లూకాసులు గూడ సంతసించిరి. వనితలకు ధైర్యము గఱపవలయుననియు దురాచారపరుండగు నైవనుని గనిపట్టవలయుననియు హెచ్చరించి ఖలీలుఁడు రెండవ రష్యను నౌకయందుఁ బ్రవేశించెను.

ఖలీలున కెట్టి యపాయము వాటిల్లునో యని తురుష్కాంగనలు సహజముగ భీతిల్లిరి. జూలియను లూకాసులు తమ కాంతలకు ధైర్యము గఱపిరి. కాని, ఇస్మిల్డాకు ధైర్య మలవడుట ఎట్లు? ఆ భువనైకసుందరాంగుని పొందు వడయ నపేక్షించు నా స్వైరిణి కడుంగడు గుందెను. జులేఖా తొలుదొల్త భయాకుల యయ్యు దనమనో

హాసుఁడవాఁ వివేకవంతుఁడని యెఱింగి ధైర్యము జిక్కఁబట్టెను. ఆ ముహూర్తముననే నవ్వ్యవ నుండిన తురుష్కవీరుఁడు భావగర్భితవీక్షణ మొక్కటి పఱపెను; జులేఖా చిత్తము నిశ్చలంబాయెను. ఖలీలుని భావ మెఱుంగక, అట్టి సన్మానమునకుఁ దానె గుఱియైతినని భ్రమించి ప్రభుపత్నియు నొకింత సేదదేఱెను.

రష్యను సహాయసేనాని అనుభవజ్ఞుఁడు. ఉదారవంతుఁడు గూడ నగుటచే సరసముగ మెలంగెను; ఖలీలుఁడు సంతసించెను. రయంబున నారా యుద్ధనావ సమీపించిరి. తోడనే, సేనాని తురుష్కవీరుని సగౌరవముగాఁ గొంపోయెను.

సహాయసేనాని ప్రవర్తనము కనుంగను ప్రశంసనీయముగ బ్రీతికరంబుగ నుండెను. ఖలీలున కాతఁడు తురుష్క యోధుల పట్టి యొసంగఁబోయెను. సేనాని గౌరవనీయుఁడని యెఱుంగుటచే సేనాని సంతసించి తన యధీనమున నున్న తురుష్కయోధుల నఱువండ్రను ఈవలకుఁ గొనివచ్చి ఖలీలుఁడు చూచుచుండగనే వారి సంకెలను జిన్న నౌకలయందుఁ బదిలముగ దింపించి, తీరమునఁ జేర్పించెను. ఖలీలుఁడమందానందభరితహృదయుఁడై తన కృతజ్ఞత సముచిత భాషణంబుల వెలిబుచ్చి, ఆ నావ డిగ్గి, కొండొక నౌకయందు దాసీనుఁడై తన నౌక సమీపించెను.

అచటి రష్యను తురుష్కనౌకలు రెండు నట్టులే అంటియుండెను. రష్యను నౌకయందు నిరాయుధుఁడగు నైవనుఁడుండెను. తత్సమీపమున దత్తబను పాషా ఖడ్గపాణియై అప్రమత్తుఁడై యుండెను. రష్యను భటులు తురుష్కబానిసల యధీనమున నుండిరి. తురుష్క జవరాండ్రు తమ నౌకపై మనోహర వితానము క్రింద సుఖాసీనులై యుండిరి. జూలియను లూకాసులా సమీపముననే యుండిరి. తమ ప్రియురాండ్రతో ముచ్చటలాడుచుండిరి. అట్టి సమయమున ఖలీలుఁ

డురు దెంచెను.

ఖలీలుని గాంచినంతనే వారందఱు సహజముగ నానందపరవశులైరి. కార్యము క్రమముగాఁ జక్కఁబడెగాన, రష్యను సేనానిని సాయుధముగాఁ బంపివేయవలయునని ఖలీలుఁడు పలికెను. కాని, ఆతఁడు స్వీయనౌకాయూథుఁడగు దస్యుక వైరిని విడువనొల్లనని దత్తబను పాషా పలికెను. ఐనను, ఖలీలుఁడు మఱలఁ జెప్పుటచే నాతఁడు సమ్మతించి, ఐవనుని ఖడ్గ మాతని కొసంగి పాషా సెలవొసంగ, నాతఁడు తన నౌక జేరెను. ఖలీలుని సన్మానించి రష్యను భటుల ఖడ్గములను మాత్రము గొని తురుష్కనావికులు తమ నౌక జేరిరి. పాషాయును సగర్వముగఁ దన విహారపాత్రపైఁ గాలిడెను.

ఖలీలుఁ డొక్కఁడే శత్రునౌక యందుండెను. అద్దాని లంగరు ఇంకను తురుష్కనౌకను బట్టియుండెను. భటులద్దానిం దీయుట మఱచిన కారణమున దానే సడలించి శత్రునౌక వీడవలయునని ఖలీలుఁడు తలంచి యట్టులాచరింపఁ బోయెను. దైవఘటన మెటులుండునో ఎఱుంగరాదుగదా! ఖలీలుఁడు లంగరుదీయుట, నాతని పుట్టంబులందు, జిక్కువడుటయు, పెనుగాలి తీవ్రవేగ వీచుటయు, రెండునౌకలాకస్మికముగా వీడి దవ్వగుటయు తదవసరమున మన తురుష్కవీరుఁడు చయ్యన జలంబుల బడుటయు నొక్కసారి దారుణముగ సంభవమాయెను! తురుష్కనావికులు హాహాకారము లొనరించిరి. జూలియను లూకాసులు రయంబున దుముకి తమ మిత్రుని రక్షింప వలయునని సమకట్టిరి. దత్తబను పాషా సంభ్రమాకులుండై యట్టె నిలిచియుండెను. తత్క్షణము రష్యనునౌక పఱతెంచెను. నావికులు తమ బాహువులు చాపి ఖలీలుని రయంబున లేవఁదీసిరి. ఆ కారణమున జూలియను లూకాసులు సాహస మొనరింపవలసిన యవసరము లేకపోయెను.

రష్యను సేనానియగు ఐవనుఁడు విశాలహృదయమునఁ దమమిత్రుని

రక్షించెనని గ్రీకులును తురుష్కులును సంతసించిరి. కాంతల యానందమునకు మేరలేదు. కాని వారి యానందము వెంటనే యంతరించెను. కారణమేమన, ఖలీలుని సురక్షితముగ దురుష్కనౌకపై జేర్చుట మాని, ముష్కరుడగు సైనికుడాతని బంధించి తన నౌకను వడివడి బోనిచ్చెను!

పాషా సహజముగ గ్రోధోన్మత్తుడై, అంతటి యకార్యమొనరింప సాహసించిన ఆరష్యను కిరాతుని వెన్నాడి వాని మద మడంప వలయునని ఆజ్ఞాపించెను. ఆ ధీరోక్తుల నాలించిన ఖలీలుడట్టి తీవ్ర కార్యమునకు గడంగవలదనియు, తన కొఱకు భీతిల్లవలదనియు, ఎట్టి గడబిడయు జేయరాదనియు, ఒక్క గంటలో మగిడివత్తుననియు బిగ్గరగ జెప్పెను. దత్తబను పాషా ఇతికర్తవ్యతా విమూఢుడై యుండెను, అమిత మిత్రవత్సలతావేశమున గ్రీకుయువకులు రయంబున జలములం బడి ఈదిపోయి ఖలీలుని జేరవలయునని తలంచిరి. సహజకోమల హృదయులగు కోమలాంగులు గొల్లున విలపించిరి. జులేఖాయే అచిరకాలమున నిబ్బరముపహించి తోడికాంతలకు ధైర్యము గఱపం గడంగెను.

పాషా ఉచ్చపాటడంగినంతనే ఆ రష్యను నౌకను వెన్నాడవలయునని మగుడ నాజ్ఞాపించెను. తత్క్షణమా యుత్తరువు రద్దుపఱచి తురుష్క యుద్ధనావల నంపుటకై తన నౌకను రయంబున సువర్ణశృంగమునను బోనీయవలయునని తీవ్రస్వరంబున నాతడాజ్ఞాపించెను జులేఖా యల్లన దన మామచెంతకుంబోయి ఖలీలుని బుద్ధివైభవము నాతని స్మరణకుందెచ్చి, ఆ వివేకవంతుని పలుకులు మగుడ వినిపించి, సహించి మిన్నకుండుటయే సదుపాయమని హెచ్చరించెను. గ్రీకులు గూడ నయ్యదే తరుణోపాయమని పలుకుటచే దత్తబను పాషా శాంతించెను. కాని, పర్యవసానము తేలువఱకు దానచట వేచియుండు

నని మహమ్మదీయ ప్రభువు సంకల్పించెను. నిశ్చలమగు బాస్వగను జలాంకముః దురుష్క నౌక నిశ్చలముగ నిలిచియుండెను.

## ౨౫

### అనలగోళములు

రష్యను నౌకలు రెండును యుద్ధనావను శీఘ్రముగ సమీపించుచుండెను. మార్గమధ్యమున ఖలీలుఁ డిట్టులనెను.— సైన్యాధిపా! నినుబోలు విశ్వాసఘాతుకునితో ధర్మాధర్మములు జర్చించువాఁడఁగాను. నిన్నే మియు నర్థించువాఁడనుగూడగాను. కాని, వైరిజనపరివృతుఁడగు నేకాకిని, అసహాయుని నీభటులింకను బట్టియుండనేల? నన్నువీడి భటులు దవ్వుననుండునటు లాజ్ఞాపింపుము."

ఐవనుఁడు సన్నయొనరించేనంతనే, భటులాతని ఖడ్గము దీసికొని ఖలీలుని వీడిరి. అవయవస్వాతంత్ర్య మలవడినంతనే ఖలీలుఁడొక చిన్నగోళముదీసి, బాహుబలము కొలఁది నౌకపైఁ గొట్టెను. తోడనే నావికు లదరిపడునట్టు లొక్క మహారవ ముత్పన్న మాయెను. తదవ సంభవ సాంద్రధూమరాశితో నౌక నిండిపోయెను. దిట్టరియగు నైవనుఁడు సహితము కంపితహృదయుఁడై, శితాస్త్రము రయంబునఁ దీసి ఖలీలుని ఖండింపఁబోయెను. నౌకను ముంచివేయుటకే తురుష్కుఁడాగోళము బ్రయోగించియుండునని సేనాని ప్రథమమున ననుమానించెను.

ఖలీలుఁ డావంతయుఁ జలింపక, గంభీరాననుఁడై, నిజవేసు టురంబునఁ గరములుజేర్చి రష్యను సేనానిపైఁ దిరస్కారసూచిత వీక్షణము బఱపి ఇట్టులనెను.—

"ఏమి! నాకతమున నలవడిన ఈ ఖడ్గము తోడనే మదీయ ప్రాణాపహరణ మొనరింపఁ జూతువా? ఏల నిదానించెదు! నీయనాగరిక ప్రవర్తనము నీకే ఏహ్యముగఁ దోఁపదేని, నీ ప్రాణదాత యుత్తమాంగము సత్వరము ఖండింపుము."

లజ్జాధికమున నైవసుని వచన మెట్టబాఱ, ఖడ్గము మఱుఁగు పఱచి, ఆ విపరీతఘోషము సాంకేతికము తెలుపవలయునని ఆతఁడు కోరెను. ఖలీలుఁ డందులకుఁ బ్రత్యుత్తరమీయక, తానాయుద్ధ నావఁ జేరిన యనంతరము దెల్పెదనని పల్కెను. అనంతరమా వీరుఁడు నిశ్చలముగఁ గూర్చుండెను. ఐవసుని హృదయ మొకింత పశ్చాత్తాప తప్తమాయెను. తన ధూర్త ప్రవర్తన మాతనికి సువ్యక్తమాయెను. అమితోదార హృదయుఁడగు వీరునియెడ విశ్వాస ఘాతుకముగఁ బ్రవర్తించితివని ఆతని మనస్సాక్షి నిందించు చుండెను. అట్టులాచరింప వలయునని ఆతఁడు తలంపలేదు. కాని, ఖలీలుఁడు ప్రమాదవశమున నీటఁబడినంతనే అట్టి దుర్బుద్ధి ఆకస్మికముగ వానికిఁ బొడమెను. వానిమానస మిపుడు విపరీతముగ విహ్వాలించెను. ఆ యగ్నిగోళ మాతని డెందమున నొకవిధమగు దడబుట్టించెను. ఆతని యనుచరుల మోములు చూచుట కెంతయు భయావహముగ నుండెను. కడుబాధాకరముగ నుండిన ఖలీలుని విడిచి వేయవలయునని ఐవసుఁడు లోలోనఁ దత్తరపడసాగెను. కాని, తురుష్కవీరుఁడు వినమ్రుఁడై యర్థింపఁడు: కిల్బిష వంతుఁడయ్యు బౌరుషవంతుఁడగు ఐవసుఁడు తనంతదాను పీడఁడాయెను. తురకా దుండగీఁడు తన యందావంతయు నేరము లేదనియు, యుక్తాయుక్తము లెఱుంగని ఖలీలుఁడు తప్పక శిక్షార్హుఁడనియు దనకనువుగా నిశ్చయించుకొని, మగుడ ధైర్యముదాల్చెను.

సహాయసేనాని యొక్క నౌకముందుగనే యుద్ధనావను డాసెను. అనంతరము ఐవసుని నౌక సమీపించెను. ఖలీలుని మగుడఁ గాంచి

నంతనే రష్యను సహాయసేనాని విస్మయాగ్రహపరవశుఁ డాయెను. ఐవనుఁడు మహాద్రోహ మొనరించెనని ఆతఁడు తత్క్షణము గ్రహించెను. సేనాని ఆజ్ఞాపింప ఖలీలుఁడు సహజ నిశ్చలహృదయమున నాయుద్ధనావపై కెగసి, వివేకవంతుఁడగు నికోలసునుగాంచి భావగర్భిత ప్రణామ మాచరించెను. తురుష్కుని ప్రవర్తనము దోషరహితమని ఆతఁడు తోడనే గ్రహించి, ఇఁకఁదన సేనాని ఏమిచేయునోయని అనిమిషనయనుఁడై వేచియుండెను.

అనంతరము ఖలీలుఁడు నాలుగడుగులు ప్రక్కకువైచి, మఱియొక గోళముదీసి, ఐవనుని హృదయ మదురునట్లు, భూరితరధ్వానము వెలువడునట్లు రయంబునఁ గొట్టెను. ఐవనుఁడు శూలఘాతశార్దూలము భాతిఁ బటు రోషాయత్తచిత్తుఁడై కటారిం గటాలునతీసి తురుష్కవీరునిపై నుఱుకఁ బోయెను. కాని, ఖలీలుని నిరసనమయు నిరుపమానధైర్యస్థైర్య విస్ఫురిత వదనముగాంచి రష్యను సేనాని చకితుఁడై లజ్జారుణితాననుఁడై, ఐనను క్రోధవర్జితుఁడు గాఁజాలక, ఆతురుష్కవీరాగ్రేసరు నురికంబమునకుఁ గొంపొండని భటుల నాజ్ఞాపించెను. ప్రభునాజ్ఞానువర్తులగు చారులు తోడనే ఆ యసహాయశూరునిఁ జుట్టిముట్టి మగుడగట్టిగఁ బట్టిరి. అట్టి యవసరమున ననుభవజ్ఞుఁడగు సహాయసేనాని వారింపఁగడంగెను. ఐవనుఁడాతనితోఁ బ్రసంగింప నొల్లక, ఖలీని వంకఁదిరిగి చుఱచుఱఁజూచి, ఆ విపరీతానల గోళముల భావమెద్దియో ఎఱింగింపవలయునని సగర్వముగఁ బ్రశ్నించెను. తురుష్కుఁడిట్టులనెను.—

“నీవంటి ధూర్తునకు వెఱచి నేను సమాధాన మొసంగువాఁడఁ గాను. ఐనను, నీ కుతూహల మడఁపుటకు నా కభ్యంతరములేదు. నన్నుఁబట్టు జెట్టులు దవ్వున నుండవలయునని ముందుగ నాజ్ఞాపింపుము.”

“ఈగోళములింకను గలవేమోశోధించి అనంతరము నాభటులు

నిన్ను వీడుదురు."

"వానితో నాకిఁకఁబనిలేదు. రెండు గోళములు మోగించితి గదా! దాన నా కార్యమాయెను."

ఐవనుఁడు నిరుత్తరుఁడై సన్న యొనరింపఁ భటులు తొలంగిరి. ఖలీలునకు మఱల నవయువ స్వాతంత్ర్య మలవడెను. కుతూహల ప్రకంపిత హృదయుఁడగు సేనాని మఱలఁ బ్రశ్నింప, నొక పత్రము లేఖినియు నున్నగాని, విశదపఱచుట అసాధ్యమని తురుష్కుఁడు పలికెను. అంతఁ దన గదిలోనికి రమ్మని ఐవనుఁడాతనిఁ జీరెను. కాని, సహాయసేనానియగు నికోలసుగూడఁ దన యండనుండ వలయునని ఖలీలుఁడుకోర, ఐవనుఁడు దురంతక్రోధ ఘూర్ణితుఁడయ్యు, ఇయ్యకొనెను. ఆముువ్వురు దోడనే సేనాని గదిలోనికిఁ బోయిరి.

ఖలీలుని సమాధాన మాలించుటకు రష్యను సేనానుల చిత్తము కొట్టుకొని పోవుచుండెను. తురుష్కుఁడు కలము జేతఁబూని, ఉపోద్ఘాతపూర్వకముగా నిట్టులనెను.—

"అయ్యలారా! నేఁజెప్పు విషయము కడు వింతగఁ దోఁచును. విశేష ప్రకృతి శాస్త్రజ్ఞాన పరిణామము మీ కెఱింగించువాఁడ, శ్రద్ధ మెయి నాలింపుఁడు. మానవుని రాక్షసవిజ్ఞాన మొక యపూర్వ దారుణ మారణ యంత్రము గల్పించెను. అయ్యంత్రమునకును మనకును గల పరస్పరసంబంధము వ్యక్తము కాఁగలదు. భవదీయ ధూర్త ప్రవర్తన ప్రతిక్రియా పూర్వకమగు మదీయానల గోళప్రభావము గూడఁ దెలియఁగలదు. గమనింపుఁడు."

రష్యను సేనానుల హృదయము సహజముగ దురంత విస్మయ కుతూహలములచేఁ బ్రకంపించెను. ఐవనుని హృదయము విపరీతమగు భయంబున కగ్గమాయెను. ఖలీలుఁడు సహజ నిశ్చలస్వరంబున మఱల నిట్లు చెప్పఁదొడంగెను.—

"అపూర్వ మేధావంతుఁడగు ఫ్రెంచి శాస్త్రజ్ఞుఁ డొకనాఁడు మా రాజధాని కరుదెంచి, ప్రధానామాత్యుని సందర్శించి, ఒకానొక మేటి నవీన కల్పనము రహస్యముగ నెఱింగించెను. వజీరు తోడనే తురుష్క నౌకాదళాధ్యక్షుని, సుప్రసిద్ధులగు శాస్త్రజ్ఞులను రావించి ఆ విషయము వారితో సంప్రతించి, ఆ ఫ్రెంచి శాస్త్రజ్ఞుని సముచితముగ బహూకరింపవలయునని నిశ్చయించెను. మీ కెఱింగింపరాని పరిస్థితు లనుకూలించుటచే, నా రహస్యము నాకును బరిచయమాయెను."—

రష్యనుల ఆతుర మధికతరమాయెను.—

"ఫ్రెంచి శాస్త్రజ్ఞుని సాహాయ్యమున అస్మద్దేశస్థు లొక వింత నావ సృష్టించిరి. ఈ రహస్యము మా దేశస్థులకైనఁ దెలియదు. నౌకాదళమును శాసించు పాలకవర్గమునకు మాత్రము తెలియును. నేఁజెప్పు నౌక సాధారణమైనది గాదు. అది యొక జలాంతరగామి. నామము సార్థకమగునట్లు అయ్యది మత్స్యాది జలచరములవలె నీట మునింగియే నిరాఘాటముగ విహరింపఁగలదు. తదాకృతి వ్రాసి ఎఱుకపఱచెదను. నౌక ముప్పది యడుగులు నిడివి గలిగి మత్స్యరూపమున నుండును. పుచ్ఛము చుక్కాణి తత్పక్షము లరిత్రములవలె నుపకరించును. తదంతరమున నమరియుండు యంత్రప్రభావమున నా జలచర మేవంకనైన సుళువుగాఁ దిరుగఁగలదు. దాని జవమసాధారణము. విమలధవళకాచ ఖండములు నయనములవలె నమరియుండును. అయ్యవి గవాక్షములు. గమనించితిరా?"

తురుష్కుఁ డొక పటముగూడ వ్రాయఁదొడంగెను. రష్యనుల కౌతూహలము శతాధిక మాయెను.

"మీరు సావధానచిత్తులరై యుండవలయును. ఈ జలాంతరపాత్రము త్రిఖండయుతము. పుచ్ఛాకృతినుండు ప్రథమ ఖండము

నందుఁ గర్ణముండుగదా. సామగ్రియు నందే యుండును. ... వున నొక్కనికే యందుఁ దావుండును. మిగిలిన రెండు గదులయందుండు వారాతనితో మాటాడఁజాలునటులు గొట్టము లమరియుండును. ప్రాణవాయువుం దయారుచేయు పదార్థ సముదాయము రెండవ గదియం దాయత్తమైయుండును. తదంతర యంత్రపరికల్పిత వాయు ప్రభావమున నార్గురు మనుజులైదాఱుగంటల కాలము నీటియందు మునిఁగి యుండఁగలరు. అపూర్వ మహిమాన్వితమగు యంత్ర మామీఁదనే అడఁగియుండును. 'టార్పెడో' యని దానిం బిలుతురు."

రమ్యనుల కుతూహలము మఱియు నధికతరమాయెను. ఐవనుఁడు సహజ మర్గర్వము మఱచి శ్రవణోత్సాహమున నచేతనుఁ డాయెను. సహాయసేనానికి అదంతయు నొక స్వప్నమువలె నుండెను.

"మూడవ గది యందలి పరికరములచే నౌకాగమనము మన యిచ్ఛకు వచ్చునట్లు మాఱఁగలదు. యంత్ర మయూరిత్రంబు లొకప్పుడు దీర్ఘమగును, ఒకప్పుడు హ్రస్వమగును: తత్సాహాయ్యమున జవముంగూడ శాసింప సాధ్యమగును. ఇఁక నయనములు గుఱించి చెప్పెద. గభీర పారావారమున నౌక ఎంతటి లోతున నడఁగి యున్నను, వలయు వెలుతురు రాఁగలదు.

ప్రధాన విషయ మిఁక గమనింతము. ద్వితీయ తృతీయ ఖండముల నడుమ నొక చిన్న అరయుండు. దావానలాభీలజ్వాలల దృటిలో వెలువరింపఁజాలు మందుసామానులందు నడంగియుండు. ఆర్యులారా! గమనించితిరా?"

రమ్యనులకు సర్వ మగమ్యముగ నుండెను. ఐవనుఁడు పటము నొకసారియు, ఖలీలుని వదన మొకసారియు విపరీత వ్యగ్రమనంబున వడివడిఁ దిలకింపఁ దొడంగెను. వాని హృదయము భయానుమాన

శ్రీ వేమన గ్రంథాలయము. తేలప్రోలు. (కృష్ణా జిల్లా.)

బాధితము గూడ నాయెను.

"నా పలుకులు గమనించియుంటిరి గదా! ఇట్టి జలాంతరగాములు కొన్నిఁటి సాహాయ్యముచే నొక మేటి నౌకాదళమును భస్మీభూత మొనరింప సాధ్యమగు——"

ఐనను,ఈ పట్టజాలక, దిగ్గునలేచి, ఉన్మాదునివోలె వీక్షించి, మగుడ నాసీనుఁడై, ఆ గాథకును, ఖలీలుఁడు వ్రేల్చిన గోళములకును గల సంబంధమేమని ప్రశ్నించెను. తురుష్కుఁడు సహజ నిశ్చలస్వర మున నిట్టులనెను.——

"తీవ్రపడకుము! నీవీయుద్ధనౌక శాసింపుచు దర్పముగ నిర్భయ ముగ నుంటివి. అస్మదనలగోళ నిర్గత భీషణఘోషణంబు లాలించి తురుష్క జలాంతరగామి యొండు అగోచరముగ రయంబున నరు దెంచి, ఈ నౌక కంటియున్నదని ఎఱుంగవు. తన్నాయకుఁడు నిర్దే శించు నిమిష మరుదెంచునంతనే, ఈ పెనునావ తుత్తునియ లగును. మొదటి గోళము మ్రోఁగినంతనే మా జలాంతరగామి నాకపాయము సంభవమాయెనని గ్రహించి తత్క్షణ మాయత్తమాయెను. రెండవ గోళ రవము వెలువడినంతనే పరిమార్పవలసిన శత్రునావ ఇయ్యదే అని యరసి, అరుదెంచి, భయంకరముగ నాశ్రయించియున్నది."

"హా!——దారుణము!——ఘోరము!——కాని, నీ ప్రాణము మాత్రము——"

"నిలుచునా? ఎట్లు నిలుచును —ఈ నావతోఁబాటు మీరును, మీతోడ నేనును ఈ గభీరజల గర్భస్థుల మగుదుము. విశ్వాసఘాతు కుఁడవై నన్నీక్షణము తెగటార్పఁ గడంగితివి గదా. నీవు న్యాయా న్యాయము లెఱుంగని కటికి కిరాతుఁడవని గ్రహించియే, ప్రాణముపై నాసవీడి, ఇట్టి భయానకాద్భుత కార్యమునకు దొరకొంటిని."

ఐవనుఁ డింకను సహింపఁగలఁడా? దుర్దాంత క్రోధోన్మత్తంబున

దిగ్గున లేచి, ఘోరతరవన్య సూకరంబువలె హుంకరించి, "అరే దురాత్మా! పాపీ!—" అని ప్రకంపిత స్వరంబున నఱచుచు, తటిల్లతా సన్నిభ కరవాలంబున నాసేనాని ఖాప్రీలుని ఖండింపఁబోయెను. సహాయసేనాని వానిని వారించి, తీవ్రస్వరంబున నిట్టులనెను—

"అయ్యా! మఱలుము! నీదురితంబు లింతకాలము సైరించియుంటిని. నీయవివేకము, ద్రోహాచరణము, ఉన్మాదప్రవర్తనము అంతకంతకు మితిమీఱినది. ఇటుపై నాయకుఁడ నేనని గ్రహించి, మదాజ్ఞానువర్తివై సంచరింపుము!"

తదవసర క్రోధావేశమున నైవనుని వదనము వెల్లవాఱెను. తదుత్తర నిమేషముననే వాని మేను భయాకులమై కంపించెను. సహాయ సేనానియగు నికోలసు తన పలుకులను ఋజువుచేయఁజాలు పత్రము ప్రదర్శింపుచు నిట్టులనెను.—

"రష్యను నౌకాదళము శాసించు మహానాయకునకు నీదుష్ప్రవర్తనము కరతలామలకము: ఉపేక్షింపరాని యవసరమగునపుడు నిన్నుఁ బోఁద్రోసి నేను నాయకత్వము వహింపవలయునని నాకీ యధికారపత్ర మొసంగెను. వీక్షింపుము! నీవిఁక బంధితుఁడవని ఎఱిఁగి, మాటాడక యున్నకుండుము!"

ఐవనున కాతెఱంగున గర్వభంగమాయెను. అతఁడు సైనిక జనోచితముగ నాజ్ఞాబద్ధుఁడాయెను. అనంతరము నికోలసు ఖాప్రీలుని గాంచి సగౌరవముగా నిట్లు ప్రశ్నించెను.—

"ఆర్యా! నీవు మాననీయుఁడవు, ఉదారచిత్తుఁడవు—నిక్క మెఱింగింపుము. మా నావ అపాయమునుండి తొలంగు నుపాయము గలదేని, చెప్పుము. మాకతంబున నీకును నీవారలకును గలిగిన యిక్కట్టుల కెట్టి పరిహారమైనఁ జేయఁజాలుదు—"

సమయ మింకను మించలేదనియు, రష్యను నావను రక్షింపను

ననియు తురుష్కు వీరుఁడభయ మొసంగెను. సేనాని కడుంగడు మున మందెను. అంత వారిరువురు నావలకుఁ బోయిరి.

ఖలీలునిఁ గాంచినంతనేఁ రష్యను భటులు తొంటి భయాగ్రహములచే నాతనిఁ జుట్టఁగడంగిరి. కాని, ఖలీలుని యభిమతమాలించి, సేనాని ఆజ్ఞాపించినంతనే, వారు దవ్వుదవ్వులకుఁ బోయిరి. తురుష్కుఁడు తోడనే మూఁడవగోళము రయంబునఁ దీసి, శ్రవణములు విశీర్ణమగునట్లు మ్రోగించి, ఇట్టులనెను.—

"ఇఁక నొక యరగంటవఱకు నపాయము వొరయనేరదు. ఈగోళ సాంకేతిక మట్టిది. నన్నిఁకఁ బోనిమ్ము. నాపలుకులు విశ్వసించి భయముడిగి యుండుము."

పరిహార మేమైన నొసరింతునని రష్యను సేనాని పలికెను. ఆతని సత్ప్రవర్తనమున కెంతయు సంతసించిన ఖలీలుఁడు తన కేమియు వలదని బదులాడ, సేనాని ఒక నౌక నాయత్తము చేయించెను. ఖలీలుఁ డందుఁ బ్రవేశించెను. ఆతని సగౌరవముగ సాగనంపుటకై సేనానియు నందుఁ బోయెను. నౌక యాన మొనరింపుచుండ, సేనాని సవినయముగ నిట్లు ప్రశ్నించెను.—

"అత్యద్భుతమగు నీజలాంతరగామిగాథ నిక్కమని విశ్వసింతును. నే నొక్క విషయ మెఱుంగవలయు. ఈవిషయము నిగూఢమగు నేని, అన్యులకుఁ దెలుపను; ఐనను నీఁగూడ నట్టులే ఆజ్ఞాపింతును; నీవు వ్రాసి మఱచిన పటము జించి పాఱవేయుదును. అటుగాక, నీవు సెలవిత్తు వేని, ఇట్టి యపూర్వసూరణయంత్రము తురుష్కప్రభుత్వాధీనమై యున్నదని మాయధికారుల కెఱింగింతును."

ఖలీలుఁడు రెండు నిముసములు చింతాపరుఁడైనటులు తోఁచి, ఇట్టులనెను.— "ఈవిషయము మీప్రభుత్వాధికారులకుఁ దెలుపవచ్చును ఇట్టి జలాంతరగాము లనేకములు కలవనియు జెప్పుము.

ఈ రహస్యము మీ ప్రభుత్వ మెఱుంగుట ప్రజాక్షేమకరంబని ఎంచి ఒడంబడితి; మఱియొకటి కాదు."

"ఆర్యా! నీ అభిప్రాయము గ్రహించితి: నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. కాని, నీ యసల గోళములు ప్రయోగినంతనే జలాంతరగామి ఆయత్తముగుట గమనింప, నీవు సాధారణాధికారివి కాఁజాలవని తోచెడి——"

ప్రసన్నాననుఁడగు ఖలీలుఁడు తోడనే గాంభీర్యము వహించి, పరిస్థితులఁబట్టి తన కట్టి యసాధారణాధికార మలవడెనని పలికెను. సేనాని యిఁక ప్రశ్నింపఁజాలకపోయెను.

సమీపించుచుండిన ఖలీలునిఁ గాంచినంతనే, పాషా మొదలగు వారలు విస్మయానందపరవశులైరి. తమ మిత్రుఁడు అసలగోళముల నేల ప్రయోగించెనో, దాన నెట్టి ప్రయోజన మాయెనో వారల కేమియు గ్రాహ్యము గాకుండెను. వారి చిత్తము పరిపరివిధముల పరిభ్రమింపఁ దొడంగెను.

నౌక అంతలో దురుష్క పాత్రము డాసెను. రమ్యను సేనాని సవినయముగ నిట్టు లనెను.——

"మా కశమునఁ గ్రాపించినఁ దుకితముల కెంతయుఁ బరితపించితి నని పాషాకును సనితాజనములకును మనవి చేయుము."

"అట్టులే సేయుదు: ఇఁక సెలవిమ్ము." ఖలీలుఁ డట్లు పలికి, ఆతని కరస్పర్శ మొనరించి, రయమునఁ దన నౌక లోనికి లంఘించెను. సేనాని మగుడ నిట్లు ప్రశ్నించెను.

"ఆర్యా! అన్యథా తలంపకుము——మా నావకిఁక భయము లేదు గదా?"

"ఏమియు భయములేదు." అని బదులాడి ఖలీలుఁడు మఱియొక గోళము ప్రయోగించెను.

# ౨౯

## వజీరు పదవి

ఖలీలుని మిత్రులాతని కమితహృదయపూర్వకముగా స్వాగత మొసంగిరి. ఇస్మిల్లా నయనపథంబునఁ బడకుండ ఆతఁడు మధుర వీక్షణ మొండు నిజప్రియాంగన జులేఖాపైఁ బఱపెను. నౌక రయంబునఁ గదలెను.

ఖలీలుఁడు సహజముగ మిత్రప్రశ్న పరంపరకు గుఱి ఆయెను. వారి కుతూహల మడంగునట్లు లాతఁ డీ తెఱంగునఁ బలికెను.—

మిత్రులారా! నా గాథ కడు దీర్ఘము. ఐనను సంగ్రహముగఁ దెల్పెదను. అనుభవ రహితుఁడగు నొక ఫ్రెంచి శాస్త్రజ్ఞుఁ డిటీవల మన ప్రభుత్వాధికారుల చెంత కరుదెంచి, నౌకాదళము నొక్క త్రుటిలో భస్మీభూత మొనరింపఁజాలు సాధనముం దాను కనుఁగొంటినని తెలిపెను. వాని మాట బాటించి అట్టి యంత్రనిర్మాణము సాధ్యమగునేమో యని మన వారలు ప్రయత్నించిరి. కాని, తత్ప్రయత్నము విఫలమాయెను. వాని సిద్ధాంత మాచరణయోగ్యము కాకున్నను, వినుట కెంతయు సమంజసముగ నుండును. తద్విషయము పరిచయము ప్రకృతము నా కెంతయు లాభకరమాయెను. మఱియొకటి,—రసాయన శాస్త్రము నాకుఁ బ్రీతికరము—భూరిధ్వాన మొనరించు ననలగోళము లప్పుడపుడు తయారు చేయువాఁడను. అట్టి గోళము లీ సమయమున నా చెంత నుండెను. వానిని ప్రయోగించి నాకిఁక భయము లేదనియు, రష్యను నావను తుత్తునియ లొనరింపఁజాలు జంత్రపు నౌక అరుదెంచెననియు దిన్నాయకులకుఁ దెల్పితిని. దాన రెండు లాభములు చేకూరెను—"

"అపాయము నుండి నీవు వెలువడుట ఒకటి గదా. రెండవది?"

అట్లు పాషా ప్రశ్నింప, ఖలీలుఁ డిట్టు లనెను.—

"పాషా! గమనింపుము. రష్యాదేశముతో సంధి పొసగుట మన దేశమునకు క్షేమకరము. అట్టి ప్రయత్నములు జరుగుచున్నవి. అందులకు సముచితదోహద మాచరించువాఁడు రాజభక్తుఁడు దేశభక్తుఁడు నిక్కముగ ధన్యుఁడును గదా. నా కట్టి భాగ్య మబ్బెను. అమోఘమారణయంత్రము తురుష్కప్రభుత్వాధీనమై యున్నదని ఈ రష్యను సేనాని వాని యధికారులకు నివేదించును. నాగాథయంతయు నతిశయోక్తిమయము. మదీయగంభీరవదనమును గంభీరతరస్వరమును గాంచిన రష్యను సేనాని చకితుఁడై నాపలుకుల పూర్తిగ విశ్వసించెను. ఇఁక సంధి తప్పక సిద్ధించును."

ఖలీలుని ప్రవర్తన మీ వఱకే అత్యద్భుతముగ నుండెను. ఆ వీరుని నిరుపమానగాంభీర్యధైర్యస్థైర్యగుణంబులు నిక్కముగ గణనీయములు గదా. ఎంతటి మహాపదం దగుల్కొనినను వెఱగందక, తదనుకూలోపాయంబున బరిత్యక్తుఁడు కాఁజాలు ఖలీలుఁడు సహజముగ మిత్రుల విశేష విస్మయానందాభినందనములకుఁ బాత్రుఁడాయెను. మానవాతీతాధికారధురంధరుండని భ్రమింపఁజేయు నా యువకుని అపూర్వాంగుళీయ మొకసారియు ఆతని సుప్రసన్నగంభీరానన మొకసారియు గౌరవవిస్మయమయ వీక్షణంబుల దర్తబను పాషా తిలకించెను. గ్రీకులు విస్మయానందపరవశులైరి. ప్రభుపత్ని పరవశతాత్మయై మోహాంపు దీక్షణ వీక్షణంబులు గుటిలముగ సుందరతురుష్కయువకునిపైఁ బఱపెను. తైరజా గుల్నేరుల కాతఁ డపూర్వముగఁ గాన్పించెను: వారి హృదయములు నిశ్చలముగఁ బరాధీనము లాయెఁ గాని, ఆ యపూర్వయువకుఁడు మనోహరంబుగ గూడఁ దోఁచి యుం

ము. సుశీలయగు జులేఖాకుఁ దన మనోహరుని చూచుకొలంది మఱియు మఱియుఁ బ్రేమపాత్రుఁ డగుచుండెను.

పాషా యూరాము మందిరము సమీపమున నుండెను. ఐనను ఆ మహనీయుఁడు ఖాలీలాదియువకులు తన మందిరమున విడసియున్న సహాచార మన్యులకుఁ దెలియరాదను రహస్యము మఱచి నిశ్చలముగ నుండెను. కాన, ఖాలీలుఁ డావిషయము స్మరణకుఁ దెచ్చెను. పాషా సంతసించి, నావను దోడనే తీరమునకుఁ జేర్పించి, తడిసిన పుట్టంబులు వర్జించి శుద్ధాంబరంబులు దాల్పవలయుగాన సత్వరము రావలయునని తురుష్కయువకుని హెచ్చరించి, గ్రీకులనుగూడ నాహ్వానించి, మహమ్మదీయ ప్రభువువారలను దింపివైచెను. నౌక మగుడ యానమొనరింపఁ దొడంగెను.

నాలుగడుగులు వైచినంతనే తన మిత్రులను గాంచి ఖలీలుఁ డిట్లనెను—

"తొంటియట్లు నేనుమగుడ రెండునిముసములుమిమ్ము వీడవలయు. అన్యథా తలంపక, సెలవొసంగుఁడు. మీరా వనమున నుండుఁడు— ముహ్వారముగలసి పాషా మందిరము బ్రవేశింతము"

గ్రీకుయువకులు సమ్మతించిరి. ఖలీలుఁడు తోడనే దట్టంపువనము లోనికిఁ బోయెను. స్వామి భక్తిపరాయణుఁడగు సదగుడంను(బ్రత్యు)డుమారొనెను—"సదకా! నేఁబంచిన మందులు గొనివచ్చితివా?"

సేవకుఁడు సవినయముగా నొక పొట్లము నాతనికొసంగెను. ఖలీలుఁడు మగుడనిట్లు ప్రశ్నించెను—"సిద్ధిమున్సూని గుఱించి ఏమైనఁ దెలిసెనా!

"దేవా! ఏమియుఁ దెలియలేదు."

"ఏమీ! వాఁడీ ప్రాంతముననే గ్రుమ్మరుచున్నాఁడు! వాని నా దిక్కునఁ గాంచియుంటిని—కాంచినంతనే వెన్నంటితిని—ఐన నాడు

రాత్ముఁడు తప్పించుకొని మాయమాయెను. వాఁడంతమాత్రమున సంతసింపక, దత్తబను పాషా బందుగురాలి యెడ నపచార మాచరించెను—"

"దేవా! వాఁడికఁ దప్పక పట్టుపడును."

"మస్రూ చిక్కినగాని నా ప్రయత్నమంతయు వ్యర్థమగును. చేఁజిక్కిన చెనటిని నీవె పోనిచ్చితివిగాన, ఎట్టులైన నీవ మగుడ వానింబట్టి అపరాధము బరిహరించుకొనవలయు. ఆ వంకనుండు వనంబులన్నియుఁ గలయఁ జూడుము—కృతకృత్యుఁడవగు వఱకు విశ్రమింపరాదు. నీవు తత్క్షణము రాజధానిఁజేరి సమర్థభట సాహాయ్యము గైకొనుము. మఱియొకటి—విదేశకార్యములు జూచు మంత్రి పుంగవుని సందర్శించి, రష్యాదేశమే సంధికై యాతురపడు నవకాశము సంభవమాయెననియు, ఆకారణమున మనము తీవ్రపడరాదనియు నేర్పుమెయి గొంత కాలహరణ మొనరింప వలయుననియు జెప్పుము. ఇఁక బొమ్ము! సిద్దీని బట్టి బంధించి విశేషబహుమానము వడయుము. పొమ్ము!"

సదకుఁడు సవినయముగ సెలవుగైకొని వెడలెను. ఖలీలుఁడు తన మిత్రులను గలసికొని పాషా మందరము బ్రవేశించెను. వారు ముప్పురు దమతమ గదులు జొచ్చిరి. ఖలీలుని మందిరమున నగణిత రుచిరాంబరములు సిద్ధముగ నుండెను.

ఆర్ద్రవస్త్ర విసర్జనమైనంతనే ఖలీలుఁడు సదకుఁ డొసంగిన పొట్లము పరిశీలింపఁ బోయెను. అందనుక నంకణగి మణఁగియుండిన చిన్నచీటి యొకటి ఆసనముమున వెలువడెను. చక్కగ సరళముగనుండిన అయ్యక్కరములు గాంచినంతనే ఆకమ్మ కాంతాలిఖితమని తెల్లమాయెను. ఖలీలుఁ డద్దానిఁ దత్క్షణము గుర్తించి దురంత విస్మయాకుల చిత్తుఁ డాయెను—"ఆహా దీని భావమేమి కావలయు!"

తత్తరపాటున నాలేఖంజదివినంతనే, తురుష్కుని విస్మయ మంతరించెను. ఆతని చిత్తము దైన్యమునకు ఆగ్రహమునకును అగ్గమాయెను—"ఏమీవైపరీత్యము! ఇంతటి ఘోరము సంభవమగునా?"

చిత్తము దావానలసన్నిభముగఁ గ్రాగుటచే నా యువకుఁడు దిగ్గునలేచి తదాలోచనాపరుఁడై ఇట్టట్టు తిరుగాడఁ దొడంగెను. అట్టి ముహూర్తమున దత్తబసుపాషా మూర్తి గోచరించెను. ఖలీలుఁడు తోడనే నిలిచిపోయి, కమ్మను రయమునదాచివైచి, చెదరిన వదనము జేరదీసి, సహజనిశ్చలప్రసన్న వీక్షణంబుల నామహమ్మదీయప్రభునకు స్వాగతమొసంగెను.

పాషావదన మపూర్వవికాసవంతమై యుండెను. చిరునగవుగూడఁ దూగాడుచుండెను. ఖలీలుని జూసినంతనే ఆతఁ డిట్టులనెను: "ప్రియ మిత్రమా:—నిన్నిట్టు సంభోగించు నధికార మొసంగితివిగదా—నే నట్టులే పరిగణించితి—"

"ఆర్యా! నాబోటి సామాన్యమానవుఁడట్టి గౌరవమునకుఁ బాత్రుఁ డగుట—మేటి ప్రభు బిరుదాంకితమహాపురుషుఁడవు—"

"ప్రభుబిరుద మేమి!— అంతకంటెను మేటి గౌరవమునకుఁ బాత్రుఁడనైతి—ప్రసిద్ధులగు పాదుషావారు అల్లావారి ప్రతినిధులగు పాదుషావారు దయామయులై అన్యజనాసాధ్యముగు నొక మంత్రి పదవి నాకు దయచేసి నన్నెంతయు గౌరవించిరి—"

"తదధికారముతోఁబాటు రాజబిరుదముగూడ సంక్రమించును. మా రాజును తొలుదొల్త నభినందించు భాగ్యము నాకబ్బెను!"

"మిత్రమా! ఈరాజబిరుదమువలసి గర్వించితినని భ్రమింపకుము. ప్రభుబిరుదము నాకుజాలు. ఐనను, అఖండభూమండలాధీశులగు పాదుషావారు కరుణించునపుడు, తత్సన్మానములు దుర్భరంబైనను, భరింపవలయునుగదా."

పాషా యట్లు వాకొనుచుండ, ఖలీలుని వదనము విచారాక్రాంత మాయెను. ఆనందోత్సాహతరంగముల నుయ్యేలలూగు ప్రభుశేఖరుండావిషయము గమనింపఁడాయెను. తాను గర్వమెఱుంగనని ఆతఁడతివినయము నభినయించినను, హృదయము నిక్కముగ గర్వోత్సాహపూరితమై యుండెను. ఖలీలుఁ డంతలో గంభీరాననుఁడై యిట్టులనెను—

"రాజా! మంత్రిపదవి యొక్కటియేగాక, ఇతర సన్మానములు గూడ గ్రహించియుందువు?"

"కాంచియుంటిని—కాని, ఆర్యా!—మనము కొంతతడవు ధారాళముగ సంభాషించుట వాంఛనీయము—అట్టిసమయ మరుదెంచెను—నీవిఁక మర్మమువీడి—"

"రాజా! నీ పలుకులు కేవలము దుర్గ్రాహ్యములు—నీ యభిప్రాయమేమి?" అట్లు పలుకు ఖలీలుని వదనము తదవసరోచిత విస్మయ సంభ్రమంబులకు నిలయమై యుండెను. అట్టి భావములు కేవలము కృత్రిమములే యైనను, పాషా యనుమానించుటకు వీలులేకుండెను. ఆ కారణమున నాతఁడు మ్రాన్పడి, శూన్యమనస్కుఁడై, శూన్యవదనుఁడై తడబడుచు నిట్టులనెను.—

"మిత్రమా! నా యనుమానము కడు సమంజసమని నీ వంగీకరింపవలయు—నా యభిప్రాయ మేమన, అట్టి యనుమానము సహజము, సహేతుకమని—పరిస్థితులట్లు—"

"రాజా! ఏమిది? పాదుషావారి ఆలోచన భవనమున నిట్టులే ఉపన్యసింపఁ గడంగుదేని తక్కుంగల మంత్రు లెంతటి సహనశీలురైనను, విసువుజెందక మానరు."

"నిక్కము—నే నిపుడు స్పష్టముగ మాటాడనైతి—ఒక విషయము ప్రసంగింపఁబోతిని—కాని, ఈ యపూర్వాంగుళీయము—"

అంతలో ఖలీలుని ముద్రిక దృగ్గోచరమైనంతనే ఆతఁడద్దాని సగౌరవముగ సకౌతుకముగఁ దాఁకి తురుష్క యువకుని భావగర్భితముగఁ దిలకించి మగుడ నిట్టులనెను.—"ఈ యుంగరము—నీ వింత ప్రవర్తనము—నీ యసాధారణ ప్రభావము—సర్వజనభయంకరులగు జనీజరీల విప్లవ మడంచుట—ధూర్తులగు రష్యనులను నిరోధించుటయు ఇట్టి మహావిషయములం దలంచినంతనే నా చిత్తము—"

"రాజా! ఈ యంగుళీయ వృత్తాంతము సంగూఢమని ప్రప్రథమమునసే చెప్పితిగదా. జనీజరీనాయకుఁడగు ఆగాను నెట్లు వశపఱచుకొంటినో గూడ నివేదించి యుంటిని. ఇఁక రష్యను కథాకలాపము గూడ వెల్లడించియే యుంటిని. స్వవిషయ మందువా!—అదియు నెఱుకపఱచి యుంటిని—సద్వంశజుఁడను, ధనవంతుఁడను—సుందరాంగియగు జులేఖా పాణిగ్రహించుటకుఁ దగిన వాఁడనని వివాహ సమయమున నీవే గ్రహింపఁగలవు."

"ఆహా! ఆ కన్నియ నా కన్నియ యగునేని, తత్క్షణము నీకొసంగి యుండనా? కాని, మిత్రమా! ఆమె జనకుఁడు, కదీస్ఖానుఁడు మహాపద వాఁతఁ బడియుంట మఱచితివా?

"హా! మఱవలేదు. కదీస్ఖానుఁడు క్షేమముగ నుండుగాక."

"కాని, కాల మతిక్రమించుచున్నది—గడువు సన్నిహితమగుచున్నది. జులేఖా హృదయ మెట్లులుండును?"

"ఆర్యా! మన మీ విషయ మింక బ్రసంగింపవలదు. దయామయుఁడగు అల్లా మనకుఁ దోడ్పడునని విశ్వాసబద్ధులమై యుందము. మఱియు, నీవీ సాయంసమయము సుఖముగ వెడలబుచ్చ నపేక్షింతువు గదా."

"ఔనౌను—విందు సేయఁ దలపెట్టితి. నాకు వజీరు పదవి లభ్యమగుటయే గాక—"

"ఇతరసన్మానములు గూడ వహించితినంటివి?"

"ఔను. ప్రశంసనీయుఁడవు నీవంటి మిత్రునియందు నాకు రహస్యము లుండవు. కాని, నే నిప్పు డిపుడె చెప్పఁగడంగితిఁగదా— నీ చర్యలు రహస్యభూయిష్ఠములు—"

"ఆర్యా!. నా వృత్తాంత మెఱింగించికొంటిఁగదా. మదీయ నామధేయము ఖలీలు—వంశనామము ఉస్మాను—"

"అగుగాక—నే నన్యథా భావించితి—చిత్త మనుమానమున కధీనమాయెను—కానిమ్ము. నీ చరిత్ర మింకొకవిధంబగునేని, ఇఁక మఱుఁగుపడఁజాలదు—అట్టి యవసర ముండనేరదు. ప్రకృతము గమనింపుము—నీ మందిరము ప్రవేశించుటకు మూఁడు నాలుగు కారణములు గలవు. నౌక దిగినంతనే రాజదూత యెదురై నాకు వజీరుపదవి లభించె ననుశుభవార్త తెలియఁబఱచెను—అయ్యది నీ కెఱింగించుట యొకటి: విందునకు నిన్నాహ్వానించుట రెండవది— విందునకుఁ గారణము మంత్రిపదగ్రహణమే గాదు—మఱి—మఱి—"

"మఱి యితరగౌరవములుగూడ లభ్యమాయెఁగదా!"

"ఔను. కాని, నిన్నుఁ గాంచుటకు మఱియొక కారణము గలదు. అసాధారణరాజసన్మానమునకుఁ బాత్రుఁడగువాని కొకింత వివేక ముండుఁగదా. ఐనను, ఒకానొక ప్రధానవిషయముగుఱించి నీతో నాలోచింపవలయు—నీ హిత మావశ్యకము—తీవ్రపడుచుంటిఁ గాఁబోలు. మదీయాగమనమునకు మఱియొక్క హేతువుగలదు. ముందయ్యది వివరింపవలయు."

"ఆర్యా! వివరింపుము."

"మిత్రమా! నేను సైన్యసమేతుఁడనై యరుదెంచుచుండినవార్త నాలించినంతనే జనీజరీలు భయవిహ్వలులై లోఁబడుటచే బాదుషా వారు నాకు వజీరుబిరుదము దయచేసిరి. నీ వొనరించిన సాహాయ్యము

మఱవలేదుసుమా! ఐనను, నీ వతివినయమున మఱుఁగున నుండిన కారణమున, నఖిలసన్మానములను నేనె గ్రహింపవలసినవాఁడ నైతిని."

"ఆ సన్మానములు నిన్ను సముచితముగ నాశ్రయించియున్నవి."

"మఱియు, నేఁటి రహస్యానువ్యవహారమునందు గడుప్రశంసనీయముగ మెలంగితివిగదా. నీదు వివేకము ధైర్యస్థైర్యములు, కార్యదీక్ష, కార్యదక్షత, స్వార్థత్యాగము, ఔదార్యమును గేవలము నిరుపమానములుగదా. మిత్రమా! మదీయకృతజ్ఞతను, గౌరవమును, అభిమానమును ఎట్లు వెల్లడింపఁగలనో నీవే యెఱింగింపవలయు. నేఁ జేయఁగల ప్రత్యుపకార మెద్ది?"

"నాకై ఎన్నఁడు నర్థించువాఁడఁగాను; ఐనను, అర్థింపకుండ లబ్ధమగునపుడు, నిరాకరించువాఁడనుగూడఁగాను. ఏమన, నాకట్టి యవసరము లేకున్నను, మఱియొకరికి అక్కఱకునచ్చుగదా."

"మిత్రమా! నీ యభిప్రాయ మేమి?"

"రాజా! గమనింపుము. నా కొక వరము బ్రసాదింతువు— నీ యభిప్రాయ మయ్యదె గదా?"

"ఔను."

"వరము దప్పక పరిగ్రహింతును. నాకొఱకుమాత్రము గాదు. దాన, గేవల మొక యపరిచితుఁడు సుఖంబందినను, ఆ లాభము నాకుఁ గలిగినట్టులే సంతసింతును."

ఖలీలుని పలుకులు పాషాకు దుర్గ్రాహ్యము లాయెను. దిగ్భ్రమచేతస్కుఁడై, ఆతని మనోరథ మేమియో తెలుపవలయునని మహమ్మదీయప్రభువు కోరెను. ఖలీలుఁ డాలోచనాపరుఁడై యిట్టులనెను.

"నే నేమి కోరవలయునో నాకే తెలియకున్నది— ఇంకను ఆలో

చింపలేను. ఒక నిముసము విచారించెద—ఏమి కోరవలయును—నాకేమి కావలయు?—"

"సువర్ణము గావలయునా?"

"వలదు."

"వెడలిన చూపులకు దేజరిల్లుచున్న నాపుత్రికలను గ్రీకుల కొసంగ వలయునా?"

"వలదు. యుక్తాయుక్తము లరసి మెలంగవలసిన యవసరమున నీచే నట్టి యకార్యము జేయింపఁజాలను."

"తాను తత్క్షణము సమ్మతింపవలయునని జులేఖాజనకుని పేర వ్రాయుదునా?"

"వలదు. ఏమన, స్వాతిశయమైన నగుగాక—నాదు గుణము బురస్కరించుకొనియే ఆకన్యారత్నము నుు వడయఁజాలుదునని విశ్వసించువాఁడ."

"అల్లా! నాకుఁ గల యోచనా సామర్థ్యమంతరించినది—మఱి యొక ఊహ పొడముచున్నది. ఏమైనను, మదీయానందమయ కృతజ్ఞత వెలిబుచ్చవలయు—కాన నీవరంబెద్దియో తప్పక వినవలయు."

"అట్టులే యగుగాక-ఇట్టి సమయమున నాచిత్తమున నేతలం పుదయించునో అయ్యదె కోరువాఁడ. పాపా! పురుషులకంటె స్త్రీ లధికముగ దురాచారములకుఁ బాల్పడెదరు. కావున, నేఁగోరున దేమన,—నీయింటి కాంతలు తప్ప—నీదు దారాపుత్రాదులే గాక మేనకోడలు గూడ దప్ప—మఱియొక కాంత—ఎక్కువ తక్కువలు పాటింపరాదు. కోరు మొదటి వరము బ్రసాదింతునని అల్లావారి తోడుగా బ్రమాణముచేయుము. చాలు."

"మిత్రమా! నీకోరిక కడు చిత్రము: ఐనను, నీచర్యల నరయు చుంటి. గాన, నక్కజపడరాదు. అట్లులే తప్పక ప్రమాణము

చేయుదు — ఏమని? హాయింటి కాంతలు తక్క మఱియొక వనిత, ఎక్కువ తక్కువలు పాటింపక, కోరు మొకటి వరము నల్లావారి సాక్షిగా నొసంగుదును!"—

ఖలీలుఁడు సంతసించి సమయభంగ మొనరింపరాదని హెచ్చరించెను. దర్బనున పాషా సహజావేశమున బునఃపునః ప్రమాణము లాచరించి యిట్టులనెను.—

"మిత్రమా! మదీయాంగనాజనంబులకు నీదు వరమన్వయింప కుండుట మేలౌను. ఒకానొక విషయమున నాయర్ధాంగి ఇస్మిల్లా ఒక వాంఛ బురస్కరించుకొని నన్ను బాధింపఁగలదు—ఆవిషయముననే నీహితము ముఖ్యముగఁ గావలయును."

"పాషా! వయోవృద్ధుఁడవు నాకంటె ననుభజ్ఞుఁడవు—నీకు హితము సేయఁజాలనని వెఱచువాఁడ. ఐనను, సెలవిమ్ము."

"అట్లు లాడకుము. నీబుద్ధి వైభవమపూర్వము, అమోఘము. మిత్రమా! గమనింపుము. నేఁ గాంచిన సన్మానము కేవలము వజీరు పదవియే కాదు. లోకపాలకులగు పాదుషావారు అపూర్వ సౌందర్యవతి గళాధురీణయునగు దమ యనుంగు బుత్రికారత్నము ఫతేమానను వివాహమాడవలయునని గూడ వర్తమానమంపిరి!"

"పాషా! కానిమ్ము ఇందు నాయాలోచన కేటి యవసరమో తెలియకున్నది."

అట్లు పలుకు ఖలీలుని వంక నపరిశీలనముగా పాషా తిలకించెను. కాని, అతని వదనమున నేభావమైనను ద్యోతకముగాక కడు నిశ్చలముగనుండెను. పాషా వృత్తాంత మాలించినంతనే ఆవీరుఁడభినందన పూర్వకముగా శిరము వాల్చెను. పాషా మగుడ నిట్లు పలుకఁదొడంగెను.—

"పాదుషావారి పుత్రికారత్నము నెన్నఁడు గాంచి యెఱుంగను.

ఐననేమి—ఆకన్య అపూర్వ మనోహరాంగియు ప్రతిభాశాలినియు గావలయు ప్రాయమిరువది మూడేండ్లు. మిత్రమా! నేను నిక్కముగ ధన్యుఁడ గదా—రాజ్యోగికి—అందు భార్యా సమేతుఁడై యుండువానికి పాదుషావారు స్వీయపుత్రికను, స్వీయసోదరినైనను ఒసంగజూచుట అసాధారణము. నేనట్టి యపూర్వ సన్మానమునకుఁ బాత్రుఁడనైతి. మిత్రమా! వివాహానంతరము ఫతేమా రాజపుత్రి మదీయగృహంబునకెల్ల రాణియగు. నాభృత్యులు, నాయింటనుండు నంతఃకాంతలు నాకు బిడ్డలు, మదీయప్రియపత్ని ఇస్మిల్లాయును షాజాదీకి లోఁబడి మనవలయు. ఇట్టి యాచరణము సాంప్రదాయసిద్ధము. కాని, ఇస్మిల్లా ఎట్లు సహింపఁగలదు? నే నీసమాచారమెఱింగించు నంతనే ఆ హేమగాత్రి దురంత క్రోధఘూర్ణమాన మానసయగును. మిత్రమా! నాయింట నామాటయే శాసనమగుట నిక్కము. దారాపుత్రులైనను కాదని ఎదురాడ సాహసింపనేరరు. కాని,—కాని, మదీయహృదయాపహరణ క్రియాదక్షయై, అమితానందప్రదాయినియై విరాజిల్లు సుందర తరళ నయన అవిరళ బాష్పవారి మున్నీరై స్రవింప, మంజులకలస్వనంబున విలపించినచో, దుస్సహము గదా."

"కాని, నే నేటి సాహాయ్య మొనరింపఁగలను?"

"నాకును దెలియకున్నది. కాని, కాని—నామానసమునం దోఁచునదేమన—ఈసమాచారము ఇస్మిల్లాకు నీవే ఎఱింగించిన—"

"పాపా! నేనా!—"

"నీవేల ఎఱింగింపరాదు? అస్మదీయ భగినీ పుత్రికాహస్తగ్రహణ మొనరింప నుంటివి గదా!—అన్యుఁడవుగావు—నీవు వలచినటులే నీవిషయము నాభార్య కెఱింగింపలేదు సుమా. మాయింటలయందు నీకుఁ గలనేస్తు నిరుపమానము. కావున నీవు పరిస్థితులు వ్యక్తీకరించి, నాదు

లాట అసంబద్ధము,అవివేకము,నిరర్థకము.—కానఁదాస కారణముగ కంటకము పడక, నాయానందమున కంతరాయము గల్గింపక, సముచితముగ సరసముగ మెలంగవలయునని హెచ్చరింపుము."

"రాజా! నీవింతగఁ జెప్పినపుడుఁ గాదనఁజాలను. మఱియు నేనర్థించిన వరము తప్పక ప్రసాదింతునని—"

"మిత్రమా! ఆడితప్పువాఁడగాను."

"నేనిదె నీ యాదేశ మాచరింతు. ఇస్మిల్లాదేవి సముఖమునకు సత్వరము బోవువాఁడ. అమీనాను రావింపుము—ఆ దాసి నాకు త్రోవ చూపును. మఱియొకటి—ఆ సాధ్వీమతల్లి శీలమునకుఁ గళంకము వారయరాదు—కావున, నేను ప్రసంగించునంతకాలము అమీనా ద్వారమున నిలిచియుండవలయు."

"అట్టులే యగుఁగాక. నీ వొనరింపనున్న మహోపకారమునకు ముందుగ వందనము లాచరింపనిమ్ము. మిత్రమా! పోదము, లెమ్ము."

పాషా ఖలీలుఁడు లేచి అవ్వల కేగినంతనే పరిచారిక గోచరించెను. పాషా ఇట్టులనెను—

"అమీనా! నీ దేవిమందిరమున నీ మహనీయుని ప్రవేశపెట్టుము. ఒకానొక ముఖ్యవిషయ మీతఁడు నివేదించును. నీవు ద్వారమున నిలిచియుండుము. దేవి గుణము నే నెఱుంగనిదికాదు. అట్టి పతిభక్తి పరాయణ, అట్టిసాధ్వి, అట్టి శీలవతి ఎందును గానరాదు—వనితా జనంబునకుఁ దలమానికమని చెప్పిన నతిశయోక్తి కాదు. ఈ వీఁడన్ననో—ఆదర్శపురుషుఁడు. ఐనను అంతఃపుర పవిత్రతకుఁ గళంక మాపాదించు నపవాదులకుఁ దావీయరాదు."

దత్తబను పాషా తోడనే వెనుదిరిగి, విందున కాహ్వానించుటకై గ్రీసుల మందిరములవంకఁ బోయెను. అమీనాఖాలీలులు ఇస్మిల్లా ఆగారము జేరఁబోయిరి. తన యేలికసానితో ఖాలీలుఁడు మాటాడ

వలసిన యవసరమెద్దియో దాసికి స్ఫురింపకుండెను. కాదు, కాదు ప్రభుపత్నితో ముచ్చటించు నవకాశ మలవడుటకునై ఈతుకుష్క యువకు డేదియో మాయోపాయము పన్నియుండునని ఆమె యనుమానించెను. కాని, దాసి ఖలీలుని ప్రశ్నింపలేదు, ఆతఁ డేమియు మాటాడలేదు.

ప్రభుపత్ని మందిరశ్రేణి డాసినంతనే, ఖలీలునందుఁ జొరబెట్టి, అమీనా ద్వారమున నిలిచిపోయెను. ప్రభురాణి ఎటులుండెను? నౌకావిహారానంతర మాకోమలాంగి వసనంబులు మార్చి, మేల్దుకూలములుదాల్చి, నిజమందిరాభ్యంతర రమణీయ మృదులతల్పమున సముజ్జ్వలరూప వైభవంబున విరాజిల్లుచు, గడునొయ్యారముగ వ్రాలియుండెను. ఖలీలుని హృదయము నిశ్చలముగనుండెగాని, లేదేని, ఆనవమోహనాంగి యపూర్వవిలాసము గాంచి తప్పక భ్రమించియుండెడివాఁడు. హృదయాపహారణ మొనరించి ఇంకను దవ్వు దవ్వులనుండి ఖలీలుఁ డాకస్మికముగ గోచరించినంతనే, ఆసుదవతి సుందరాధరమునుండి విస్మయానందార్ధకము వెలువడెను. అంతలో నమీనా అసహ్యకరముగ గోచరించుటచే, నాకాంత నిజహస్తచాలనమున నవ్వలకు బొమ్మని ఆజ్ఞాపించెను. తత్‌క్షణము ఖలీలుఁ డిట్లు వారించెను.—

“వలదు! పాషా యనుజ్ఞ అగుటచే నేను రాఁజాలితి—అమీనా గూడ నిందుండవలయుననియే ఆజ్ఞ—ఆద్వారమున మాత్రము వేచియుండును. పాషా ఏక్షణముననైన రాఁగలఁడు.”

ఇస్మిల్లా సుందర మధురాధరములు దుస్సహాంబగు విసువుచేఁ జిన్నవోయెను. కట్టెదుటనున్న మోహనాంగునిపైఁ బ్రశ్నపూర్వక విలోకనంబు జయ్యనబఱపి, అంతలోఁ దెలివొంది, మందహాస మొనరించి, ఇట్లు గుసగుసలాడెను.—“మోహనుఁడా! ఇయ్యది నీ పన్ను

గడ కావలయు—కాదా?—ప్రత్యేక కార్యార్థ మరుదెంచితివి!"

ఖలీలుడు గూడ దత్సమయోచిత హాసస్వరంబుననే యిట్లు బదులాడెను.—"విషౌషధము సిద్ధము. తత్సంబంధ వస్తుసంగ్రహణ మొనరించి, శుద్ధపఱచి, సర్వము సిద్ధమొనరించి భవదీయ దర్శనం బెట్లుగలుగునో యని విచారించుచుండ, పాషాయే యరుదెంచి నాపై నొక కార్యభారమునైచి—"

"కార్యభారమా! పాషా—నిన్న—నా చెంతకు—సంఘటయా?"—ఇస్మిల్లా సహజముగ సహాస సంభ్రమాకుల విలాసన ఆయెను. తదుత్తరక్షణముననే ఆశ్చర్యపాటంతరింప, నాకాంత సుందరవదనము నిరవధిక మధురమందహాసభాసురమాయెను.—తెలిసె! తెలిసె! నన్నుఁ గాంచు నిమిత్త మీ తంత్రము పన్నితివి—"

"ప్రియా! నేఁ జెప్పునది సత్యము. దల్లబను పాషా వజీరు బిరుదము గాంచెనని వినియుందువు గదా?"

"వినియుంటి—చారుఁ డిప్పుడే యరుదెంచెను—ఈవార్త మందిరమునం దంతటను వ్యాపించెను. పాషా అమితోత్సాహపరుఁడై గొప్ప విందుసేయ సమకట్టి రాజధానికిం దన భటులనంపెను."

"నా మిత్రులు నేనును గూడ నాహ్వానింపఁబడితిమి. నీ వొక విషయ మెఱుంగవలయు—దల్లబనుపాషా మేటి నూతనాధికార ధారేయుఁడగుటయేగాక—"

"మఱియేమి? ఇట్టి దీర్ఘోపోద్ఘాతము శుభసూచకముగాదు"—ఆమె స్వరము మఱియు మందమాయెను—ఏమైనను, నాకేమి? నీకేమి?—మన మిరువురము దలంచునపుడు సౌఖ్యార్ణవనిమగ్నులమై యుండఁజాలు దివ్యౌషధము కలదుగదా! ఇఁక నీదుసందేశము వినిపింపుము."

"నీ పలుకు లాలించినపిమ్మట నేను ప్రారంభించుట యనవసరము.

ము సత్వరము నివేదించువాఁడ. పాదుషావారు తమ
సు పాషాకు భార్యగా నొసంగువారు."

...కులుబోలు నా పలుకులు వీనుల దాఁకినంతనే ఆ జాఁరిణి
...వదనము భయానకమాయెను. అది యొకక్షణికము. ముఖ
మండల మంతలో సందాగర్భిత మందహాస నిలయ మాయెను.
త దేహ్యాభావము గూడ తక్షణమంతరింప, వదనము భాసురమై
మధురమోహాంచితమై దర్శనీయమై యొప్పారెను—"సుందరాంగా!
మన కీ విచార మేల? మనము తలపెట్టిన కార్య మెంత శీఘ్రముగ
నొనరింపవలయునా అని మాత్రము చింతింపవలయు."

"అత్యాతురము వలదు. దాన మన మపాయముపాలగుదుము.
సుందరీ! ఈ యౌషధము బరిగ్రహింపుము—కడుభద్రముగఁ బ్రయో
గింపవలయుసుమా."

తత్పదార్థగ్రహణ మొనరించునెడ నా కామిని సుందరవదన
మండలమున మగుడ వికారభయానక మేఘము బొడగెడెను.—
"పాషా ఎంతకాలము జీవించును—ఒక వారముతో సమాప్తి
యగునా? మోతాదు ఎంత?"

"గిన్నెడు మధువునకు ఒకలవంగ యంత చాలు. ద్రాక్షరసమే
యగు ...యనము లేదు—ఏ పానీయమైననుసరె."—అట్లు బదులాడు
ఖాసీ ... దన మోము ద్రిప్పివైచెను. కారణ మేమన,
వనితారూపధారిణియగు ప్రభుపత్ని దుష్టసంకల్ప మంత దారుణ
ముగ, దుస్సహముగ నుండెను: ఆ సాధుస్వరూపునివదనమునఁ దద్భావ
ము ద్యోతకమాయెను. తదవసరదుష్టావేశమున నిస్సిల్లా ఆ విష
యము గమనింపలేదు. —

"మనోహరా! ఎనిమిది దినములలో నీ దురవస్థ తీఱును.
అనంతరము ప్రేమధన సాధ్యములగు సర్వసుఖంబులను మనము

హాయిగ ననుభవింప నచ్చుగదా! కాని, ఈలోన, సుల్తాను వివాహము తటస్థమగునేమొ. ఒకవేళ తటస్థమగునేని—గును?—వివాహ మసంభవమని విశ్వసింపుము!"—ఆమె ములు భావగర్భితముగ నుండెను.

"కాంతా! నా సందేశ మింకను గలదు. పాషా భావిభాగ్యోదయాభివర్ణన మొనరించుటకు మాత్రమె నేనే తేరలేను.—ఈ పండుగ సమయమున నీవు విచారమేఘాచ్ఛాదిత వదనవై యుండక, మందహాసముదాల్చి సౌమ్యముగ నుండవలయు—"

"సుందరాంగా! నీకాభయంబు వలదు. దశాధిక మనోహరాకారము వహించి కడు ప్రశంసనీయముగ మెలంగుదు. నా మగని హృదయము దప్పక రంజింపజేయుదు—ఎంతకాలము? ఈ పిశాచము కొలంది దినములలోఁ దొలంగు గదా!"

"నే నిఁకఁ బోవలయు. నాకొఱకు పాషా నిరీక్షించుచుండును."

"ఒక్కమాట—క్షణము తాళుము. నీ హృదయమునుండి జులేఖా పూర్తిగఁ దొలంగెనా? ఇఁక నేనే భవదీయ హృదయైక రాణినై యుందునా? సంశయము లేదు గద!—"

"తరుణీ! నీకావంత వలదు. నా ప్రవర్తన మెట్టులున్న నేమి—నిష్కారణానుమాన తప్తవు గాక, దృఢవిశ్వాసబద్ధవై, నిశ్చలచిత్తవై యుండుము. ఇఁకఁ బోవలయు: విందుసమయమున మఱల గలయఁ గలము."

ఖలీలుఁడు తోడనే దిగ్గున లేచి, అవ్వలకుఁ బోయెను. అచట వేచియుండిన అమీనా ఆతని వెంబడించెను. దర్తబనుపాషా అత్యాతురముగ నిరీక్షించుచుండెను. ఖలీలుఁ డరుదెంచి, స్వీయసందేశ పరిణామము తెలుపఁదగు తెఱంగునఁ దెలిపినంతనే, తురుష్కప్రభు వానందపరవశుఁడై, సముచితభాషణంబులఁ దన కృతజ్ఞత వెలిబుచ్చి,

వెండియు నిట్టులనెను—

"మిత్రమా! నేను రాజధానికి సత్వరము బోవలయు—పాదుషా వారి చారుఁడు మఱియొక్కఁ డరుదెంచెను. నేను శుద్ధాంతముజొచ్చి షాజాదీని సందర్శింపవలయు; ఆ పికవాణి ఆర్ద్ర ప్రవాళసన్నిభాధరములు కంపింప నిజ మనోసమ్మత మొఱుకపఱచును. అమూల్యోపాయనంబులు కొనిపోదును. అతిథు లరుదెంచుకు నాన రెండు గంటలు మించకుండ మగిడి వత్తును."

సార్వభౌమ కుమారీ కరగ్రహణోత్సాహియగు పాషాకు శుభం బగుగాక యని ఖలీలుఁడు దీవింప, నాతఁడు నిష్క్రమించెను. తోడనే, ఖలీలుని వదనమున నమితానహ్యమును విజయోత్సాహమును బొడసూపెను. అనంతర మాతఁడు తన గ్రీకు మిత్రులనుఁ జేరఁబోయెను. మిత్రులు మువ్వురు రెండుగంటల కాలము పరస్పర సంభాషణంబుల వెడలబుచ్చిరి.

రేయి తొమ్మిదిగంట లగుచు, పాషా భటుఁడొకం డరుదెంచి ఖలీలుని నిజ ప్రభు సాన్నిధ్యమునకుఁ దత్క్షణము గొంపోయెను. పాషా రాజధానినుండి అప్పుడె యరుదెంచియుండును. ఐన నంతటి తత్తరంబేల?

దల్లబను పాషా యవస్థ విపరీతముగ నుండెను. అన్యజనాసాధ్య రాజ సన్మానార్హుఁడై అమితోత్సాహ వికసిత వదనుఁడై వెడలిన యదృష్టవంతుఁ డీసమయమున నుత్సాహరహితుఁడై విషాదమయ ముకుళితవదనుఁడై యాపొందిన దీనత్వమువలె నుండెను. ఖలీలుఁ డభిమాన పురస్సరముగ నేమి సంభవమాయెనని ప్రశ్నింప, నాతఁడు మోమెత్తి ఉస్సురని నిట్టూర్పువిడిచి యిట్టులనెను.—

"యువకుఁడా! నిన్ను గాంచి, మదీయ శ్రేయోభిలాషియగు దేవతవని భ్రమించి, సంతసించితిని — ఇప్పుడో! అహితమాచరించు

దుష్టగ్రహంబవని భావింపవలయు—నా యభిప్రాయ మేమన, నీవను నట్లు నీవు నిక్కముగ కార్మీనియా దేశస్థుడగు ఊస్మానువంశములోని వాఁడనే యైన సుమా."

"నేను నిక్కముగ ఖలీలు ఊస్మానుఁడనె. కాని, చేనింతలో నీయభిమానమునకు దూరము కానేల?"

"ఖలీల్! సరి—నా వివాహమింక సరి! పాదుషాపుత్రిక ఉన్నను, లేకున్నను నాకు ఒక్కటె."

"రాజా! ఇంతలో నెట్టి విఘాతము సంభవమాయె? — ఏ మాయె?"

"ఏమాయెనా?—జగన్మోహినియగు పాదుషా పుత్రిక మందహాస వికాసిత ప్రసన్నాననయై సుస్వాగతమొసంగి తప్పక నన్ను వివాహమాడునని రాజభటుఁడు శ్రీఘ్రపోఁడుగునను జెప్పెను. ఆశాపరుండనై నేను పాదుషావారిని సందర్శించి, నేఁగొనిన ఉపాయనంబులు సమర్పించితిని. సార్వభౌముఁడు మందహాస మొనరించి తన తనయను రావించెను. నవలావణ్యరాశియగు నా బాల తారకాగణ మధ్యస్థల చంద్రరేఖవలె నిజపరిచారికానికర పరివృతయై యరుదెంచెను. షాజాదీ మేలు ముసుఁగు ధరించియె యుండెను; ఐనను అపూర్వ సుందరాంగియని వ్యక్తమాయెను. పాదుషావారు తోడనే తమ సేవక బృందంబుతోఁ బాటు వెడలిరి. ఫతేమా పరిచారికలు రెండు బారులు కట్టి కొంతదవ్వున నిలిచియుండిరి. కావున, నేను షాజాదీతో నేకాంతమున నుంటిననియే చెప్పఁగు. ఆ ముహూర్తమున నా హృదయ మెటులుండెనో వర్ణింపఁజాలను. కాని, నేను విపరీతానోత్సాహ వ్యగ్రమనస్కుఁడనై కట్టెదుటనున్న దివ్యసుందర విగ్రహము మోలమోకటింపఁబోవ, నా పికవాణి వారించి, ఆమెయే మోఁకటిలెను!"

"ఆమెయే!"

"సత్యము. నేను బ్రూన్పడియుండ, షాజాదీ గొల్లున నేడ్చి, మదీయ ధైర్యస్థైర్యముల నగ్గడించి, ఉదార హృదయుఁడనని ప్రశంసించి, నిజహృదయ దురవస్థ గమనింపవలయునని విన్నవించి, తన చిత్తము పరాధీనమాయెనని వ్యక్తపఱచి, కాన నీక వివాహము దలపెట్టక తను నుద్ధరింపవలయునని కడు దైన్యముగ నర్థించెను."

"హా! ఫతేమా!"—అని లోలోన విలపించి, "పాపా! మఱి యేమి?" అని ఖలీలుఁడు ప్రశ్నించెను.

"ఏమని చెప్పఁజాలుదు? సుల్తాను మాటయన నాజ్ఞగదా. తన బిడ్డ నాకిత్తునని ఆమహనీయుఁ డనుటచే, నా వివాహము నాకును ఫతేమాకునుగూడ దప్పదు—నేనట్లు భావించితి సుమా! మఱియు, కన్నియ నిరుపమాన సౌందర్యరాశి, అందు పాదుషానందని, మించి చక్రవర్తియే ఆహ్వానించి యొసంగుట! ఆహా! ఆననము మృదుల వసనాచ్ఛాదితమై యగోచరమై యున్న నేమి—ఏమి సౌందర్యము! లోకైకసార్వభౌముని జామాత అగుట ఎంత భాగ్యము! ఎంత గౌరవప్రదము! ఎంత సౌఖ్యప్రదము! అంతటి మహాయోగము నెట్లు విడనాడఁగలను? కాని, పాదుషాపట్టి మఱియు విస్రమమై అవిరళాశ్రు జలార్ద్రశరీరమై, డెందమునఁ బొంగి పొరలు దుర్భరవిషాదము నడంపఁజాలక మంజుల కలస్వనమున విలపించుచు బ్రతిమాలెను. ఐనను, ఆ దీనాలాపములు తృణీకరించి పాదుషావారి యల్లుఁడఁగాఁ గోరితి. అట్టి ముహూర్తమున, మదీయ మహాభాగ్యోదయమున కంతరాయము గల్గించు నూహయొండు పిడుగువలె బొడసూపి నా యాశలను దహించివైచెను."

"ఆ యూహ?"

"ఏమా? మూఢుఁడనై నీకొనరించిన వాగ్దానమె!"

"వాంఛారహితుండ నైయుండ, వరము గోరవలయునని నీవె నన్ను బలవంత మొనరించితివి. ఆక్షణము తోంచినదానిం గోరితి—"

"అయ్యది నాకుఁ బ్రాణసంకటమాయెను—జగదేక సార్వభౌమ పుత్రికను గోల్పోతిని! ఆ హేమగాత్రి అవిరళ బాష్పబిందు ముక్తాఫలమాలికా విరాజితవదనయై మధురకలస్వనంబునం గడు దైన్యముగ బ్రార్థించుచున్నను నిరాకరించి తత్సుందరీ కరగ్రహణ మొనరించి సార్థకజన్ముండఁ గావలయునని కృతనిశ్చయుండనైన ముహూర్తమున నీవరము దయ్యమువలెం దలంపునకు వచ్చెను. నా యింటి కాంతలు తప్ప మఱియొక్కతె మొకట కోరు వరము బ్రసాదింపవలయునని నాచే సమయము చేయించితివి గదా. తత్సమయబద్ధుండనై చరించితి— ఫతేమాను గోల్పోతిని."

"రాజా! లెస్సగ విచారింపుము. దైవవశమున నీ వ్యాపార మిట్లు పరిణమించినందులకు నీవు నిక్కముగ సంతసింపవలయు."

దత్తబను పాషా కొంతతడ వాలోచనాపరుఁడై, ఖలీలుని కేలు తటాలునఁబట్టి ఇట్టులనెను.—

"మిత్రమా! నీపలుకు లమోఘములు. దురంతమగు నాశాభంగము కతంబున వికలస్వాంతుఁడనై ఏమియో అంటి — క్షమింపుము. స్వీయవచో విశ్వాస ఘాతుక పాతకంబు వాటిల్లకుండ మాట గాపాడికొంటి; పాదుషా పుత్రిక మనవి చెల్లించి అమితోపకార మొనరించితి. పర్యవసానము నిక్కముగ శ్లాఘనీయము. అనంతరము, పాదుషావారిని సందర్శించి, నాదు ప్రణయము దెలిపి, ఆమహనీయుండు కినియకుండ సమాధానపఱచి, దుర్భరదుఃఖ ప్రకంపిత హృదయుండనై యరుదెంచితి. కాని, ఇప్పు డావంత తొలంగె: చిత్తము సహజోత్సాహపూరితమై, యిందున కేతెంచు నతిథిజనులకు సముచితాతిథ్య మొసంగుటకుఁ దత్తరపడుచున్నది."...

అనంతరము విందు ప్రారంభమాయెను. సుప్రసిద్ధ పురుషపుంగవులు షహాత్ర మాహూయమానులై యరుదెంచిరి. అపూర్వ రుచికర భక్ష్యపదార్థములన్నియు నాయత్తమాయెను. ఐహిక పియూష మనఁదగు మధువు సమృద్ధిగ నుండెను. శ్రీమంతుఁడగు దత్తబను పాషా అమితోత్సాహపరుఁడై తలఁచునపుడు వైభవమున కేమి కొదువ? భోజనానంతర మా ప్రభువు యథాప్రకారము ఖలీలుని గాంచి యొక కథ సెప్పవలయునని కోరెను.

ఖలీలుఁ డందులకు సిద్ధముగనే యుండెను. మఱియు, పాదుషా వారి తనయను వివాహమాడవలయునని కొండంత యాసతోఁ బోయి విపరీతముగ భగ్నమనోరథుఁడై యరుదెంచి డిల్లవడియున్న ఆహతభాగ్యుని చిత్తమున ఖుల్లాసము గల్గింపవలయుననియు నెంచి ఖలీలుఁ డొక యపూర్వ దీర్ఘగాథ వినిపించెను.

## ౩౦

### మఱతలుపు.

ఈకథ మిగిలినవానికంటెఁ గడు దీర్ఘతరము. కావున నొక్క రేయిలో ముగియలేదు. ఈసమయమున గత విషయానుక్రమము గమనింపఁదగును.

తన రాజధానియందు నిరంతరము జరుగు నిగూఢతర దారుణ నరమారణ పరంపరఁ గాంచి భయభ్రాంతుఁడై పాదుషా యగు మూఁడవ సలీము నగరరక్షకుఁడగు కపీస్ఖానుని రావించి, ఎనిమిది దినములలోఁ దద్భయానక రహస్య విచ్ఛేదన మొనరింపవలయు ననియు, తొమ్మిదవ దివస మాదియుంచుసరికి కృతకృత్యుఁడు కాఁడేని

శిరచ్ఛేద మగుననియు కఠినముగ క్రూరముగ శాసించి యుండె గదా.

తత్ప్రథమ దివసావసాన సమయముననె మన ఖలీలుఁడు కాఫీ మందిరముజొచ్చి, జూలియను లూకాసులను గాంచి, వారి సాహాయ్యమున దల్తబనుపాషాయొక్క జనానాయందుఁ బ్రవేశించెను. అట్టోమను సామ్రాజ్య నిర్మాతయగు ఉస్మాను విపరీత స్వప్నముగాంచి సుందరాంగియగు మల్ఖాటను జెట్టిపట్టిన గాథ నాఁడే ఖాలీలుఁడు వినిపించెను.

సెర్వియను రాయబారియగు మిలోషుని కథ రెండవ సాయంకాలముననను, సిరిబరుని కథ మూఁడవ దివసముననను, రెండవ మహమ్మదు సుల్తాను కాన్స్టాంటు నగరము ముట్టడించిన కథ నాల్గవ సాయంసమయమునను ఖలీలుఁడు వినిపించి శ్రోతల నానందపరవశుల నొనరించెను. చతుర్థ కథానంతరమే జనీజరీ విప్లవ ముప్పతిల్లుటయు, ఖలీలుఁ డద్దాని నతిసులువుగా నతి శ్లాఘనీయముగ నడంచుటయును సంభవమాయెను. ఐదవనాఁటి సాయంకాలము గులాబీ పండుగ, తద నంతరము భయానక పరిణతమగు హెలీనా జిజీముల ప్రణయ కథా శ్రవణమును ఆయెను. ఆఱవదినము బహుళ విషయ ప్రభవకారణ భూతము: బాస్వరసు జలవిహారము, ప్రచండ చోరశిఖామణియగు మనిలుని చిత్రకథాశ్రవణము—ఇయ్యది ఆఱవ కథ—, లూకాసు కథ, రమ్యను నౌకా కథాకలాపమును తటస్థమాయెను. ఖాలీలుఁడాసాయంకాలమే ఏడవకథ ప్రారంభించెను. అయ్యది కడు దీర్ఘమగుటచే నేడవదినమునంగూడ ముగియక, ఎనిమిదవ దివసము సాయంకాలము సమాప్తమాయెను.

కథ ముగియుసరికి రేయి పదిన్నరగంటలాయెను. దల్తబనుపాషా యథాప్రకారము కథావిమర్శన మొనరించి, ఖాలీలుని సముచిత

ముగ నభినందించి, వారలకు సెలవొసంగెను. వజీరు పట్టభద్రుని భార్యయగు నిస్సిల్లా శేదధికార గౌరవము పురస్కరించుకొని తన్మంది రమునుండి ముందుగ నిర్గమించెను. జులేఖా ఖాలీలాది మిథునము లావెనుక వేచిరి. దల్లబనుపాషా కృపాయత్తచిత్తుఁడై కొంతతడ వందె వేచియుండెను. ఆ కారణమునఁ బ్రణయపూరిత హృదయులగు యువకులు తమతమ ప్రియురాండ్ర శ్రవణమున రెండు సరసంపు మాటలాడి వెడలుట కవకాశ మాయెను.

కాని, సుగుణరాశియగు జులేఖా యవస్థ ఎటులుండెను? ఆ సుధా కరానన చిత్తము చింతా సంభరితమై యుండెను. అన్యథా ఎటు లుండును?: ఏడు దినములు నిరర్థకముగ గడచిపోయెను: ఎనిమిదవ దినముగూడ నతిక్రమించెననియే చెప్పదగును: ఇఁక సర్వజన హృదయరంజకుఁడగు దినకరుఁ డుదయించునంతనే, దుర్భర నగర రక్షణ ధూర్వహుఁడగు కదీస్సాగుఁడు క్రూరపాశ ప్రపీడితకంఠుఁడై దారుణముగఁ దెగటారవలయు! జులేఖా కేవలము విశ్వాసరహి తయై నిరంతర నిరాశార్ణవ నిమగ్నయై యుండలేదు: చిత్తమొకా నొకాశాధీనమై యుండుటచేనా కోమలి ఇంతనుక నిబ్బరముగనే యుం డెను. ఐనను, కాల మతిక్రమించెను. హాత్యారహస్య మింకను దెల్ల మైనట్లు తెల్లము కాదాయెను. కావున తన హృదయాధినాథుఁడగు ఖాలీలుని గాంచినంతనే అయ్యబలామణి నిజవిశాల వినీలనయన నిర్గతాతుర వీక్షణములం దన హృదయాందోళన మర్థిమెయి వెల్ల డించెను.

స్వైరిణియగు ప్రభుపత్ని ఆ తావున లేకుండుట మేలాయెను. ఖలీలుఁడు తన ప్రియాంగనను డాసి "ప్రేయసీ! భయము వలదు!" అని శ్రవణమున హెచ్చరించెను. తోడనే ఆ కన్నియ వదనము ప్రసన్నంత మాయెను: మన్మథుని చాపమువలె మనోహరముగ

నను రియున్న సుందర వక్త్రమున మందహాసము తాండవించెను. ఆర్ద్ర ప్రవాళసన్నిభాధరము లొకింత వీడ, దంతములు విమల ముక్తా ఫల సాదృశముగ దీపించెను.

"సుందరీ! భయముడిగి, ఎప్పటియట్లు నన్ను విశ్వసించి నిశ్చల చిత్తవై యుండుము."

ఖలీలుఁడు మరుడ నట్లు హెచ్చరించెను. జులేఖా విశాలనయన దళమ్ము లధిక కృతజ్ఞతాభరమ్మున నవనతము లాయెను. తదవ సరానందోద్భూత దీర్ఘనిశ్వాసము కతంబున నామేల్బంతి నిబ్బరంపు టురము మనోహరతరంబుగ నుప్పొంగెను.

ప్రణయినీ ప్రణయు లంత నొండొరుల నెడబాసిరి. పాషా యంత నరుదెంచి ఖాలీలాది యువకులను వారి మందిరములకుఁ గొంపో యెను. జూలియను లూకాసులు స్వీయ మందిరాంతర్గతులైరి. ఖలీ లుఁడుగూడ నట్లులే నిజ గృహప్రవేశ మొనరించుననుం తలంపున నాతనికి దత్తబన పాషా సగౌరవముగ సెలవొసంగి తాను సెలవు గైకొని వెడలనుండ, నాతురుష్కవీరుఁ డాతని వారించి ఇట్టు లనెను.—

"పాషా! నే నొక వర మర్థించువాఁడ."

"అల్లా! వరమా! నీ వేమికోరికను, ఒసంగువాఁడనె. నీచర్య లద్భుతములు: నీ వొనరించిన యుపకారము నిరుపమానము: నీ వ్రే లున విరాజిల్లు ముద్రిక అపూర్వ మహిమోపేతము — ఐనను, మిత్రమా! నీకొసంగిన తొల్లిటివర మెట్లు మదీయాశాసౌధమును భగ్న మొనరించెనో, ఎంత యసాయకరముగఁ బరిణమించెనో మఱవ జాలను సుమా."

ఖలీలుఁడు సహజ నిశ్చలస్వరంబున నిట్లు బదులాడెను.—

"రాజా! సార్వభౌమ పుత్రికా సందర్శనము గుఱించి ప్రశం

చుంటివి.—నీ ప్రవర్తనము కడు నుదారవంతము, నిక్కముగఁ బ్రశంస నీయము. పాషా! వరు నర్థింపవలయునని నీవు బలవంతమొనరించుటచే నాకొముహూర్తమున స్ఫురించినదానిఁ గోరితిని: తద్వచోబంధనంబున నీవు ఘతేమా ప్రార్థన మన్నించి ఆ యువతీమణి కెంతయేని యుపకార మొనరించితివని సంతోసింపవా?"

పాషా ఏమనఁగలఁడు? అనంత భూమండలాధీశ పుత్రికా కరగ్రహణ మహాభాగ్యము పోయెగదా యని చిత్తము క్రాఁగుచున్నను, తురుష్కప్రభువు సంతసింపవలసిన వాఁడాయెను. ఖలీలుఁడు మగుడ నిట్టులనెను.—

"కాని, ఈవర మట్లు బాధాకరముకాదు. కడు సులభము. కదీస్కారుఁడగు హాసేను ఉదయమగునంతనే మిత్త్రివాఁతెఁ బడకుండ నీ వభ్యంతరమందిరమున నొక గంటకాలము అల్లావారిని ప్రార్థింపవలయు: అనంతర మీ మందిరమునకె రావలయు: ముఖ్యమగు సమాచారమొం డెఱింగించెద."

"ఈమాత్రమునకేమి, తప్పక అట్టులే యొనరింతును. కాని, నీవు తెల్పు సమాచారమేమి?"

"ఇపుడు చెప్పఁజాలను. అట్టు లాచరింపుమని వేఁడుకొందును."

పాషా యందుల కొడఁబడి వెడలెను. ఖలీలుఁడు సగర్వముగ నిట్టులనుకొనెను.—"ఈయుపాయ మమోఘము. ఈపాషా నిజభార్యామందిర మొక గంటకాలము ప్రవేశింపనేరఁడు. ఈమహత్తరకార్యమిఁకఁ దీఱుఁగాక!"

ఐదవనాఁటిరేయి సిద్దీమన్సూరును ఖలీలుని యనుచరులు పట్టుటయు, ఆ ముష్కరుఁడు వారిం దప్పించుకొని పాఱుటయు సంభవమాయెనని పాఠకులు గమనింతురుగాక. తన ధనాగారమునకుఁ గావలియున్న ఆసిద్దీ విపరీతముగ సంతరించెనని ఆ సమయముననే పాషా

దారుణముగఁ దెలుసుకొనెను. అతఁడు తోడనే విశ్వసనీయుఁడగు సేవకు నొకని నిజ నిక్షేప సంరక్షణార్థము నియోగించెను. మఱియు, నాలేడు దినంబులందు ఖలీలుఁడు కుడ్యాంతర రహస్యకవాటము జొర లేదు. ఆ రెండు సాయంసమయములందు నాతఁడు ప్రభుపత్నీ మందిరప్రవేశ మొనరింపలేదు. ఎనిమిదవ దివసమున నాతఁ డమీ నాను గాంచి ఏద్దియో సన్న యొనరించెను. అయ్యది తత్క్షణము ఇస్మిల్లాకు నివేదితమాయెను.

ఎనిమిదవ దినము సాయంకాలమగుడు, ఖలీలుఁడు కృతనిశ్చయుఁడై, తోడనే దృఢభిత్తికాన్తర్గత మార్గము ననుసరించి, సోపానములు డిగ్గి పరికింప నచట పాషాభటుఁడు కాన్పింపలేదు. వాఁడు తనగదియందు నిద్రించియుండునని గ్రహించి, మస్రూను నిరోధించి సంగ్రహించిన తాళము సాహాయ్యమునఁ దలుపు తెఱచి ఖలీలుఁడు పాషా యారామము ప్రవేశించి, తొంటియట్లు కొంతదవ్వరగి, మందుగుం డొకటి బలముగ విసరెను. చువ్వవలెఁ జువ్వున చిమ్మంటిన ఆగోళము నేలఁబడినంతనే తుపాకివలె మ్రోఁగెను. తోడనే, సదకుఁడు మఱి ముగ్వురు భటులతోఁ బ్రత్యక్షమాయెను. ఖలీలుఁడు ప్రశ్నింప, సదకుఁ డిట్లు విన్నవించెను.—

"దేవా! మస్రూ పట్టువడెను!"

"పట్టువడెనా!"

"చిత్తము. వాఁడు మాయధీనమై మూఁడుగంటలాయెను. ఆదురాత్ముని వెంటనే భద్రముగఁ జెరయందుంచితిమి. ఏఁబది మైళ్ళదూరమున వాఁడొక గుహయందు దడఁగియుండెను. ఈ యనుచరుల సాహాయ్యమున జాడలుదీసి అరయఁజాలితిని."

"సదకా! సంతసించితి. నీ వొనరించిన యపరాధము చక్కఁగ సవరించుకొంటివి. నేరము క్షమించుటయె గాక బహుమానము

గూడ నొసంగుదును. నీవు కొనితెచ్చిన మందులచేఁ గార్యము చాల సులభతరమైనను, ఈ మస్రూ మన యధీనుఁడగుట కడుంగడు క్షేమకరము: మదీయాశయము పూర్తిగ ఫలించును."

నిజమనోగత విషయము వెలిబుచ్చుట ఖలీలుని స్వభావముకాదు. నిజపరిచారక వచనశ్రవణ సంజాతోత్సాహతమకమున నామాట లప్రయత్నముగా వెలువడెను. ఇఁక మఱి కాలయాపన మొనరింపక, ఆభటులం దన వెంటబెట్టుకొని, ఖాలీలుఁడు తానరుదెంచిన ద్వారము నుండి పాషా రహస్యమందిరము జొచ్చెను. తోడనే ఖలీలు నాజ్ఞ చొప్పున వారు తమ కరవాలములందీసి యప్రమత్తులైరి. అచట వ్రేలాడు నినుపదీపము వెలుంగున నచటి కాఁపరి నిద్రించియున్న తావు జేరిరి. తోడనే ఖాలీలుఁడు సన్నయొనరింప, నానల్వురు నొక్క యుఱుకున వానిం దాఁకిరి. వాఁడు త్రుళ్ళి మేల్కాంచి పరికించుసరికి, దుర్భర పాశబద్ధుఁడై, అసహాయుఁడై యుండెను. ఖలీలుఁ డిట్టులనెను.—"ఓరీ! భయపడకుము. మదాజ్ఞానుసారము వర్తింతువేని, నీకు క్షేమమగు. మఱియొకటి—నీ ప్రభువుసొత్తు నపహరించుటకు మేము రాలేదు—మా కార్య మహీనము."

మ్రాన్పడిన సిద్దీ ఏమియు ననఁజాలక సవినయముగ శిరము వాల్చెను. వానిని భటులంత నడిపించి సోపానములు డిగ్గజేసిరి. భూమియం దమరియున్న మాయాకవాటము సమీపించినంతనే, ఖలీలుఁడు పాషా భటు నుద్దేశించి ఇట్టులనెను—"సేవకా! నీవీ తలుపు తీయవలయు- నీకారహస్యము తెలియునని యెఱుంగుదు. అల్లదె చీల, గోడయం దడఁగియున్నది. ఆలసింపకుము!"

ఆ రహస్యము ఖలీలుఁ డెఱుంగనిదికాదు. ఐనను, తానె తత్కార్య సాధనమునకుఁ గడంగక వాని నందులకు నియోగించుటకుఁ గారణము లేకపోలేదు. మస్రూ పలాయన మొనరించిన యనంతరము

తదంతర యంత్రసముదాయము మాఱియుండవచ్చును; దాన తన కపాయము సంభవింపనగును. కావుననే ఖలీలుఁ డట్లు లాఁచరించెను. ఆతని గంభీరాకారమును గంభీరతర ప్రవర్తనమును గాంచియు, రహస్య మాతనికిఁగూడఁ గొంతవఱకైనఁ దెలియు నని విచారించియు నాసిద్దీ యిఁక సంశయింపక తత్క్షణ మాశీల నొక్కెను. అంగుళమాత్ర మయ్యది దిగిపోయెను. అనంతరము వాఁడా దారుమయ మాయా కవాటముచెంత కరుదెంచి యొకప్రక్క గట్టిగ నొక్కెను. నాఁడు ఖాలీలు లూకాసు లంతమాత్రమే కాంచియుండిరి. అట్టితఱి నెట్టి విఘాతము సంభవమాయెనో పాఠకు లెఱింగియే యుందురు.

పాషా భటుని పదపీడనంబున నా కవాట మొకపంకి నమరియున్న యిరుసుపై గిఱ్ఱున దిరుగ, తదంతర వివరము పూర్తిగ దృగ్గోచరమాయెను. అంధకారమయమగుటచే నందేమియు గానరాకున్నను, జలముల గలగలధ్వని వినవచ్చెను. తన సేవకునొకనిఁ జీరి ఖలీలుఁడు ఇనుపదీపమును దెప్పించి పరిశీలించెను. చదరముగ నొక సొరంగమువలె నుండిన ఆగోయి పంద్రెండడుగులు లోతుగనుండెను. నీర మాలోతున సుళ్ళుగట్టి ప్రవహించుచుండెను. ఆవివరమున నొకపంకి నమర్చిన గూడునం దొక యినుపపెట్టె గోచరించెను. ఖలీలుఁ డంత సిద్దీని కఠినముగ వీక్షించి ఇట్లు ప్రశ్నించెను.—

"సేవకా! ఈబావివలని ప్రయోజనమేమి? ధన మాసొరంగమున గుప్తపఱచిన జాలదా? మేము ధనాపహరణార్థ మరుదేఱలేదని చెప్పియుంటిగదా! కావున, నిజమాడుము; లేదేని, తత్ఫలమనుభవింతువు."

ఖలీలుఁ డట్లు కఠినముగఁ బలుకుటయేగాక, సాభిప్రాయముగా నానూయివంకఁ జూపించెను. సిద్దీ సహజముగ భయకంపితుఁ డా

మెను—

"దేవా! యథార్థ మెఱింగింతు, గమనింపుము. చూడు మా యినపపెట్టె క్రింద పిడికలదు. దానిం జెప్పఁడేని ఇందుఁ జొరబడి, ఈకీలుపు దెఱచి, ఆపిడి దాఁకినంతనే, పెట్టె అమాంతముగ జల్లున లోనికిఁ బోవును. అట్టుగుటని ఎఱుంగక వంగివాగి ఏమరియుండు నరుఁడు చివాలున లోని కీడ్వఁబడును. ఆర్యా! బాగుగ వంగినగాని, పిడి దొరకదు; అంతగా వంగినవాఁడు పట్టుదప్పి తూలి ఈకూప మునఁ బడక తప్పదు. ఈగోడయందే మఱియొక చీలయున్నది, చూడుము. దీనిని ద్రోసినచో, పెట్టె యటులు కదలక స్థిరముగ నుండును. ఈకారణమున దల్లబనుపాషా, అన్యులకుఁ బ్రాణసంకట ముగ నుండు తన ధనాగారము సుళువుగాఁ దీయఁగలఁడు."

సిద్దీ నిజవిషయము వ్యక్తీకరించెనని గ్రహించి, సంతసించి, ఆనూయాకవాట మికఁ మూసివేయుమని ఖలీలుఁ డాజ్ఞాపించెను. అనంతర మాతఁ డిట్లు ప్రశ్నించెను.—

"సేవకా! ఇందలి నీర మెక్కడిది? ఈప్రవాహ మెటుపోవును?"

"ఆర్యా! ఈ ఆరామమునందొక గుహకలదు: అందుఁగల యున్న జలాశయమునందలి నీరము రహస్యనిర్మితమగు నొక త్రోవ గుండ నిందుఁ బ్రవహించి బాస్వరను జేరును."

అంత ఖలీలుఁడు తన భటుల నుద్దేశించి ఇట్లులనెను.—

"నే మగుడఁ జెప్పువఱకు వీనిని బంధించి యుంచుఁడు. నిక్క మెఱింగించెఁ గాన ఈ సేవకున కపాయము వారయనేరదు."

ఆడనే యావీరుఁడు తన మందిరమునకుఁ బోయెను. దల్లబను పాషా అచిరకాలమున నరుదెంచి ఇట్టులనెను—

"మిత్రమా! ప్రార్థనసల్పి నదిపి నిద్రాపరవశుఁడనైతి గావున—నాలస్యమైనది."

"పాషా! నీవిఁక పూర్వప్రబోధను గాంచఁగలవు! ఇక ఘోరతర పరీక్షయందు త్తీర్ణుఁడవు గావలయునని ఎఱింగి సంసిద్ధుఁడవు గమ్ము: కడు బాధాకరముగ, కడు భయానకము—"

"అల్లా! నీపలుకులే కడు భయంకరములు!"—పాషా వదనము వెల్లవాఱెను: ఐనను, చూపులధీరములుగాక ఎట్టి దారుణానుభవము నైనను మార్కొనుటకు సంసిద్ధుఁడై యున్నటులు కఠినములై కృత నిశ్చయములై యుండెను. ఖలీలుఁ డిట్టులనెను—

"పాషా! నీపత్ని విశ్వాసఘాతిని యని నేఁజెప్పిన, ఏమందువు?"

పాషా క్షణమాత్ర మకరిపడి, ఇట్లు బదులాడెను.—

"ఏమనుటయు నసంగతము—తత్క్షణ మాచరింతును! బాస్ఫరసు జలములు సమీపముననే ప్రవహించుఁగదా—కాని ఇదియొక పరిహాసము గావలయు—ఇట్టి పరిహాసము కరము సంతాపకరము— నీవైతివికాని అన్యుఁడగునేని—"

"పాషా! పరిహాసము కాదు—పరిహాసమున కిది సమయము గాదు. నిజమాడితి—వలదు! వేచియుండుము—ఈసమయమున నే జెప్పినచొప్పున మెలఁగవలయు! అట్లు మెలంగుదునని బాసయొన రింపుము! సర్వరహస్య ప్రదర్శనావసరము సుమా, ఇయ్యది!''

ఖలీలుని విపరీతాధికాధికారమున కోహటించి పాషా యట్లు సమ్మతి మొనరింప, ఖలీలుఁ డిట్లుపలికెను.—

"పాషా! నేవెల్లడించువిషయములు విపరీతములు, భయంకరములు. ఐనను, శ్రవణమాత్ర జనితావేశమునఁ దీవ్రపడక, త్వదీయ విమల యశోభంగకరుండ నని భ్రమింపక, విచారించి యాలింపుము. నీదు సోదరీపుత్రిక జులేఖాను ప్రేమింతునని యెఱుంగుదుగదా—నే నా కన్నియను దప్పక వివాహ మాడుదును. అట్టులే, ప్రేమార్ద్రిమగు నీ యాతిథ్య మింతకాలము సుఖముగ ననుభవించి, తుదను విశ్వాస

ఘాతుకముగ, నింద్యముగ బ్రవర్తింతునని తలంపకుము. కలవరము వలదు!—నేను నీ పత్నీమందిరమునకుఁ బోవలయు"

ముదుసలి పాషా కడు భయభ్రాంతుఁడై, మ్రాన్పడెను. ఆ మంద భాగ్యుఁడు కలగుండువడిన చిత్తము బదిలపఱచికొని, అయ్యది కలయో నిక్కమో అరయుటకో యన ఫాలభాగమున జేయి చేర్చెను. అనంతర మామాని హస్త మప్రయత్నముగ వస్త్రముపైఁ బాఱ, "పాతకీ—విశ్వాసఘాతినీ!—ఇస్మిల్లా!" అని సాభిప్రాయముగ రోఁజుచు పండ్లు గొఱికెను.

"పాషా! శాంతింపుము. గాథ యింకను జాల గలదు. నే నిపుడు ఇస్మిల్లా శయ్యాగారమునకుఁ బోయెదను. తొంటి యట్లు అమీనా నాకుఁ ద్రోవ సూపును. ఉచితమగు తావున నీవు డాగియుండి, ఇస్మిల్లా సహకారిణియగు నా దుష్టురాలు మగిడి వచ్చునంతనే పట్టి బంధింపుము—వధింప రాదు సుమా—నీవు సమయబద్ధుఁడవని యెఱింగి తీవ్రాచార మొనరింపకుము. అనంతరము, నీవును ఇస్మిల్లా మందిరము జొచ్చి, వేగిరపాటున మా సమక్షమునకు రాక సముచిత స్థలంబునఁ బొంచుండి, శ్రద్ధమెయి ఆలింపుము. నేఁ జీరువఱకు రారాదు సుమా! అట్లు సమయ మొనరింతువా?"

దురంత సంతాపవిహ్వలుం డగు పాషా అట్లు మాటీయ, ఖలీలుఁడు తటాలున నిట్టు లనెను—

"మాటాడకుము! గాలి సవ్వడి అగుచున్నది—అమీనా కావలెను—ఆ తెర మఱుంగునకు రయమ్మునఁ బొమ్ము! ఎఱుంగుదు గదా, నీవు మెలఁగవలసిన తెఱంగు!"

పాషా యట్లు డాగినంతనే, అమీనా ప్రవేశించి, నిశ్చలాకృతి దాల్చియున్న ఖలీలుని గాంచి ఇట్టు లనెను—

"ఆర్యా! నీవు పంచిన సమయమున కరుదెంచితిని. మోహనాంగి

యగు నా సాని నిన్నుఁ జూడ నిరీక్షించుచున్నది."

ఖలీలుఁడు సహజ నిశ్చలస్వరంబునఁ ద్రోవ సూపుమని పలికి, ఆసంధాన కర్త్రి పిఱుంద బోయి ఇస్మిల్లా శయ్యాగారము ప్రవేశించెను. దాసి తోడనే వెనుదిరిగి వెడలినంతనే క్రోధఘూర్ణితచిత్తుఁడగు పాషాచే బంధింపఁబడెను.

శ్రేణీమండలి అంత్యమందిరమున ప్రభురాణి, ఆ లావణ్యరాశి సముచితాలంకార విభూషితయై మృదులతల్పమున నొయ్యారముగ వ్రాలి యుండెను. భోగపరాయణ యగు నా కాంత మనోహరాకార మపూర్వవైభవముతో నలరారుచుండెను. ఆ మెఱుఁగుఁబోఁడి వినీల తరళ నయనములు మోహావర్ణనమునఁ బరిభ్రమించుచుండెను. సుందర దిగంబరభుజములు హారిదంతసన్నిభములై, కపిలవర్ణరంజిత కుంతల నికరాచ్ఛాదితములై, మనోహరములై యొప్పారెను. సాధారణముగ కంఠమున కంటియుండు కంచుకము గ్రంథివీడిన కారణమున నధిక ప్రదర్శితోన్నత వక్షోజమున గూడ నామె నెఱికురులు వ్రాలియుండెను. ఆ మేల్బంతి యనాచ్ఛాదితభుజములు దివ్యమణిమయ భూషణ విభూషితములై దర్శనీయములై యుండెను. ఆర్ద్రాధరోష్ఠము లొకింత విచ్చిన కారణమున నా కామిని హారిదంతభాసురదంతములు నిక్కముగ నపూర్వ శోభాయమానముగ నుండెను.

నిజహృదయాపహరణక్రియాదక్షుఁ డగు ఖలీలుని గాంచినంతనే, ఆ జారిణి అమందానంద కందళితహృదయయై, భుజలతిక లల్లనఁ జాపి ఆ మోహనాంగు నాలింగన మొనరించెను. ఆ ధీరోదారస్వాంతుఁడు కొంతతడ వట్లు భామినీ భుజపంజరబద్ధుఁడై మిన్నకుండెను. పసిడి బిసకాండములఁ నీసడించు నా కామినీకరములు మృదులముగ, వెచ్చవెచ్చగఁ దాఁకుచున్నను, హిమదంతగోళ సన్నిభగురుతరవక్షోజము లుప్పొంగుచు దన పేరుటురము నొరయుచున్నను, ఆర్ద్రపల్లవా

ధరములు దను జుంబించుచున్నను, ఆ ధీరోదాత్తచిత్త మావంతయు నధీరము గాక నిశ్చలముగ నుండెను. ప్రభుపత్ని మనోహరనారీరూప ధారణమగు నొక భయంకర పిశాచగమని ఆతఁ డెఱుంగు గదా.

ఆమె భుజబంధనమునుండి అల్లన విడిపించుకొనుచు నాతఁ డిట్టు లనెను—"ప్రేయసీ! ఒక్కమాట!—అనంతరము నిరవధి సౌఖ్యార్ణవ నిమగ్నులము కాఁగలము."

"ఏమది? మోహనాంగా! మాటాడుము!" ప్రభుపత్నిస్వరము మందమై మోహాంచితమై యుండెను: తదావేశోజ్వలాని మేషనయనము లా సుందరాంగుని వదనమున నాటిపోయెను.

"సుందరీ! రెండుదినములనుండియు మనము గలియఁ జాలమైతిమి. ఆ విషౌషధము ప్రయోగించు నవకాశము చిక్కెనా?"

"చిక్కెను! మోహనాంగా! నీకొఱకుఁ నధఃపతిత నగుచుంటిని! ఆహా! ఎంతటి మహాత్యాగ మొనరించుచుంటినో గమనింతువు గదా?"

ఖలీలుఁడు కాముకునివలె నా కాంతకరము పట్టి ఇట్టు లనెను—

"నీ ప్రవర్తనము నిక్కముగఁ ప్రశంసనీయము—కాని, ఆమాత్రలు సముచితముగ విని యోగ మాయెనా?"

"హాహా—భర్తయని చెప్పుట దుర్భరము—నిన్నను నేఁడును నా యుండనుండిన సమయమున షర్బతునం దామందు గలిపితి. కాని, ఆతఁ డా పానీయము ద్రావినను మార్పుజెందక ఎప్పటియట్టులనే యుండెను. ఐనను, ఈ సాయంకాల మాతని వదనము వెల్లవాఱినటు లాయెను."

"సందేహ మేమి! చెప్పితిగదా, ఈమందు మందమందముగఁ బనిచేయుననియు, ఐనను తప్పక ప్రాణాంతకమనియు! కాని, మీాదు మిక్కిలి యగునపుడు, విచారింతుమేమో సుమా—"

“విచారమా!—ఎన్నటికి లేదు. నీవంటి నవమోహనాంగుఁ బొందు నడయు భాగ్యము గాంచునప్పుడు వంతయేల! మఱియు, నా మగని యునికి నాకు దుస్సహముకాదా?—చాటుమాటులేక సర్వకాల సర్వావస్థలందును బూర్తిగ నీదాననై యుండు సుముహూర్తమునకై తత్తరపడుచుంటిగదా? సొగసుకాఁడా! ఇఁక నస్వల్పదినములలో నీ యర్ధాంగినై, భవదీయ చిరతరదృఢ బాహుడోలికాఖేలనా పారవశ్య మనుభవింతును! ఆహా! ఎంత సుఖము! ఎంతటి యానందము! ఓయీ మోహనాంగా! ఖలీల్! నన్ను నిరంతరము ప్రేమింతువా?—ప్రేమింతునని యనుము. ఆహా! ఈ జాలమేల? రమ్ము!—మదీయవక్షోజమున నాలింగన మొనరింపనిమ్ము! మనసార, మధురముగ, సవిరళముగ ముద్దాడనిమ్ము!—రమ్ము!—“ఆ!—ఇదియేమి! ఏమి?—”

నిరుపమాన సౌందర్యరాశియగు నా జారిణి అనంగ శరదళిత హృదయయై, క్షణక్షణ ప్రవర్ధమాన మోహావేశమునఁ దన బాహువులు జాపి, ఆ నవమోహనాకారు నాలింగన మొనరింపఁ దలంచెను. కాని, ప్రఫుల్లమై, సుప్రసన్నమై, మందహాస విరాజితమై యొప్పు ఖలీలుని వదన మాకస్మికముగ విపరీత భయాసహ్యానిరసనముల కధీన మాయెను. కావున, ఆ కులట దురంత భయవిస్మయాకులచిత్తయై “ఆ! ఇది యేమి! అని యఱచెను.

“ఓసీ! దుష్టాత్మా! నీసంగతి తెల్లమాయె! ఇఁక నీపాపిష్ఠిజీవనము సరి! పాషా! దయచేయుము!”

ఖలీలుఁ డట్లు గర్జించునంతనే, దత్తబనుపాషా ఒక్క విసురునఁ దలుపు తెఱచి విసవిస నరుదెంచి, తటిల్లతసన్నిభ కరవాలమున నిస్సిగ్గులాను ఖండింపనెంచి, తదవసరావేశమున నున్మాదునివలె నిట్లు లఱచెను.—“పాతకీ! మదీయ ప్రాణాపహరణ మొనరించు విషోరగ

యును సాకుచుంటినని ఎఱుంగనైతి!—"

పాషాను వారించి, ఖలీలుఁ డిట్టు లనెను—

"పాషా! వలదు, వలదు! అట్టి కార్య మొనరించువారు న్యాయశాఖాధికారులు, నీవు కాదు."

"ఐన నేమి! ఈ దుర్మార్గుని దారుణముగ విసమిడు—"

"లేదు! ఆమందు నిరపాయకరము! భవదీయ ప్రాణాపహారణ మొనరించు నౌషధము నే నొసంగుదునా?"

ఇస్మిల్లా యవస్థ దుస్సహముగ నుండెను. ఆ స్వైరిణి శల్యమున వ్రాలి, సుందరశిరోజముల సమును మనోహరముగఁ దోఁచు కోమల తరుణాంగుళములచే మోము గప్పి, చిచ్చువలె దహించు విపరీత దుఃఖము నడంపఁజాలక వెక్కి వెక్కి విలపింప, ఖలీలుఁడు కఠినముగ నిట్టు లనెను—

"జారిణీ! నీ జీవితము సహస్రాధిక దీర్ఘమైనను, నీ వాజన్మాంతము దుఃఖించినను, కన్నీరు మున్నీరై ప్రవహించినను, నీ వొనరించిన ఘోరతర దురాచారకళంకము తొలంగనేరదు. పాషా! నీ వాలింప వలసిన భయానక రహస్య మింకొకటి కలదు. అయ్యది అమానుషము, అనిర్వచనీయము, హృదయవిదారకము, కడుంగడు దుస్సహము! చతుస్సముద్రముద్రిత మహాసామ్రాజ్య ప్రధాననగరమును విపరీతముగఁ గలంచు నవిరళ నరమేధమునకుఁ గారణము,—ఈ దుష్టాత్మయె!"

తోడనే ప్రభుపత్ని కెవ్వున నఱచి, విద్యుద్జ్వలోద్వేలిత సాలభంజికవలె నిట్టనిలువుగ లేచి, తదవసర విపరీతావేశమున నయనములు మిఱుమిట్లు గొలుప, స్పృహదప్పి మూలచ్యుత కదళీస్తంభమువలె గుభాలున నేలఁ గూలెను. దత్తబను పాషా యన్ననో, అయ్యఘోర రహస్యము పిడుగువలె వీనుల బడినంతనే దురంతవికలస్వాంతుఁడై,

ఖడ్గము జారవిడిచి, మధుపానమత్తుని చంగమునఁ దూలి గోడ నాశ్ర యించెను. ఖలీలుఁ డిట్లు లనెను—

"పాషా! నిన్ను జూడ నా చిత్తము నీరగుచున్నది. సుగుణాత్మకుఁడవగు నీకు దాపరించిన ఈ ఘోరవిపత్తు దలంప హృదయము నిక్కముగ నార్ద్రీభూత మగుచున్నది. నీ వాక క్రూరవిషోరగమును బెంచితివి! ఈమె నిటనుండి తొలగింపవలయు!"

ఖలీలుఁడు తోడనే లేచి, ప్రభుపత్నీ మందిరాంతర నిగూఢమార్గమును మఱుఁగుపఱచు మొగములు తెఱఁ దెఱచి, సదకునిఁ జీరి, సిద్దీ నిఁక వీడవచ్చునని పలికి, ఇస్మిల్లాను జూపి, ఇట్లు లాజ్ఞాపించెను—

"ఈ స్త్రీని తక్షణము గొంపోయి, రాజధానియందలి చెఱయం దుంచుము, పొండు!"

తోడనే, సదకాదిభృత్యు లందఱు గలసి ఇస్మిల్లా యచేతనరూపమును పరస్పర సాహాయ్యమునఁ బట్టి, ఆ రహస్యమార్గముగుండ నారామము జేరిరి. అనంతరము, ఖలీలుఁ డిట్లు లనెను—

"పాషా! మదాయత్తనుగు నౌక వేచియున్నది. ఇస్మిల్లా అందె పోవును. అమీనాయును అందుఁ బోవుట వాంఛనీయము, కావున నీ వనుగ్రహించి అట్లు లాజ్ఞాపింపుము."

భయానక విపరీతసంఘటనములచే సగము ప్రాణ్పడిన పాషా మాటాడఁజాలక అవలకుఁ బోయెను. ఖలీలుఁడు నిట్టూర్పు విడిచి ఇట్లు లనెను—"అల్లాకు శతసహస్రవందనములు! స్వయంకృతకార్య భారము చక్కఁబడెను—కదీస్కారుడపాయమునుండి తొలంగెను—నా జులేఖా యిఁక నిరంతరానంద మనుభవింపఁగలదు!"

## కాన్స్టాంటునగరము

ఖలీలుని పంపున వెడలిన దల్లబను పాషా అచిరకాలమునఁ దిరిగి వచ్చి, ఆసనమున మేను జేర్చి దుర్భరచింతావిహ్వలుం డాయెను. ఖలీలుఁ డిట్టు లనెను—

"పాషా! ఎట్టి సంకటసమయమున నైనను జలించి యెఱుంగని ధీరవరుండవు ఈ సమయమున నధీరుఁడ వగుట భావ్యమగునా? మనోహర మానవాకృతి దాల్చినది ఒక్క ఘోరపిశాచమని యెఱుంగక వివాహమాడుట దురదృష్టము. ఐనను, ఇట్టి దుష్టాత్మ తొలంగెగదా యని సంతసింపవలదా?"

"కాని, ఇట్టి పాతకి మత్ప్రియభార్య యని ఇంతకాలము విశ్వసించియుంటినే—ఆహా! అంతయు నొక యపూర్వస్వప్నమువలెఁ దోఁచెడిని. మఱియు—"

"పాషా! గమనింపుము. నీగృహము జొచ్చి అతిథిసత్కారము గాంచుచు నాటాడుచుంటిని. ఇట్టి మిథ్యా ప్రవర్తనమునకుఁ గల సమాధానము జెప్పవలయు. ఆర్యా! రాజధానినంతయు దారుణముగఁ బీడించు నరమారణ రహస్యము కదీస్కారుఁడు ఎనిమిది దినములలో నరయవలయునని పాదుషా కఠినముగ శాసించె గదా. తద్భయానకరహస్య విచ్ఛేద మొనరింపవలయునని సంకల్పించి ఇలు వీడినంతనే జూలియను లూకాసులు కాన్పించిరి. వారు సెప్పిన కథ నాలించి, వారిని వెంబడించి, నీయంతఃపురము రహస్యముగ ప్రవేశించితిని. తత్కథాశ్రవణమున నీపత్ని కులటయని వ్యక్తమాయెను. అంత నాచిత్తమున నొక అనుమానము ప్రబుద్ధమాయెను. మఱియు

మదీయచిత్తాపహారిణియగు జులేఖా యునికి కూడ నొక ప్రబల కారణము కావలయు. భవన్మందిర ప్రవేశమొనరించినంతనే నాయనుమానము దృఢతరమాయెను. నాఁడు గుల్నేరు లూకాసులను నొకజేర్చి నీవేగుచుండిన సమయమున, కరాళమృత్యువునుండి లూకాసును ఆయంగుళీయము రక్షించిన సమయమున—

"ఆహా! ఆముద్రిక!—ఇప్పుడైన యథార్థ—"

"పాషా! సర్వమెఱింగింతును. కాని, ముందీసమాధాన మాలింపుము. ప్రథమ సాయంసమయమున నీవా తెఱంగున దవ్వుననుండిన సమయమున, ఇస్మిల్డా నిజదూతికా ముఖమున నన్నాహ్వానించెను. ఆహ్వానించి, ననుగాంచినంతనే, మోహాతురంబున, ప్రసంగమునకు దొరకొనెను. అమీనా నాదు రూపురేఖల నభివర్ణించియుండును. నే నాదుష్టప్రణయము, స్వీకరించియు నీమందిరమున నుండఁగోరితిని. ఏమన, నీమందిరమున కరుదెంచుట దైవికమని భావించితి. ఆరేయి మఖ్లాటను కథనేఁ జెప్ప, నీవమితానందమందితివి. అనంతరము నాగదిజొచ్చి, పరిశీలించి, కుడ్యాంతర రహస్యకవాటము దెఱచి, నీనిగూఢ మందిరమునందలి దారుమయ మాయాకవాటము గాంచి, సిద్దీని జూచి, రహస్యపథంబునఁబడి, ఈక్రీడా మందిరమునఁ గాలిడితి. నాతొల్లిటి యనుమానము మఱియు నధికమాయెను. కావున, భయానకరహస్యము జాడ వెలియగువఱకు నిందుండి పాటుపడవలయునని సంకల్పించి, నావైఖరి మార్చుకొంటి. ఆముహూర్తమునుండియు లేసి వలపుదాల్చి ఇస్మిల్డాతోడ సరసములాడఁ దొడంగితి. ఐనను, అనుమానమున కెడమీక తత్తత్కాలోచిత మాయోపాయములచే నామె బారినుండి తప్పించుకొనుచుంటిని. కథాంతమున నీకాంత యరుదెంచి తా నొక కథ నాలింపవలయునని వాంఛించెను. దానవాయునికి కీర్ఘశేషమాయెను.—అయ్యది నా యుపాయము. నేను

మెయి నొక రేయి లూకాసును, మఱియొక రేయి జూలియనును ఇస్మిల్డా మందిరమున బ్రవేశపెట్టితిని. నావలెనే నామిత్రులు గూడ నాకామినికి వశంవదులు గాక, అనుమానాస్పదులును గాక సంచరించిరి. దాన నాయనుమానము ధృవమని వ్యక్తమాయెను. ఇస్మిల్డా కేవలము జారిణియని తెల్లమగుట యొకటి. రెండవది,—ఆజారిణి తన గుట్టు అణుమాత్రము దెలియకుండవలయునని ఎంచి, నిజక్రీడా మందిరాంతర్గతులగు యువకులు గర్వాతిరేకమున నొడలెఱుంగక రహస్యము వెల్లడింతురని వెఱచి, దయారహితయై ఆమందభాగ్యులను సిద్దిమన్సూర్ క్రూరకరవాలమున కెరసేయుచుండెను. వాఁడు తన వాఁతఁబడు ప్రతియువకుని నామెట్లు డిగ్గఁజేయుచుండెను.—"

"హా! తెలిసె! తెలిసె! కాని, మన్సూరింతగ సంతరించుట—"

"నావలన. ఆరామద్వారము తాళము నేఁ గైకొని ఆసాయమున వానిఁబట్టి బంధించితి. కాని, వాఁడు నాసేవకులం దప్పించుకొనెను. తుదకు మగుడబట్టువడి కారాగారబద్ధుఁడై యున్నవాఁడు. మఱియొక విషయము నీవు గమనింపవలయు. గులాబీ పండుగ యనంతరము హెలీనాజిజీముల గాథ జెప్పియుంటిఁగదా. వారు మరణించిన విషము గుఱించి అపుడు ప్రసంగమువచ్చెను. ఆముహూర్తమున నిస్మిల్డా హృదయావస్థ గుర్తించితి. ఐనను, సందేహనివృత్తి కావలయునని యెంచి, మఱునాఁడు—బాస్వరసు విహారమునాఁడు—సమయము జూచి ఆమెతోఁ బ్రసంగించి నిక్కమరసితి—కడుదారుణము! నిన్ను బొలియింపవలయునని సమకట్టెను! విసమని నమ్మించి ఏయుపాయము లేని మందొకటి నేనీయ అయ్యది పానీయమునఁ గలిపి నిన్ను ద్రావించెను. ఇఁక నామె దుష్టసంకల్పము స్పష్టము గదా. ఆపాతకిని దక్షణము బంధించియుందును, కాని, మన్సూరుకొఱకు వేచియుంటి. భయావేశమున వాఁడు సర్వమెఱింగించును. వాఁడు

లేఁడేని, అవిరళమగు దారుణ నరసంహారణమునకు నిస్సిగ్గుగా కారకు రాలను విషయము పూర్తిగ బుజువు కానేరదు. కాని, దైవవశమున నా యాశయము పూర్తిగ నెఱవేఱెను. పాషా! యిఁక—"

ఆముహూర్తమున పాషా భటుఁ డొకఁడు బిఱబిఱ నరుదెంచి, ఆతురస్వరంబున నిట్టులనెను. "దేవా! రాజధానినుండి వార్త వచ్చెను. జనీజరీలు తిరుగబడి, పాదుషావారిని బంధించిరట— ప్రధానమంత్రి ఏలినవారికై నిరీక్షించుచున్నారట—"

నిశ్చల చిత్తుఁడగు ఖలీలుఁడు సహితము వెఱగందెను. పాషా యిట్లు విలపించెను.—

"అల్లా! అల్లా! ఈవార్త కడు భయావహము! అరె! ఏఁడీ!— కానరాఁడేమి!—"

ఖలీలుఁడు మెఱపువలె నదృశ్యుఁడగుటయే పాషా విస్మయమునకుఁ గారణము. భయంకరమగు జనీజరీ విప్లవము! బహు సమర్థుఁడగు ఖలీలు నంతర్ధానము! పాషాకు మతిపోయెను. రాజదూత యంత రాజధానికి రావలయునని హెచ్చరింప, నాప్రభువు తన కుటిల భార్యా మందిరమునుండి వెలువడి, గ్రీకుయువకులను దర్శించెను. ఆ వీరులు కార్యమెఱింగినంతనే, పాషాతోఁ బోవుటకు సంసిద్ధులైరి. అపుడు నిశీథసమయము — పండ్రెండు గంటలాయెను: నిశ్చలముగ బరుండు తన పుత్రికలట్టి యసమయమున భంగపడరాదని యతఁడు వాంఛించుటచే, జూలియను లూకాసులు తమ ప్రియకాంతలతో ముచ్చటింపజాలరైరి. తోడనే, రాజదూత గొనివచ్చిన నౌక నారోహించి ఆ మువ్వురును వెడలిరి.

అంతవఱకు నేమియుఁ బలుకని భటుఁడు మార్గమధ్యమున నూతనోపద్రవము గుఱించి యెఱింగించెను. తొంటి జనీజరీ విప్లవమునుండియు రాజామాత్యులా సైన్యమును విచ్ఛిన్న మొనరింపవలయుననియు,

ఆ బలము హ్రస్వపఱుపవలయునని యు దలంచుచుండిరి. ఈ వార్త జనీజరీల కెట్టులో తెలియవచ్చెను. తోడనే వార లేకగ్రీవముగ విప్లవ ధ్వజ మెత్తిరి. వారి నాయకుఁడగు 'ఆగా' వారింపనేరక నాయకత్వము వహించెను. ఆ మహాసేనావాహిని నాలుగైదు ముఖముల భయంకరముగ బాఱి పాదుషావారి దుర్గముముందు విడిసెను. సుల్తాను ధైర్యము వహించి నిజాంగరక్షకవ్రాతమునకు స్వయముగా నాయకత్వము దాల్చి విప్లవకారులను దాఁకఁ గడంగెను. కాని, విశ్వాసబద్ధులై యుండవలసిన స్వీయసైనిక నికాయమే. ఘాతుకముగ ప్రభుభక్తి మఱచి విప్లవకారులను జేరుటచే నా మహనీయుఁడు పట్టువడి, అచటి కాఁ పరికోణమున బంధితుఁ డాయెను. అంతిపురంబున నడఁగియుండు రాజకుమారుఁడు ముస్తఫాను వారంత నాహ్వానించిరి. తద్భావము నాతఁడు గ్రహించి, మహారాజ్యాధిపత్యము లభించెనని కడు ముదమంది, సౌజన్యము దొఱఁగి, నిజజనక నిష్కృత్తధనకాసులం డన బానిసలు వెంటగొనిదేఱి, క్రూర జనీజరీ సైన్యప్రకంపిత రంగస్థలమునకు రయమ్మునఁ బోయెను. తదవసరావేశమున వారు జయజయధ్వానము లొనరింప, నా ముస్తఫా తురుష్క సార్వభౌమత్వము సగర్వముగఁ దాల్చెను. ముస్తఫా సేవకులు తాము తెచ్చిన ధనరాశి తోడనే అవిరళముగఁ బంచిరి: జనీజరీ లచటి మైదానములందుఁ జేరి మద్యపానాద్యనేక దుర్వ్యవసాయనంబుల నిమగ్నులైరి.

ఈలోన, జనీజరీకాల తరంగము భయంకరముగ విఱిగినంతనే, ప్రధానామాత్యుఁ డితర మంత్రులను గూడ జేర్చి, కర్తవ్య మాలోచింపుచుండ, సలీము పాదుషా పదభ్రష్టుడైన వార్త దారుణముగఁ దెలియవచ్చెను. ఆస్థానమున జ్యేష్ఠ రాజకుమారుఁడు ముస్తఫా ప్రతిష్ఠితుఁడాయెనని గూడ దెలిసెను. అమాత్యాది ఘనాధికారుల యవస్థ కడుంగడు సంకటముగనుండెను. ముస్తఫాచర్యను ఖండించి

తగు ప్రతిక్రియ సలుపవలయునా? లేక, ఆమోదింపవలయునా? రాజ్యపదచ్యుతుండైనను, తుదకు సలీమే విజయము గాంచనగును. అట్టి యెడ వారు ముస్తఫా రాజత్వము నామోదించినచో, ఘోర మరణమునకుం బాల్పడుదురు అట్టులగునని యెంచి, ముస్తఫా పిశాచకృత్యము బ్రతిఘటింపం గడంగినచో, నొకవేళ నాతండే జయించునేని, వారలకు ఘోరమరణము తప్పదు. మఱియుం రాజధానియందలి ఇతర సైన్యము లేవంక దిరుగునో తెలియదాయెను. ఆసైన్యములను శాసించిన, దల్తబను పాషా యొకండే శాసింపవలయు. అన్యులసమర్థులు కావుననే, రాజభటుం డొకండు పాషాను గొని తేఱ రయంబునం బోయెను. ఆసమయమున రాజధాని స్థితి యటు లుండెను.

భటుండు విరమించువఱకు నేమియు మాటాడక దల్తబను పాషా నిశ్చలముగనుండెను. అనంతరమైనను ఆమహానీయుండేమియు బలుకడాయెను. కొంతతడవాతండు చింతాపరుండై, రాజభటుం డాలింపకుండ గ్రీకు యువజనశ్రవణమున స్వీయవిచారోదంతము నెఱుక పఱిచెను. అనంతరాజధాని నంతయు సంక్షోభింపం జేసిన దారుణ నరమారణకర్త తనభార్యయే అనియు, ఆమెతోం బాటు అమీనాయును బంధింపంబడెననియు జనీజరీవిప్లవసమాచారమాలించినంతనే ఖలీలుండు మెఱుపువలెనదృశ్యుం డాయెననియు నాతండు తెల్పెను. గ్రీకుయువకులు సహజముగా విస్మయభయాక్రాంతచిత్తులైరి. అందనుక విపరీతమై, విస్మయజనకమై, కడు నిగూఢమై, దుర్గ్రాహ్యమైయుండిన ఖలీలుని ప్రవర్తనము సువ్యక్తమాయెను. తమ మిత్రుని వివేచనాప్రాగల్భ్యము, కార్యదీక్ష, కార్యదక్షతయును నిరుపమానముగం గను బ్రశంసనీయముగ గాన్పించెను. నౌక అంతలో రేవు జొచ్చెను.

తోడనే దల్తబను పాషా నిజానుచరసమేతుండై ప్రధానామాత్య

మందిరమునకుఁ బ్రయాణమాయెను. బాటలన్నియు జనశూన్యములై యుండెను. క్రూరులగు జనీజరీలను వెఱచి గృహస్థులెల్లరుం దమ గృహములను భద్రముగ బిగించుకొని డాగియుండిరి. వారట్లు పోవఁ బోవ, వజీరు మందిరము సమీపించెను. ఆయుధహస్త శోభితులగు సైనికు లచట సాయుధులై అప్రమత్తులై తిరుగాడుచుండిరి. లెక్కలేని కర దీపికలును దీపరాజములును దేదీప్యమానముగ వెలుంగుచుండిన కార ణమున నా తావంతయు స్ఫుటముగఁ గాన్పించుచుండెను.

దత్తబను పాషాను గుర్తించినంతనే యచటి సైనికులు సముచిత వినయ గౌరవపురస్సరముగాఁ దమ ఆయుధములు బ్రదర్శించిరి. పాషాతోఁబాటు జూలియను లూకాసులు గూడ సింహద్వారము నతిక్రమించి యచటి తోపల మందిరమున నిలిచిపోయిరి. పాషా మూటిగాఁబోయి, అమాత్యాదితర ప్రముఖ నికరసంకీర్ణమగు సభా భవనము జొచ్చెను. మహత్తర కార్యాలోచనా నిమగ్నులై ఇతి కర్తవ్యతావిమూఢులై సంకటపడు నా సభాసదులకు పాషా రాక ఎంతయు నానందదాయకముగనుండెను. ఆమహనీయునకు సముచి తాసనముం జూపి, అధ్యక్షత వహించిన వజీరు విషయ మెఱింగింప దొడంగెను.

"ఆర్యా! నలుబదివేల సంఖ్యగల జనీజరీలు దుర్గపరిసరములం గల మైదానముల నాక్రమించియున్నారు. ఇతర కాల్బలమును అశ్వ బలమును గూడ తమతో నేకీభవింతురను నిబ్బరమున వారింకను విజృంభింపక ప్రస్తుతము విడిసియున్నారు. మిత్రమా! ఇట్టి యెడ మనకుఁ గర్తవ్యమెద్దియో ఎఱింగింపుము."

తోడనే పాషా ఇట్లు బదులాడెను.—"ఆర్యవరా! కర్తవ్యము వ్యక్తము. ఈముస్తఫా తన రాజ్యమును నిలుపుకొనఁజాలఁడు. మూట్లు తనజనకుని దారుణముగ భంగపఱచిన క్రూర సైనికా

హ్వానము బురస్కరించుకొని తత్క్షణము సింహాసనారోహణ మొనరింపఁ గడంగుట దుర్మార్గము, అమానుషమును గదా. కాన, నేనా కాపురుష ప్రయత్నమునకు సాయపడఁజాలను. ఇటులాచరించుటకడు సహాయకరమని యెఱుఁగుదును. జయాపజయము లితర రాజసైన్యావళిపై నాధారపడియుండు అసంఖ్య ఏఁబది వేలు—

"ప్రభువతంసమా! ఆసైన్యము నీయధీనము గదా!—"

"అమాత్యశేఖరా! అటులని విశ్వసించి నిబ్బరముగ నుండరాదు. ఈసమయమున నెట్లు—"

"మొన్ననే గదా నీవొక జనీజరీ విప్లవము నడఁచితివి!"

వజీరట్లు పలికినంతనే దల్తబరు పాషా తనకా యవసరమున విజయ మొడగూర్చిన ఖాలీలుని దలంచి, ఆవీరుఁ డిపుడు లేఁడు గదా యని విచారించి, నిట్టూర్పుపుచ్చి, ఇట్టు లనెను.—

"ఆర్యవరా! ఆసమయమున నైనను, అంతమున సైనికులు నన్ను బీడించిరి: సులేమాను మసీదు చెంత కదీస్కాఁడని ఛిన్నమస్తకము గాన్పించునని భాసమొనరించి, వారల నూఱడింపఁ గడంగితి: కాని, వాని శిర మచట గానరాదాయెను—సైనికులు తోడనే నన్ను జుట్టి ముట్టి వధింప సంసిద్ధులైరి—"

ఆముహూర్తమున నొకరాజోద్యోగి సభాభవనద్వారమునుఁ గుభాలునఁ ద్రోచి, నూటిగఁబోయి వజీరుని డాసి సాష్టాంగమాచరించి ఇట్లు విన్నవించెను—"మహనీయా! చిత్తగింపుడు—ఇప్పుడే యొక వార్త తెలియవచ్చెను—"

"ఏమియో సత్వర మెఱింగింపుము."

"దేవా! బైరక్తరు పాషా యను ప్రసిద్ధయోధపుంగవుఁడు బల్గేరియా దేశమునందలి సైన్యములన్నింటి నాయత్తపఱచికొని రయంబున నరుదెంచువాఁడు."

తదవసర సంతోషాతిరేకమున గడ్డము సారించుచు వజీ రిట్లు లనెను.—"అల్లాకుఁ బదివేల వందనములు! బైరక్తరు పాషా స్వామి భక్తిపరాయణుఁడు. కొన్ని సంస్కరణములు ప్రవేశపెట్ట నెంచిన సలీముసుల్తాను దుర్మదాంధులగు జనీజరీ లెదిరించు నవకాశము లేకుండవలయునని ఎంచి స్వీయసైన్యసమేతముగా రావలయునని బైరక్తరు పాషాకు వర్తమానమంపెను. ఆమహనీయుఁ డిప్పుడే యచట నున్న మేలు గదా!"

"వజీరు మహాశయా! పాషా మజిలీలలో దడయక హుటాహుటి నరుదెంచుచున్నాఁడు. సైన్యము డెబ్బదివేలు గలదు. అందలి లఘుసైన్యము లొక జాములో నగరము జేరఁగలవు."

రాజోద్యోగి అట్లు పలుక, దల్తబను పాషా ఇట్లు లనెను.—

"మిత్రులారా! మదీయ నిర్ణయము దైవ ప్రేరితము కావలయు. ఇఁక గాలహరణ మొనరింపక, మన సైన్యములు నిలిచియుండు నెలవున కరిగి ఈవిషయ మెఱింగింతు—సెలవిమ్ము."

పాషా యట్లు పలికి, జాలియను లూకాసులు గూడ నశ్వారూఢులై వెంట నరుదేఱ, దన హయమునారోహించి, మనోవేగమునఁ బ్రయాణమాయెను.

పాషా సందేశపరిణామ మెట్లులుండునో యని తత్సమాగతసభికు లందఱు సమానభయానుమానసంభరితస్వాంతులై నిరీక్షించుచుండిరి. అటులొక గంటకాలము గడియు సభాభవనమున లూకాసు ప్రత్యక్షమాయెను. ఆ వీరుఁడు తోడనే వజీరునకు సముచితసాష్టాంగ మాచరించి భయవినయము లుట్టిపడ విస్పష్టముగ నిట్టులనెను.—

"దేవా! దల్తబను పాషా పంచిన సందేశ మెఱింగింతు, చిత్తగింపుఁడు. ఆశ్వికదళము పాషా ముఖంబున విషయమాలించినంతనే విశ్వసనీయుఁడగు బైరక్తరు పాషా యరుదెంచుపఱకు జనీజరీలగూడక

తాటస్థ్యము వహించి యుందురనియు, ఆతని నాయకత్వము నామో దింతురనియు నభయ మొనఁగించిరి. నిదర్శనపూర్వముగా దత్తబను పాషా ఈ యుంగర మంపెను—చిత్తగింపుఁడు."

గ్రీకు యువకుఁ డట్లు పలికి యొసఁగిన ముద్రిక నందుకొని, పరి శీలించి, దత్తబనుపాషా అంపినదే యని గ్రహించి, సంతసించి వజీ రాతని నుద్దేశించి "నీ నామధేయ మెద్ది?" యని ప్రశ్నింప గ్రీకు యువకుఁడు సవినయముగ నిట్లు బదులాడెను.

"దేవా! నన్ను 'లూకాసు వాసిలో' యని పిలుతురు. నేనొక జమీందారు పుత్రుఁడను. నా జనకుఁ డాల్బేనియాయందు జీవించు వాఁడు."

"ఔనౌను. ఈ నామధేయుఁడు రాజభక్తుఁడని వినియుందుము. వసీలో! లెమ్ము. నిన్ని ప్రసిద్ధరాజాస్థానమున ద్విభాషిగా నియో గించితి."

వజీరు పలుకులు వినఁబడినంతనే లూకాసు ప్రమాన్పడెను. తన కట్టి మహాగౌరవ మలవడునని ఆతఁడు కలనైనఁ దలంపలేదు. తముద్యోగ మసాధారణ మైనదగుటచే, నచటి రాజోద్యోగు లాతని నెంతయు నభినందించిరి. ఆ ముహూర్తముననే జూలియును అరు దెంచి, సవినయముగ వజీరునకు సాష్టాంగ మాచరించి, అశ్వికదళ మువలెనే కాల్బలమును ఫిరంగిదళమునుగూడ బైరక్తరు పాషానాయ కత్వము నామోదించిరని తెలియఁబఱచెను. తన మిత్రుని వలె నాతఁడును నిదర్శనముం బ్రదర్శింప, ప్రధానామాత్యుఁ డమందా నంద కంపితహృదయుఁ డాయెను. అనంతరమా యువకుని నామధే యము బ్రశ్నింప నాతఁ డిట్లు విన్నవించెను.—

"నన్ను జూలియను మెరీడాయని పిలుతురు: ధనవంతుఁడగు నొక వర్తకుని కుమారుఁడను: మేము 'లెస్బాసు' దీవియం దుండు

వారము.”

“ఔనౌను. నీ జనకుఁడు ధనవంతుఁడనియు, యోగ్యుఁడనియు వినియుందుము. మెహిడా! శుభవార్త దెచ్చితివి—నిన్ని యాస్థానమున రెండవ ద్విభాషిగా నియోగించితి.”

తన మిత్రుఁడగు లూకాసువలె నాతఁడును ఆనందపరవశుఁడాయెను. లూకాసును, ఇతర రాజోద్యోగులును ఏకకంఠమున నా యదృష్టవంతు నభినందించు నవసరమున, ఫిరంగిబండ్ల ధనధనధ్వానములును, అశ్వికదళరింఖానినాదములును, పదాతుల దడదడలును, ఇతరసైనికారవంబులును విస్పష్టముగ వినవచ్చెను. స్వీయసంరక్షక సేనాముఖంబున దల్తబను పాషా యరుదెంచుచుండెనని వజీరాదులకు వ్యక్తమాయెను.



## ౩౨

### మహమ్మదు సుల్తాను

వివిధఘటనాసంఘటితమగు నీరేయి మన కథాంతరపాత్రలకే గాక తురుష్కసామ్రాజ్యనగరవాసులకుఁగూడఁ బ్రసిద్ధము. సూర్యోదయమైనంతనే రాజధాని వివిధప్రవాదసంక్షుభితమాయెను. క్రమముగా యథార్థస్థితి తెలియవచ్చెను.

కాన్స్టాంటునగరము రెండు యుద్ధశిబిరముల కాలవాలమాయెను. దుర్గపరిసరము జనీజరీసైన్యసంకీర్ణము. హతభాగ్యుఁడగు సలీము సుల్తాను నిజదుర్గాంతర బాహ్యమందిరమున బంధితుఁడై యుండెను. ఆ భయంకర సైనికులు తాము సృష్టించిన ముస్తఫా రాజత్వమునిలుప

వలయునని దృఢనిశ్చితులై, అప్రమత్తులైయుండిరి. ఏఁబదివేలసంఖ్య గల ఇతరసైన్యములు బైరక్తరుపాషా యరుదెంచువఱకు నగరశాంతి భంగపడకుండ కాపాడుదుమని యొడఁబడి, తాత్కాలికముగ దల్త బనుపాషా నాయకత్వమున వజీరు భవనము చుట్టు విడిసియుండిరి. వారు సింహాసనచ్యుతుడైన సలీము పక్షముగాని, జనీజరీసేనాపరి కల్పితచక్రవర్తియగు ముస్తఫాపక్షముగాని వహింపక, ఔదాసీన్యము వహించి, ఈలోన నమాత్యాదిపూర్వరాజక్షేమంకరుల కే యపాయము వొరయకుండ గావలియుండుటకు సంసిద్ధులైయుండిరి. జనీజరీనాయకుఁడగు ఆగాకుఁ దమ నిశ్చితాభిప్రాయము వారు తెలియఁబఱచిరి. ఆసైన్యములు తప్పక తమతో నేకీభవించునని విశ్వసించియుండిన జనీజరీల హృదయమంతఁ గొంతకంపించెను. ఐనను, ఆసైనికులు తీవ్రపడి వారిం దమదెస ద్రిప్పుకొనునెపంబున వారిని దాఁకక, సహనము వహించి మిన్నకుండిరి. ఏమన, దల్తబను పాషా సాధారణవ్యాపారముల జడుఁడయ్యు, రణవ్యాపారపారంగతుండగుటచే సముచితసన్నాహము లతిరయంబున నొనరించి, అప్రమత్తుఁడై యుండెను. నిజప్రతిభావిశేషంబున నావీరవరుఁడు వజీరు భవనమును దుర్గప్రాయముగ, వైరిజనదుర్భేద్యముగ నొనరించెను. ఆనాయకుఁడు బయలుప్రదేశముల నాక్రమించి, వీధిమొగలందు శతఘ్నులు నిలిపి, సముచితవ్యూహము బన్ని సహస్రనయనములతోఁ గావలియుండెను.

ఉదయసమయమున బరిస్థితు లటులుండెను. ఇఁక ననంతసేనాముఖంబున నరుదెంచు బైరక్తరుపాషా ఎటు లాచరించునో యెఱుంగక, పలువురు పలువిధము లాడఁదొడంగిరి. సలీముపాదుషా రెండు మూడువారముల క్రిందట నంపిన ఆజ్ఞననుసరించియే ఆపాషా యరుదెంచువాఁడని ఎవ్వ రెఱుంగరు. ఆరహస్యము వజీరొక్కఁడే ఎఱుం

గును. బైరక్తరుపాషా సలీము పక్షపాతియని కొందఱును, అట్లు కాన్పించినను నమ్మరాదని కొందఱును, ఆతఁడు తప్పక ముస్తఫా రాజత్వ మామోదించునని మఱికొందఱును ఊహించిరి. మూడవ యూహయే సమంజసముగఁ గాన్పించెను. ఏమన, బలవంతులును మూర్ఖచిత్తులును నగు జనీజరీలు సలీమును సింహాసనభ్రష్టు నొనరించి ముస్తఫాను అందు నిలిపి ఆతని రాజత్వము సుస్థిరమొనరింపఁ జలము వహించియుండిరిగదా. మఱియు నితరసైన్యములు బైరక్తరుపాషా నాయకత్వ మామోదించి మెలంగుటకు సిద్ధముగనుండెను. ఇట్టి సంకటసమయమున నాపాషా జనీజరీపక్ష మవలంబించెనేని, రక్తపాతము లేకుండ కార్యము సులువుగాఁ జక్కబడును.

మధ్యాహ్నమగుసరికి బైరక్తరుపాషా లఘుసైన్యములు రాజధానిప్రాకారముల క్రింద గోచరించెను. మఱిరెండుగంటలలో నా మహాసేనావాహిని అంతయు దృగ్గోచరమాయెను. ముం దేమగునో యని పురజనులెల్లరు మిక్కిలి తహతహలాడిరి. జనీజరీ సేనానాయకుఁడగు ఆగా ఒకదూతను జేరి బైరక్తరుపాషాకు సందేశమంపెను. నగరపరిస్థితుల నెఱుకపఱచి, ముస్తఫా రాజత్వ మామోదింపవలయునని అర్థించి, ప్రధానామాత్యపదవి వహించి సామ్రాజ్యము శాసింపవలయునని పాషాను ఆగా కోరెను. ఆసమయముననే వజీరు మంత్రివర్గములో నొక్కని బైరక్తరుపాషాకడ కంపెను. ఆమహనీయుఁడు జనీజరీల దూతను గాంచినంతనే కుపితుఁడై, గర్వితుఁడగు ముస్తఫాను దొలగించి, సలీమును బునఃప్రతిష్ఠ నొనరింపవలయునని కఠినముగఁ బ్రతిసందేశ మంపెను. వజీరు దూతకు సుస్వాగత మొసంగి తా నెన్నటికిని సలీము పక్షపాతినేయని ఆతఁ డెఱింగించెను. ఆదూత దస్తుబనుపాషాకు ఒక జాబు కొనివచ్చెను. అందు ఖాలీలుని నామాక్షరములు కాన్పించినంతనే, ఆప్రభు వానందకంపిత

హృదయుఁడై, తత్తరంబున విప్పి ఇట్లు చదువుకొనెను.

"ప్రియమిత్రమా! నీప్రవర్తన మెంతయు శ్లాఘనీయము. నేను బైరక్తరుపాషా శిబిరమున నుంటినని ఈలేఖవలనఁ దెల్లమగును. సలీముపాదుషా విజయుఁడు గావలయు. దృఢతమవిశ్వాసబద్ధుండవై శక్తివంచన లేకుండ కృషిసల్పుము: శుభము తప్పక ప్రాపించును. ఉదారహృదయా! నే నొనరింపవలసినకార్య మొనరించి కృతకృత్యుఁడఁ గాఁగలను.

భవదీయ ప్రియమిత్రుఁడు.

ఖలీలుఁడు".

గుణగరిష్ఠుఁడగు ఖలీలుఁడు క్షేమముగనుండెనని తెలిసినంత నే పాషా మిక్కిలిసంతసించెను. అందనుక నాయపూర్వపూరుషున కెట్టి యపాయము వాటిల్లెనో యని ఆతఁ డెంతయుఁ దల్లడిల్లుచుండెను. బైరక్తరుపాషా సందేశముతోడనే ప్రచురింపఁబడెను. దల్తబను పాషా వేయిప్రతులు దీయించి, తన యధీనముననుండు ప్రతి నాయకున కొకటి అందఁజేసెను. ఆ యా నాయకు లా సందేశము దమ సైనికులమ్రోలఁ జదివి వినిపించిరి. తోడనే అమ్మహాసేనావాహిని రోదసీకుహర మదరునట్లు లేకస్వరమున "సలీముపాదుషాకుజే!" యని ఘోషించెను. వివిధసైనిక నికాయములను శాసించు ప్రధాన నాయకులు దల్తబనుపాషా ఆజ్ఞ కెదురాడక మెలంగుదుమని తదవస రోచితోత్సాహతమకమున సమయ మొనరించిరి.

కాని, తత్ప్రసిద్ధదినాంతమున, రాజ్యభ్రష్టుడైన సలీముపాదుషా వధ్యుఁడాయెనని దారుణముగఁ దెలియవచ్చెను. కుమారుఁడగు ముస్తఫా ప్రోత్సాహమునఁ గ్రూరాత్ములగు జనీజరీలు మదిరము తలకెక్కఁ, నటు లాచరించిరట! నిజమగునా? సలీము విగతజీవుఁ డాయెనని జనీజరీలే ప్రకటించుచుండుటచే ననుమానమున కెడము

లేకుండెను. తోడనే నగరమున హాహాకారము లుదయించెను. స్వామిభక్తిపరాయణులగు సైనికు లా యమానుషకృత్యము సైపఁజాలక నితాంతక్రోధప్రకంపితులై, బైరక్తరుపాషా యరుదేఱువఱకు దాళఁజాలక, తామే జనీజరీలను దాఁకవలయునని తదవసరావేశమునఁ దత్తరపడిరి. వజీరునాజ్ఞవడసి దల్తబనుపాషా తోడనే రణాభిముఖుఁడాయెను.

జనీజరీలు సముచితసన్నాహము లొనరించికొనియే యుండిరి. వారు దుర్గమునందును నౌకాశ్రయమునందును తదితరస్థలములనుండు బలిష్ఠశతఘ్నుల నాయత్తమొనరించుటయేగాక మఱికొంత సైన్యముగూడ సమకూర్చుకొని అధికతరబలవంతులైయుండిరి. వారి సంఖ్య ఇపుడేఁబదివేలాయెను.

సూర్యాస్తమసమయమున యుద్ధము భయంకరముగఁ బ్రారంభమాయెను. నిరంతరము గలకలలాడు రాజధాని దారుణావిరళశరమారణమున కాలవాలమాయెను. భయంకరజలధరంబు లన్నియు నొక్కచోఁ బ్రోవైనట్లు లెషతెరిపిలేక గర్జించు శతఘ్నీరవంబులచే నగరము ఘూర్ణిల్లఁజొచ్చెను. దల్తబనుపాషా నిజసమరకౌశలమచ్చుపడ శక్తివంచనలేకుండ పాటుపడెను. రాజభక్తియుతులగు సైనికులు భయమెఱుంగక దీక్షమెయి బోరాడిరి. కాని, జనీజరీలు బలసాహసంబులు మఱియు బ్రశంసనీయముగనుండెను. వారియవస్థ కడు నపాయకరముగనుండెను. అపజయము ప్రాప్తించునేని, తమకు మరణమే శరణ్యముగాని, తా మొనరించిన రాక్షసకృత్యమునకు వేఱుపరిహారములేదని వా రెఱింగియుండిరి. ఆకారణమున నాసైనికులు ప్రాణములపై నాసవీడి హోరాహోరి పోరాడిరి. దల్తబను మూఁడుసారులు వెనుదిరుగవలసినవాఁడాయెను. ఇంకను ఆతాపున నిలిచియుండుట అతిసాహసము, కేవల మవివేకమని యెంచి ఆమహా

నీయుఁ డాహావరంగమునుండి మఱిలనుండిన సమయమున బైరక్తురు పాషా సైన్యము లరుదెంచెను.

తోడనే డీలువడిన రాజసైన్యములు నూతనోత్సాహము వహించి పోరాటమునకు దొరకొనెను. విప్లవకారులగు జనీజరీలు అనంతరిపుసేనా పరివృతులై అవిరళశస్త్రాస్త్రములకు గుఱియైరి. బైరక్తరు పాషావృద్ధుఁడయ్యు భీమబలుండై విజృంభించెను. వీరుఁడగు ఖాలీలుఁ డాతని పార్శ్వముననుండి రిపుజనభయంకరుండై వెలింగెను. దల్తబను పాషా గ్రీకుయువజన మధ్యస్థుఁడై వేఱొకతావున వైరిజనకాంతారమును దహింపఁ జేయఁ దొడంగెను.—"సలీము మరణమునకు బ్రతిక్రియ యగుగాక!"—"సింహాసనమాక్రమించిన దుష్టాత్ముఁడు—ముస్తఫా మరణించుగాక!"

"మహమ్మదు పాదుషా చిరతరాయురారోగ్యభాగ్య మనుభవించుగాక!"—అట్లు బైరక్తరు పాషాసైన్యములఁ జెలరేగు నిరంతరధ్వానములకు నట్టులే దల్తబను పాషా సైన్యమునందుఁ బ్రతిధ్వనులు వెలువడెను.

సమరమా తీరున సంకులముగ జరుగుచుండెను. నిశీథసమయమున బైరక్తరు పాషా నిజప్రత్యేకసైన్యపరివృతుఁడై తద్రంగమునుండి తొలంగి, నిరోధింపఁగడంగు వైరులఁ జెక్కాడి రాజాంతఃపురము జొచ్చి, పితృఘాతుకుఁడగు ముస్తఫాను గాంచెను. ఆదౌర్భాగ్యుఁడు బైరక్తరు పాషాను జూచినంతనే భయవిహ్వలుఁడై, స్వీయసంరక్షణార్థమా ధీరవరుని చరణముల నాశ్రయించెను. పాషా క్రోధఘూర్ణమానమానసంబున నిట్లు గర్జించెను.—

"ఓరి తులువా! పితృఘాతుకుఁడా! రాజద్రోహీ! దేశద్రోహీ! నినుబోలుపాపాత్ముఁడు తగినఫల మనుభవింపక మనఁజాలఁడు!"

ముస్తఫా యిరువదియారేండ్ల యువకుఁడు. రాజ్యమాసించి తన

జనకుని మరణమున గొడంబడెనే గాని, ఆతఁడు పౌరుషమొలికించిన వీరుఁడు కాఁడు. ఎట్లయినఁ దన ప్రాణము నిలుపుకొననెంచి మోఁకరించి దీనాతిదీనస్వరంబునఁ బ్రార్థించెను. పాషా యిట్లు గర్జించెను.-

"ఓరీ! నీనేరము సైరింపరాదు. సైరింతుమేని విప్లవమును, చౌర్యమును, పితృఘాతమును బ్రోత్సహించుటయగు—సైనికులారా! చూచెదరేల?"

తోడనే పదివంద్రెండు ఖడ్గము లొక్కసారి మెఱసి, ముస్తఫా దేహము ఛేదించెను. తత్క్షణము "మహమ్మదు సుల్తానుకు జే" యను ధ్వనులచే నా యంతిపురంబంతయుఁ బ్రతిధ్వనించెను.

ఈలోన తండోపతండములుగఁ బైరొను వైరిచమూనివహంబుల కోహటించి జనీజరీలు దారుణసంకల్పధురీణులై, కడు విశాలమగు మందుగుండుగిడ్డంగిచుట్టుం జేరి ఉత్తమశతఘ్నిసాహాయ్యంబున రాజసేనలను భస్మీభూత మొనరించుచున్నారని బైరక్తరు పాషాకుఁ దెలియవచ్చెను. ఆ వీరవరుఁడు తోడనే అటు బోయెను. దయ్యములవలెఁ బోరాడు జనీజరీల నాసలమునుండి మఱల్పవలయునని దల్తబను పాషా కడుంగడు బ్రయత్నించుచుండెను. గాని, నిరర్థకమాయెను. జూలియను లూకానులు పాషా చెంతనే యుండి నిరుపమానధైర్యస్థైర్యములతోఁ బోరాడుచుండిరి. కాని జనీజరీల బలసంకల్పము లమోఘముగ నుండెను: తాము సృష్టించిన ముస్తఫా తెగటారెనని తెలియవచ్చినను జలింపక, ద్విగుణీకృతబలస్థైర్యములతో శత్రుసంహార మొనరింపఁ దొడంగిరి.

జనీజరీ వ్యూహము ఛేదింపవలయునని బైరక్తరు పాషా ప్రయత్నించెను. మందు గిడ్డంగి ముందఱ బాలచంద్రాకృతి మువ్వాగుస తేర్పడి వారు నిర్వక్రపరాక్రమము బ్రదర్శించుచుండిరి. సముద్రతరంగములవలెఁ బఱతెంచు బైరక్తరుసైన్యముల నావంతయు సాగ

సేయక జనీజరీ లచలాకృతిఁ దాల్చి నిలిచి ప్రచండరిపుజనోచితస్వాగత మొసంగిరి. పాషా మహావీరుఁడయ్యు, మఱల వలసినవాఁ డాయెను. ఈలోన, ఖలీలుఁ డొక సేనాముఖంబున బాఱి వైరుల౦జుట్టి తత్సేనా పార్శ్వము నాకస్మికముగ భేదింపవలయునని ప్రయత్నించెను. ఆ ప్రయత్నమును వ్యర్థమాయెను.

దల్లబను పాషా బైరక్తరు పాషా చెంతకరుదెంచి తామిఁక జయము గాంచుట కల్లయని దైన్యముగఁ బలికెను. బైరక్తరుగూడ నా విషయ మెఱింగియే యుండెను. ఐనను, ఆ ధీరోదాత్తచిత్తుఁడు విహ్వలింపక, ఇట్లనెను.—"ఆర్యా! మన దురవస్థ విస్పష్టము. ఐన నేమి?—ఒక ఉపాయ మాలోచించితి. నీవు సత్వరమేగి మందు గుండు గిడ్డంగి చెంతనుండు మన సైన్యములను స్థలాంతరమునకు భద్రముగఁ దఱలింపుము. ఆలసింపకుము.—మహాత్మా!తోడు— మదాజ్ఞానుసారము మెలంగుము—పొమ్ము!"

నిజసైన్య సమేతుఁడై దవ్వునకుఁ బోవలయునని ఖాలీలునకుఁ గూడ నా పాషా వర్తమానమంపెను. అనంతర మావీరవరుఁడు తన యిచ్చకువచ్చు నైదువందల అశ్వికదళమును మాత్రము దన చెంత నుంచుకొని తక్కుంగల రాణువ నవ్వలకంపివైచెను. బైరక్తరు పాషా అభిప్రాయమేమి కావలయు ?

తదల్పసేనా ముఖంబున నా మహావీరుఁడు వాయువేగమునఁ బాఱి, నిశాచరసన్నిభులగు జనీజరీలను దాఁకఁ గడంగెను! ఫిరంగి గుండ్లు సంతతధారా పాతముగ గుఱియుచుండెను; సైనికులు క్రమముగా తారున మరణించుచుండిరి; తుపాకి గుండ్లు బైరక్తరు పాషా చుట్టును జివ్వు జివ్వునఁ బాఱుచుండెను. ఐన నా వీరాగ్రేసరుఁ డించుకేనియు జలింపక, శరవేగమున బోదొడంగెను. హతశేషులగు సైనికులు గూడ దత్సమాన ధైర్యముతోఁ బాఱిరి.

బైరక్తరు పాషా అంత సింహనాదమొనరించి, మహానగమును భేదించు పిడుగువలె నొకటి జనీజరీ శ్రేణిఁ జించి, ఉన్మాదునివలె నింకను బోఁదొడంగెను. రాజభక్త్యావేశముననో, లేక, తన స్వామి ధైర్యస్థైర్యములు దనకు నలవడుటచేతనో—ఆతని వారువముగూడ నిశ్చలతీవ్రగమనము వీడకుండెను. రాజ సైనికులు పెక్కండ్రు మలమల మాఁడి మ్రగ్గుచున్నను, సజీవులు మాత్రము విపరీతావేశమునఁ జేయఁగల శత్రుసంహార మొనరింపుచు దమ నాయకుననుగమించిరి. సముత్తుంగ తురంగారూఢుఁడై, జరామరణ రహిత దివ్యపురుష సన్నిభముగ గండు మీఱి అనుక్షణ మొక పదిమంది జనీజరీలను గూల్చు నామహావీరుని బలధైర్యసాహసములు కేవల మనుష్యసాధారణముగ నుండెను. జనీజరీల రెండవశ్రేణియు విచ్ఛిన్నమాయెను. భయంకరశత్రు జనమధ్యమున స్వైరవిహార మొనరించు నావీరవరుఁడు తేజోమయుఁడై దుర్నిరీక్షుఁడై, అప్రతిహత దండధర సన్నిభుఁడై దీపించెను. సమున్నత గంభీరాకారము, రక్తానల సన్నిభనయనములు, భయంకర మానవరుధిరార్ద్రవస్త్రములు, నిశ్చలతటిల్లత సమానకరవాలమును జనీజరీల నధీనుల నొనరించెను. అంత తృతీయశ్రేణి గూడ విచ్ఛిన్నమాయెను. గిడ్డంగి సమీపమాయెను.

గిడ్డంగి సమీపించినంతనే పాషా తన యశ్వమును నిలిపి, పుడమికి లంఘించుచు నాతావునఁ గాఁపుండు జనీజరీని ఒక్కవ్రేటున ఖండించి, చేఁజిక్కిన ఫిరంగి గుండు గట్టిగబట్టి, వైచియున్న ద్వారమునఁ దన బలిమి కొలఁది విసరెను. తత్కవాట మహోమయ మయ్యు, భూరిధ్వానమున వివృతమాయెను. అంత నామహావీరుఁడు సింహనాదమొనరించి, అచ్చటి సైనికులెల్లరు నాలించునట్లు 'మహామ్మదు సుల్తానుకు జే,!' యని అఱచి, నిర్భయముగ నాగిడ్డంగి బ్రవే

శించెను! ఆహా! ఆమహనీయుని సంకల్పమేమి కావలయు?

పాషా యందుఁ బ్రవేశించి ఒక్కనిముసమాయెను. జనీజరీలు దురంత విస్మయభయాకులచిత్తులై చూచుచునే యుండిరి. అంతలో నెంతటి ఘోరము! పదివేల ఫిరంగు లొక్కసారి మ్రోఁగినట్లు, ప్రళయకాల మాసన్నమైనటు లొక మహానినదము వినవాయెను. బహుక్రోశ విస్తీర్ణమగు నామహానగరము భయంకర భూకంపముననో యన దారుణముగఁ బ్రకంపించెను. ఆక్షణము పెనుమంట యొండు రయంబున మింటికెగయ, ననంతాకాశము నిరవకాశమాయెను. అన్యసాధనాసాధ్యమగు నాగిడ్డంగితోడనే తుత్తునియలాయెను. ఆహా! ఆభయానక దృశ్యము వర్ణనాతీతము! యుగాంత ప్రళయావసర భయంకర నిర్ఘాతనిర్ఘోషమున సమున్నతపర్వత ప్రాయముగ మిన్నంటు నామహాజ్వాలయందు రూపుసెడిన మానవాకృతులు వేనవేలు గోచరించెను. ఇరువదివేలు జనీజరీలా తెఱంగున నొక్క ముహూర్తమున నశించిరి!

పరిదేశమంతయు గొన్నినిమిషములు కడుభయంకరముగఁ బరిశాంతమాయెను. నిజామేయబలధైర్యస్థైర్యసమంచిత రాజభక్తికి సాక్షీభూతముగ బైరక్తరుపాషా వీరస్వర్గము వడసెను. అతని యిరువంకలసైనికులుగూడ నిరుపమానసాహసము ప్రదర్శించి మరణించి చిరతరయశోవిరాజితులైరి. బలవంతులగు జనీజరీలను జయించుట కయ్యదె తరుణోపాయము. తోడనే, దల్లబనుపాషా యొకవంకను, ఖలీలుఁ డొకవంకను రయంబునఁ దమ సైన్యముఖంబుల బరాలు దేఱి మిగిలిన విప్లవకారులను దాఁకఁబోయిరి. కాని, బలధైర్యము లుడిగిన ఆసైనికులు శస్త్రములుపీడి, మోకరించి, క్షమాభిక్ష నర్థించిరి. అట్టికార్యమున పాషా నిమగ్నుఁడై యుండ, రాజదూతయొకఁ

డుకు డెంచి, సవినయప్రణామము నాచరించి, ఇట్లు లనెను.—

"మహానీయా! మహమ్మదు పాదుషావారు నిన్నుఁ దమ సర్వ సైన్యాధిపతిగ నియమించిరి. మఱియు, భయాతిరేకమున నాయుధ విసర్జన మొనరించిన విప్లవకారులను క్షమింపవలయునని పాదుషా వారు నాముఖంబున నాజ్ఞాపించుచున్నారు. పాదుషావారు నిజామా త్యాది ప్రసిద్ధజనసంకీర్ణసభాభవనమున సింహాసన మారోహించు వారు. ఈలోన నగరమున శాంతి నెలకొల్పి నీవు తత్పాలన మొన రింపవలయు. మగుడ పాదుషావారి ఆజ్ఞ యగునంతనే, వారి దివ్య సముఖమునకు నీవరుదేఁజవచ్చును."

అట్లు పలికి దూత వెడలినంతనే, జూలియను లూకాసులు, రాజ సన్మానముగాంచిన పాషాను అభినందించిరి. కాని, పాషా యొకతా వున నిలిచి ఆనందించుట కవకాశము లేదు. అశ్వారూఢుఁడై విప్లవ కారుల శ్రేణులంటఁబాఱుచు వారి నాతఁడు గద్దించి రాజభక్తిపరా యణుల నొనరించెను. ఆతని గంభీరోపన్యాసము నాలించి జనీజరీ విప్లవకారులు చకితులైరి. నిరుపమానమగు నాపాషా వచోరచన ప్రావీణ్యము గాంచి గ్రీకుయువకులు కడు విస్మితులైరి. సమరశూరుఁ డగు నాతురుష్కప్రభువు తత్సంబంధకృత్యము లన్నిటియందు నఖండవిజ్ఞానము సహజముగఁ గలిగియుండెను.

హతశేషులగు జనీజరీలు చచ్చిన తమవారలకై కడు గుందుచు, తా మొనరించిన దౌష్ట్యము దలంచి పరితపించుచు దమతమ సేనా నిలయములకుఁ బోయిరి. రాజభక్తిపరులై పోరాడిన సైనికులతో దల్లబడుపాషా క్రొత్తపటాలముల నేర్పఱచెను. ఆమహానీయుఁడు విధివిరామ మరయక దీక్షమెయి పాటుపడుటచే నాయూపనులన్నియు రెండుమూడుగంటలలోఁ బూర్తియయ్యెను. నగరమున శాంతి సుప్రతి ష్ఠితమాయెను.

దల్లబనుపాషాకు అంతట చిత్తశాంతి కలుగ, తన సహచరులగు జూలియను లూకాసులను గాంచి ఇట్లులనెను.—

"మిత్రులారా! మీరిక మన ఆరామమందిరమునకుఁ బోయి, అత్యంత భయాతురమున వేచియుండు కాంతల కిచటి సమాచార మెఱింగింపుఁడు—కాని, ఖలీలుఁ డేమాయెను?"

తమ మిత్రుఁ డేమాయెనో గ్రీకులుకూడ నెఱుంగరైరి. అపూర్వ మనోహరాకారుఁడు, అసహాయశూరుఁడు, స్వార్థరహితుఁడు, త్యాగశీలుఁడు, అన్యజనాసాధ్యమేధాసంపన్నుఁడు, పురుషకుల ప్రదీపకుఁడు ఖలీలుఁ డేమాయెను? వారి యుత్సాహ మంతరించెను, హృదయము వికలమాయెను. అట్టి సమయమున, ఖలీలుని సేవకుఁడు సదకుఁడు గోచరించి సవినయముగఁ బ్రణమిల్లి, సగౌరవముగ నిట్టులనెను.—

"ప్రభువర్యులారా! నాస్వామి ఖలీలు మహాశయుల క్షేమసమాచారము దెలుపు వాఁడను. ప్రస్తుతము తన కార్యములందు నిమగ్నుఁడై యున్నకారణమున దానరుదేఱజాల నైతినని తెలుపమనెను."

ముకుళించిన పాషాహృదయము తోడనే వికసించెను. జూలియను లూకాసులు గూడ నానందపరవశులైరి. వారాతావున సిఁక దడయఁజాలక పోయిరి. పాషా క్షేమసమాచార మాతని భార్యకును పుత్రికలకును దెలుపవలయును: తమ రాకకై కడు దత్తరంబున వేచియుండు నమ మనోహారిణుల కానంద మొదవఁగూర్చి, తాము ను ఆనందింపవలయును: మఱియు, జనకుఁడగు కదీస్కాఁరుఁను మృత్యుముఖమునుండి తొలంగి క్షేమముగ నుండెనని జులేఖాకు నివేదింపవలయును.

దల్లబనుపాషా రేయి యంతయు బహుకార్య నిమగ్నుఁడై

అప్రమత్తుఁడై యుండెను. సముచితసైనికజనపరివృతుఁడై యాతఁడు నగరవీథులందుఁ దిరుగాడి, వివిధసైనికనిలయములు దర్శించి, సామ్రాజ్యాంతర సకలసైనికనికాయముల సమక్షమునఁ జదువవలసిన ప్రకటనలు తయారుచేసి, పాదుషావారి దూతమగుడ నెపు డరుదెంచునో, తాను రాజసభాభవనమే ముహూర్తమునఁ బ్రవేశింపనగునో యని ఉవ్విళులూరుచుండెను.

మఱియొక విషయము గమనింపవలయు. గ్రొత్తపాదుషావారిని దల్తబను పాషా ఎన్నఁడు గాంచి ఎఱుంగఁడు. కారణమేమన, పాదుషాపుత్రు లన్యుల కంటఁబడువారు కారు. అమాత్యాది ఉన్నత రాజోద్యోగులు సహితము వారినిఁ జూడఁజాలరు. అంతఃపుర కామినీ జనంబుల వలె వారు నొక ప్రత్యేకమందిరమున నడంగి యుండుట నాఁటి తురుష్కసాంప్రదాయము. విద్యగఱపు గురువులు మాత్రము వారి నెఱుంగుదురు. ఆ కారణమునఁ గ్రొత్తసుల్తానును పాషా మున్నెన్నఁడు గాంచి యెఱుంగఁడు.

ఉదయ మేడుగంట లైనంతనే రాజదూత అరుదెంచి, ఎనిమిది గంటలకుఁ బాదుషావారిని పాషా సందర్శింపవలయునని తెలిపి వెడలెను. పాషా ఆనందమునకు మేఱలేదు. ఆతఁడు తోడనే స్నానాది కృత్యములు లాచరించి, నిజాధికారలాంఛనవస్త్రధారణ మొనరించి, అంగరక్షకపరివృతుఁడై, అమితోత్సాహపూరితహృదయుఁడై రాజసభకుఁ బ్రయాణ మాయెను. తదంతర రాజోద్యోగి ఆ మేటి ప్రభువునకు సముచితస్వాగత మొసంగి, నవరత్నఖచితము సువర్ణకోశస్థము నగు ఖడ్గము నొసంగి, పాషా అంగరక్షకుల నటనిలిపి, వివిధవస్తుసమృద్ధమై వైభవసమన్వితములై యొప్పు మందిరము లనేకము లాతని దాటించి, ఒక మందిరద్వారమున నిలిపి యిట్టులనెను.—

"ప్రభువతంసమా! ఈ మందిరమున వేచియుండుడు. పాదుషా

వారిత్రను దిర్చిన మొసంగుదురేమొ అరసివచ్చెదను."

ఆ రాజోద్యోగి చూపిన మందిరమునందు దత్తబసుపాషా ప్రవేశించెను. జులేఖా తైరజా గుల్నేరులును, జూలియును లూకాసులును అందే సుఖోపవిష్టులై యుండిరి. వారిని గాంచినంతనే పాషా విస్మయానందపరవశుండై ఒక్కొక్కరిని గాఢాలింగన మొసరించి ప్రశ్నింపదా మేతెంచిన తెఱంగు వారెఱింగించిరి. సూర్యోదయము కాకమున్నె రాజభటుం డొకండు పాషా ఆరామమందిరమునకుం బోయి, దర్బారునందా ప్రభువు అమేయుండతి రాధికారధురుడ్యుం డగు గావున రావలయునని ఆహ్వానించి ఆ యువతీయువకులను గొనివచ్చెను. వారా మందిరమున వేచియుండిరి.

ఆ సమాధానము ముగియునంతలోం దొంటి రాజోద్యోగి మగుడ నరుదెంచి సగౌరవముగ బ్రణామ మాచరించి పాదుషావారి సముఖమునకు దయచేయుండని వారి నాహ్వానించెను. తోడనే జులేఖా తైరజా గుల్నేరులు తమ సుందరవదనములు తదుచిత వసనాచ్ఛాదితము లొనరించిరి. ఐనను, పాలబుగడబోలు కడు సన్నని మేలుముసుంగులం దడంగియు, నాయాననము లపురూపరూపవైభవోపేతములై దివ్యనారీమణులను స్మరణకుం దెచ్చుచుండెను. ఆ కాంతారత్నముల వస్త్రధారణము గూర్చి గడుంగడు ప్రశంసనీయముగ నుండెను: పాషా కడు ముదమంది గర్వించి యుండందగును. నిజమనో కాంతల నా సమయమునం గాంచు జూలియను లూకాసుల యానందము నిరవధికము. ఖాలీలుండచట నుండెనేని, జులేఖాను గాంచి అతండును విస్మయానందపరవశుండై యుండును.

అంత వారందఱు నా రాజోద్యోగిని వెంబడించి, అమూల్యవస్తుసంభరితమందిర శ్రేణు లతిక్రమించి,అందందుం బరిభ్రమించు సేవకబృంద మొనరించు ప్రణామము లందుకొని, క్రమముగాం గొల్వు

కూటను జొచ్చిరి.

అనంతమై, అపూర్వాలంకారవిరాజితమై, వైభవసమన్వితమై యొప్పు సభాభవనమున మహమ్మదుపాదుషా సమున్నతచారుతర సింహాసనారూఢుండై యుండెను. మంత్రిజనాదిప్రముఖులు తమ తమ తావుల నాసీనులై యుండిరి. సుల్తాను ధరించిన వస్త్రభూషలును ఉష్ణీషమును కాంచనమయములై, వివిధమణిఖచితములై చారుతరంబులై యుండెను. సార్వభౌమశిరోవేష్టనమున కంటియున్న తురాయి యందలి వజ్రములు సముజ్జ్వలముగ మెఱయుచు, సహజ తేజోమయ వదనము నధికతరభాసుర మొనరించెను. నాటి సాంప్రదాయము ననుసరించి, పాదుషా సుప్రసన్నుఁడై ప్రశంసించువఱకు సభాంతర్గతులు మోమెత్తి చూడరాదు. ఆ కారణమున పాషా మొదలగు వార లవనతవదనులై, ఏగి, సింహాసనమున కిరువదియడుగులు దవ్వుగ నిలిచి సాష్టాంగమాచరించిరి. తోడనే, సుల్తా నిట్టులనెను—

"మిత్రులారా! లెండు! మనము కలియవలసినవిధంబిది కాదు!"

ఆహా! ఏమాస్వరము! పౌరుషమయము—మంజులము—అభిమానపూరితము--చిరపరిచితము! దల్లబను జూలియను లూకాసుల హృదయములును, తైరజా గుల్నేరుల హృదయములును పరవశము లాయెను. జులేఖా మాత్ర మా తెఱఁగున బరవశాత్మ కాలేదాయని పాఠకులు ప్రశ్నింతురుగాక. ఆ కన్యాలలామ నిరుపమానంద ప్రకంపితహృదయయయ్యు, దన మిత్రులవలె విస్మయావేశమున మూర్ఛపడకుండెను. తక్కుంగలవారు మోమెత్తి తిలకించునంతనే— ఎంతవిపరీతము!—స్వప్నముకాదు!—తమ చిరమిత్రుఁడు ఖాలీలుఁడే తురుష్క-సామ్రాజ్యసింహాసనమున గోచరించెను!

నిండోలగమునఁగల మహమ్మదు సుల్తాను రయమ్మున సింహాసనముడిగ్గి, ఇంకను మోకరించియున్న తన మిత్రులను లేవనెత్తుచు న్నై

వారినిఁడాసి, నిజహృదయాభిమాన మచ్చుపడఁ దనకర మొక్కొకరి కందిచ్చెను. తత్కరపీడనమున, దమ ప్రణామము నవిచ్ఛిన్నము, నవిరళమునని జులేఖా ఎఱింగి, లోలోన సంతసించెను.

వనితలు పాదుషావారియెడఁ జూపవలసిన మర్యాద ననుసరించి తమ ముసుఁగులను బోఁద్రోచిరి. నిజమనోహారిణియగు జులేఖా యనాచ్ఛాదితవదనమును మహమ్మదుపాషా భావగర్భితముగఁ దిలకింప, నామాసిని విశాలవినీలనయనములు ప్రేమయానందభాసురములాయెను: తదనూనవికాసము సహజసుందరాననమున గూడ ద్యోతకమాయెను. పాషా నుద్దేశించి సుల్తానిట్టులనెను.—

"ప్రభువతంసమా! నాకాతిథ్య మొసంగి, అనంతర మెంతయేని సేవసలిపిన నీకు నేను కృతజ్ఞుఁడను. ఈ నగరరంగమునం దాకస్మికముగఁ దోచిన భయానకనాటకమున నీవ మున్ముందు రాజభక్తిపరాయణుఁడవై అస్మదీయమదభ్రష్టభ్రాతృరాజత్వము నిరసించి, ఆహవమున ధైర్యస్థైర్యములు ప్రదర్శించి, కీర్తిపాత్రుఁడవైతివి. నిన్నీప్రసిద్ధజనసమక్షమున మాసర్వసైన్యాధ్యక్షునిగ, యుద్ధమంత్రిగను నియోగించితి."

అనంతరము గ్రీకులనుద్దేశించి సుల్తా నిట్టులనెను.—

"మిత్రులారా! మదీయ ప్రధానామాత్యుఁ డొసంగిన ఉద్యోగములందు మిమ్ము స్థిరపఱచువాఁడ. మఱియు,"—ఆతనిస్వరము మందమాయెను— వదనమున మందహాసము తాండవించెను— "కాఁగల మీవివాహముల సందర్భమున, సంతోషపూర్వకముగ నేనే విందుసేయువాఁడ."

తన మిత్రుల కృతజ్ఞతాలాపములు విననొల్లక సుల్తాను రయంబున వెనుదిరిగి, హస్తచాలన మొనరింప, నమాత్యాది ప్రధానో

ద్యోగులు చయ్యన లేచి, ప్రణామమాచరించి, అవ్వలకుఁబోయిరి. అంత సుల్తాను ప్రసన్నవదనుఁడై, నిశ్చలమధురస్వరమ్మున నిట్లు లనెను.—

“ మిత్రులారా! మనము పెక్కుసారులు కడు చనువుగఁ గలసి మెలసి ముచ్చటించియుంటిమి. ఇప్పుడు నట్లులే మెలంగుదము. ఈ సమయమున మఱియొక కథ వినిపింపఁజాలఁగాని కొంత సమాధాన మొసంగవలయు.”

అట్లు పలికిన సుల్తాను సింహాసన మారోహింపక, తనజులేఖాతోఁ బాటు ఒక సోఫా నలంకరించెను. అయ్యుదార సార్వభౌముని యభిమత మెఱింగి పాషా యొక ఆసనమున, గుల్నేరు లూకాసులు మరియొక ఆసనమునను, తైరజా జూలియనులు వేఱొక యాసనమునను ఆసీనులైరి. అయ్యది పాషా యారామమందిరాంతర సమావేశములను బోలియుండెను. మహమ్మదు సుల్తాను ఈవిధమునఁ జెప్పఁ దొడంగెను.—

“ మిత్రులారా! నాకు విద్య గఱపిన గురువులలో జులేఖా జనకుఁడు హాసేను కదీస్కారుఁడు గణనీయుఁడు. నాకాతఁడు దేశసాంప్రదాయములు చక్కగ నెఱుకపఱచెను. ఆతని యనుభవమపారము, కార్యదీక్ష నిరంతరము; ప్రవర్తనము కళంకరహితము, ఆదర్శప్రాయము; వాత్సల్యమనంతము. తండ్రివలె సాకిన ఆమహనీయునియెడ నేను దృఢతమ కృతజ్ఞతా పాశబద్ధుఁడనై యుంటి. నగరమును దారుణముగఁ గలంచిన అవిరళనరమారణమునకుఁ బ్రతిఫలముగ నగర రక్షకుఁడగు హాసేను ఘోరవిపత్తునకుఁ బాల్పడినంతనే జులేఖా నాచెంత కరుదెంచెను. ఈసుందరీమణిని మున్నెన్నఁడు గాంచి యెఱుంగను. ఈమె పితృవాత్సల్యమును మనోహరాకృతియు నిరుపమానములై నన్ను జకితు నొనరింప, నాశక్తి కొలఁది బ్రయత్నించి,

ఆతని రక్షింపవలయునని సంకల్పించితి. తోడనే మదీయజనకుని సందర్శించి, నగరమునం గొన్ని దివసములు ప్రచ్ఛన్నముగ సంచరించుట కనుజ్ఞ యొసంగవలయునని మిక్కిలి బ్రతిమాలితి. తుద కామహానీయుం డెట్టులో సమ్మతించి, నా కాపదవారయకుండ నొక ముద్రిక నొసంగెను. పాపా! ఆయపూర్వాంగుళీయ మనేకసారు లెట్టు లెటు లుపకరించెనో యెఱుంగుదుగదా.

"సార్వభౌమా! నే నాముద్రికం గాంచినది మొదలు తీవ్రానుమానతప్తుండనైతి. కాని, సార్వభౌమ పుత్రుం డంతిపురమునుండి వెలువడునని విశ్వసింపంజాలనైతిని—"

"ఐనను, యథార్థ మట్టులే బరిణమించె గదా. పాపా! మఱియొక విషయము చెప్ప మఱచితి. భవదారామ మందిరనివాసము కడు నక్కఱకువచ్చెను. ఎఱుంగుదు గదా—రవ్యానులతోడి ముచ్చట? జలాంతరగామి గుఱించిన నాగాథ యాలించునంతనే రష్యను రాయబారి సంధికొఱకు మఱియు దత్తరపడునని ఎఱింగియే యుంటిని. ఆమహత్తర కార్యమట్లు సులభసాధ్యమాయెను. ఆర్యా! ఇంక మఱియొక విషయము దలంపవలయు. కడుసంతాపకరము—"

"రాజేంద్రా! ఆయధమాత్మ, బహుళయువజనసంహారకారిణి యగు నారక్కసి నేనేల విచారింపవలయు."

"నిజమాడితివి. బాహ్యసౌందర్య మెంతగణనీయముగ నుండెనో అంతకంటె వేయిమడుంగు లధికతరపాపకళంకితయగునారాకాసినీకు దవ్వగుట వాంఛనీయమెగదా. అమీనా మస్రూలు సర్వము వెల్లడించి తమనేర మంగీకరించిరి. సిద్దీ కేవలమొక బానిసీఁడు—తనయేలికసాని యాజ్ఞానుసార మట్లు సంచరించెను. నేనా కారణమునం గరుణించి, వానికి మరణశిక్ష విధింపక యావజ్జీవకారాగృహావాసశిక్ష విధించితి. అమీనా ఇస్మిల్లాలన్ననో—ఈసరికి బాస్వరసు గర్భ

స్థులైయుందురు. జులేఖా! రెండు దీర్ఘసంవత్సరములు సుందరయువజనులఁ గబళించిన రక్కసి పట్టువడిన సువార్త నీజనకుఁ డీసమయమున నగరమునఁ జాటుచుండును. పురజను లిఁకఁ దమ పుత్రమిత్రభ్రాతృసందోహంబు లాకస్మికముగ దారుణముగ నంతరింపరని యెఱింగి హాయిగ మనఁగలరు.”

పాషా మొదలగువారు చిత్రముల పగిది నిరుత్తరులై చేష్టలుడిగి మిన్నకుండ, మహమ్మదుసుల్తాను తనయాసనము వీడి, మందహాస మొనరించి ఇట్టు లనెను.

“మన చిత్తముల విచారసంభరితము లొనరింపక, ప్రకృత సౌభాగ్యము దలంచి హాయిగ నుందము. పరమాత్ముని కృపాతిశయమున నీసౌఖ్యానుభవము నిరంతరముగుగాక!”

శ్రీ సాధన గ్రంథమాల,



ప్రకాశకులు:—అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయఁడుగారు

# సరస్వతీగ్రంథమండలి

# రాజమహేంద్రవరము

—:o:—

నవలలు - నవరసభరితములగు - నవలలు

ముచ్చటైన బొమ్మలతో ముద్దులొలుకు క్యాలికో బైండుతో

రెండు మాసముల కొక్కటిగా వెలువడుచుండును.

## నిబంధనలు

1. ఇందుఁ జందాదారులుగఁ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా రు 0-4-0 లు చెల్లింపవలయును.

2. ఇందు రెండు మాసముల కొక్కటిగ వెలువడుచుండు క్యాలికోబైండుగల ప్రతిగ్రంథమును 1-0-0 వెలకుఁ జందాదారులకుఁ బంపుచుందుము.

3. గ్రంథములఁ బంపుట కగుపోస్టేజీ మొదలగు కర్చులన్నియును జందాదారులే భరింపవలయును.

4. చందాదారు లగువారు వెనుకటిగ్రంథముల [illegible]టిని గొనవలయు నను నియమములేదు. కాని వారు కోరిన[illegible] పుస్తకములు కూడ, జందాదారుల వెలకే పంపుచు[illegible] వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదా[illegible] కొనుచుండవలెను.

5. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపు చుందుము.

6. ముందు ప్రకటింపఁబడు ఆఱుపుస్తకములకు రు 7-2-0 లు ముందుగఁ బంపువారికి ఆఱుపుస్తకములను అన్‌రిజిష్టర్డు పార్శిలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆఱుపుస్తకములకు చెల్లింపవల సిన మనియార్డరు కమీషను 0-12-0 లును రిజిష్టరుఖర్చు 0-12-0 లును 1-8-0 కూడివచ్చును.

ఇంతవరకు ప్రకటింపఁబడిన గ్రంథములు :—చిత్రపటశోభితములు

---

**ప్రేమసుందరి** నవరసభరితమగు సాంఘికనవల. క్యాలికోబైండు 272 పుటలు వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**చోరశిఖామణి** లోమహర్షమగు డిటెక్టివునవల. క్యాలికోబైండు 197 పుటలు వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**లక్ష్మీప్రసాదము** నవరసభరితమగు సాంఘికనవల. ఇందు మూఢురాండ్రగు స్త్రీలవలన కుటుంబములందు సంభవించు కలహములును అందువలన కలుగు కష్టపరంపరలు చక్కఁగా వర్ణింపఁబడినవి. 346 పుటలు వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు 1-8-0.

**[illegible]స్యము** జటిలమగు ఇతివృత్తముగల డిటెక్టివు నవల. తుదవరకు దోషులెవరో కనుగొనుటకు వీలు లేకుండునటుల దుండగులుపన్నిన పన్నాగము లత్యంతభయంకరములు వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**ఫాస్టు** (ప్రథమభాగము) అధిక... సర్వనియోగము-అభేద్యము లైన కోటలందు దురాచారుల దురంతములు మహాప్రళయము రహస్యమువలన గలిగిన తీవ్రమనోవేదనము, మున్నగు చిత్రవిచిత్రకల్పన, పాఠకమహాశయుల జిత్తరువుల గావించు చుండును. చందాదారులకు 1-0-0 ఇతరులకు 1-8-0.

**ఫాస్టు** (ద్వితీయభాగము) ఈశ్వర కృపాతిశయము, భక్తసంరక్షణము, భాగవతవిజయము, విమలప్రేమాభిరాములగు సాధుయువతీ యువజనుల కళ్యాణము మున్నగు నత్యద్భుతఘట్టములు చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు1-8-0

**కుముద్వతి** ఇందలిదుష్టకేతునిదౌష్ట్యముభయావహముమాయామారీచునిమాయలుభయంకరకృత్యములుచదివియానందింపుడు. ఇయ్యది నవలకాదు. నవరసరత్నాకరము. వీరశృంగార కరుణారసంబుల యేకీభావముచే త్రివేణీసంగమమునుఁబోలి చదువరులహృదయముల రసరంజితములుగ జేయును. వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు 1-8-0.

**చిన్నకోడలు** శ్రీయుత కాశీనాథ రఘునాథమిత్ర గారిచే మహారాష్ట్రభాషయందు వ్రాయబడిన ధాక ట్యాసూన్ భాయి నుంచి తెనిగింపబడినది. కథాచమత్కృతి నవీనము చిన్నకోడలు "లక్ష్మి" యొక్క శాంత్యౌదార్యాది సుగుణములును, పతిభక్తియు, మిక్కిలి పేదస్థితియందున్న సంసారమును తన చాతుర్యముచే లక్ష్మీసంపన్నముగాఁ జేయుట మొదలగు సంగతులు చదువవలసినవి. చందాదారులకు 1-0-0ఇతరులకు1-8-0

**రహస్యభేదనము**

రహస్యాపరాధ పరిశోధకనవల. కథా కల్పన మత్యద్భుతము. సంఘటనము లతి భయంకరములు. నిగూఢహత్యలెన్నియో వర్ణింపఁబడినవి. ఇది స్వతంత్రగ్రంథము. ఇతివృత్తమాంధ్రదేశమునకు సంబంధించినది. ఇట్టిగ్రంథ మిదివరకాంధ్రదేశములో వెలువడలేదు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**సింహగడము**

మహారాష్ట్రభాషలో శ్రీహరినారాయణ ఆపటేగారు విరచించిన గ్రంథమున కనువాదము. రమణీయమగు యీ కథ గాంభీర్యమై యుండును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**మణిహారము**

ప్రభాకరునివగిది ప్రకాశించు ప్రభాకరుడు, హృదయరంజనియగు రంజని, చంద్రునిబోలు విజయచంద్రుడు, వికసితహృదయపద్మినియగు పద్మిని సార్వభౌమలక్షణలక్షితుండగు అలకసుందరుడును చదువరి హృదయమును వివిధరసభావ తరంగముల దేలించును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

**మొగలాయీ దర్బారు**

ప్రథమభాగము

కీ. శే. ధీరేంద్రనాధపాల్‌గారి సుప్రసిద్ధగ్రంథరాజమున కనువాదము. ఇయ్యది నవరసభరితమై చరిత్రాత్మకమై, చిత్రవిచిత్రోపకథలతో విరాజిల్లుచు పాఠకమహాశయుల కెంతయు నానందదాయకముగ నుండును. అద్భుతసంఘటనములతో నిండి సులభశైలిని వ్రాయబడిన యీ గ్రంథమెల్లరు చదువతగియున్నది. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మొగలాయీ దర్బారు

రెండవభాగము

అనువాదకులు: మొసలికంటి సంజీవరావు

ప్రథమ సంపుటమందలి నిగూఢములైన దారుణ శవప్రదర్శనములు, పిశాచ కృత్యములు ఇందు భేదింపబడి చదువరుల నానందనిమగ్నులనొనర్చును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఘటనాచక్రము

అనువాదకులు:
గారపాటి
ఆంజనేయచౌదరి.

పాంచకడీదేవ విరచితమగు భీషణ పరిశోధకనువాదము. ఆశ్చర్యములకుఁ బుట్టినిల్లు, కౌతుకమునకు భాండారము, విచిత్రములకుఁ గనియై, పాఠకులను విస్మయసాగరమున ముంచివేయును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## రాజసుందరి

కర్త:
కేతవరపు వేంకటశాస్త్రి

ఆంధ్రదేశాత్మకమగు స్వతంత్ర కల్పనసాంఘికనవల. కథావిధానమత్యద్భుతము నిరుపమానము. వెలచందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## కుంకుమభరణి

అనువాదకులు:
శ్రీశివశంకరశాస్త్రి

ఇది సాంఘికనవల. మామూలునవలవలెగాక యిందు క్రొత్త చమత్కారములున్నవి. చదువుటకు మిక్కిలి మనోహరము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## జాగిలము

రచయిత:
శ్రీమతి
సీరము సుభద్రయాంబ

అతి భయంకర నిరూపక నవలారాజము. హంతకుడు భయంకరమగు జాగిలము సహాయమున చేయు హత్యలు హృదయవిదారకములు. అపరాధపరిశోధకులు యీవిషమ సమస్యను భేదించు టతి విచిత్రము. హత్యలపై హత్యలు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## సరస్వతి

అనువాదకులు:
శ్రీవాసుదేవరావు
శ్రీకృష్ణరఘుదేవరావు

మహారాష్ట్రభాషనుండి యాంధ్రీకరింపబడిన సాంఘికనవల. మనోహరకథావిధానము. శైలినాతికఠినము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఆనందాభాయి

కర్త:
కేతవరపు వెంకటశాస్త్రి

ఇయ్యది యూహాజనితమే యైనను చరిత్రసమ్మిళితము. పండితకవులచే మనోహరముగా వ్రాయబడినది. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## హత్యాన్వేషణము

అనువాదకులు:
గుర్రాల నారాయణరావు

అద్భుతమగు పరిశోధకనవలారాజము. ఆంగ్లేయగ్రంథమునుండి మనోహరముగా భాషాంతరీకరింపబడినది. తుదివఱకు చదివినగాని అపరాధిని తెలుసుకొనలేరు. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు 1-8-0.

## మొగలాయీ దర్బారు

తృతీయసంపుటము

అనువాదకులు: మొసలికంటి సంజీవరావుపంతులు

మొదటి రెండు సంపుటములవలె నిదియును చరిత్రాత్మకమై, నవరసభరితమై చిత్రవిచిత్రోపకథల కాలవాలమై మనోహరమై, యానందదాయకమై పాఠకుల కెంతయు విజ్ఞానప్రదమై యొప్పును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు 1-8-0.

## గంగి

కర్త:
చిర్రావూరి కామేశ్వరరావు బి. ఎ., ఎల్. టి.

గంగాచరిత్రము కరుణరసప్రపూర్ణము. ప్రేమ భావాత్మకము. శైలి కోమలమై, సుధామధురమై, తేటనీటివెల్లువవలె, ముద్దులొలుకుచుండును. చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మొగలాయీ దర్బారు

చతుర్థసంపుటము

అనువాదకులు: మొసలికంటి సంజీవరావుపంతులు

కథోపకథావల్లరులతో నల్లివిల్లిగ నల్లుకొనియున్న యీ నవలారాజము సర్వజనహృదయాకర్షణీయము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## కోహినూరు

కర్త:
చిల్లరిగె శ్రీనివాసరావు

ఈ కోహినూరు అమూల్యమైన వజ్రముగాదు. అతిమనోహరమైన చారిత్రిక నవల. శైలి మృదుమధురము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఆటీన్ మనేలా

అనువాదకులు:
జొన్నలగడ్డ సత్యనారా యణమూర్తి ఎం. ఎ.,

అత్యద్భుతమయిన డిటెక్టివునవల. ఇందలి మనేలా మర్మములు, మానవహంతకి మాయలు అనిర్వాచ్యములయి పాఠకులను విస్మయవిపరీతచేతస్కులను గావించును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## అపరిచిత

కర్త:
మాలే రాఘవరావు

మనోహరమైన సహజ సాంసారిక, సాంఘిక సంఘటనలతో వెల్లివిరియు అపూర్వ పరిశోధక నవలారాజము. ఇందలి ఇతివృత్తము సర్వజనహృదయానందప్రదము. క్రొత్తపోకడలతో గూడిన దీనిశైలి మృదుమధురము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## అంతఃపురము

ప్రథమ భాగము

అనువాదకులు: మొసలికంటి సంజీవరావు ~~పంతులు~~

సుప్రసిద్ధరెనాల్డ్సు గ్రంథరాజమునకనువాదము. తురుష్క చరిత్రాధారమగు నియ్యదిసర్వజనహృదయాకర్షణీయమైనది. నవరసభరితము - అందును శృంగారరసప్రధానము - అద్భుతసంఘటననిధానము. ఎల్లరు చదువదగినది. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

### అనుబంధ గ్రంథములు

## మృత్యురంగిణి

అనువాదకులు:
చిల్లరిగె శ్రీనివాసరావు

గొప్ప డిటెక్టివునవల. ఒకానొకసుందరియొక్క భయంకరకథ. నరహత్య - నారీహత్య-హత్యపైహత్యలు. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 0-12-0.

## అభాగిని

అనువాదకులు:
చిల్లరిగె శ్రీనివాసరావు

బాల వితంతువులు పడు కష్టములు. దుండగులుపన్ను కుట్రలు-సహజరీతినివర్ణింపబడిన నవరసభరితమగు సాంఘికనవల. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 0-12-0.

## ఛద్మవేషి
అనువాదకులు:
చిల్లరిగె శ్రీనివాసరావు

ఇది చక్కని పరిశోధక నవల. వెలచందాదారులకు 0-8-0 ఇతరులకు 0-12-0.

## విదురనీయుపదేశములు
కర్త:
కేతవరపు వేంకటశాస్త్రి

చిత్తస్వాతంత్ర్యము-సత్యవాక్యపరిపాలనము-నీతి బలము-ధర్మోపదేశము జదువదగినవి. వెల చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 1-0-0.

## కాంచనమాల
అనువాదకులు:
శ్రీశివశంకరశాస్త్రి

అశోకుని కాలమునాటి బౌద్ధమతధర్మ ప్రచారముల దెలుపునవల. వెలచందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## సీమంతిని
కర్త;
ములుకుట్ల వేంకటశాస్త్రి

పౌరాణికగాథ. నీతిదాయకము. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 1-0-0.

## సుశీల
అనువాదకులు:
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి బి.ఎ. ఆనర్సు

పతివ్రతయగు నీమెచరిత్రము హృదయవిదారకమయ్యును ప్రగాఢ ప్రణయాదర్శము జూపి యనేకుల పవిత్రుల జేయకమానదు. చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 1-0-0.

## శశిరేఖ
కర్త:
గుడిపాటి వెంకటాచలం
బి.ఎ. ఎల్-టి.,

ప్రేమమూర్తియగు శశిరేఖ ప్రియుని తరువాత ప్రియుని స్వీకరించుట యెట్లవసరమయ్యెనో అయినను ఆమె నిర్మలచారిత్రి యెట్లయ్యెనో వ్రాయబడినది. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## యమునాబాయి
అనువాదకులు:
శ్రాపవరపు నరసింహము

తమతమ పరిస్థితులను పరిశీలింపని ప్రేమాంధులగు యువతీయువకుల కీగ్రంథమత్యంత బోధప్రదము. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 0-12-0.

శ్రవణానందదాయకములై హాస్యరస పూరితములైనొప్పు వివిధకథల సంపుటము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు 1-0-0

...దకులు·
...లగడ్డ సత్యనారాయ
...మూర్తి బి.ఎ., ఆనన్ను

కరుణరసపూరితము, విషాదాంతము నగు చరిత్రాత్మక నాటకరాజము. మనోహరగీతములు కలవు. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు 1-0-0.

## దుర్గాదాసు

అనువాదకులు:
జొన్నలగడ్డ సత్యనారాయ
ణమూర్తి ఎం. ఎ.,

వీరరసపూరితమును, ద్విజేంద్రుని విరచితములలో మిగుల పవిత్రమును నగు నైదంకములచక్కని నాటకము ముఖ్యముగ చదువతగినది. చందాదారులకు 0-8-0 లు ఇతరులకు రు 1-0-0.

ఇట్టివే చక్కని నవలలు పలువురు కవులచే రచింపఁబడుచు రెండు మాసముల కొకటిగా ప్రకటింపఁ బడును.

సరస్వతీ గ్రంథమండలి,
రాజమహేంద్రవరము.

